

# విషయానుక్రమణిక

## అక్టోబరు, ... డం కేవలం



త్రివర్ణ చిత్రము : రాసలీల—మొక్కపాటి కృష్ణమూర్తిగారు

వేవో చల్లగ ధర్మపన్నముల నెన్నో చెప్ప ముం దింత యే
దోవో తిండికి చూచుకోవలెనో లేదో శూన్యగేహంబునన్.

పాలిపోయిన దున్నల పాలపడిన
అతుకులంటల నాగలి హాలికుడవు
నీవు-మల్లన్నతోడ్పాటు- నేల చవిటి
వర్ర-బాపన సేద్యము- బాగు బ్రతుకు
తెరవునకు జెప్పవలసిన దేమి కలదు
విత్తనాలైన మల్లెడి విధము వలదే ?

రావుసింగమహీపాలరాజకొలువు-భారతీదేవి కాటల పట్టుగొమ్మ
వాస్తవంబుగ బుధులు సర్వజ్ఞు డనుట-లో విశేషము లేని సుశ్లోకు డతడు.

కొమ్మని సత్కవీంద్రులకు కొల్లలుగా ధన మిచ్చినాడు లో
కమ్మున బేరునొందిన యఖండయశంబు గడించినాడు నీ
సమ్మతి నొంది భాగవతసత్కృతి కైకొన గోరుచున్న వా
డమ్మనుజాధినేత విను మాతడు మెచ్చిన దక్కవే మికన్.

ఈడువచ్చిన కన్యక నెంతకాల-మింట నుంచెద మటుచేయకుంట లెస్స
కన్యయె వృణించు స్వయముగ గాంతు కాని-యెడల దప్పదు గాంధర్వ మెప్పుడేని.

చెల్లునో చెల్లదో యిటుల జెప్పితి దోచినరీతి చూడగా
నొల్లక మీ దరిద్రదశ యొప్పగొ తప్పగొ నీ వెరుంగవే
బల్లిదు లౌచు మీరు బహుధంగుల చింతల దూలుచుండ మా
యుల్లము చల్లనౌనె సుఖ ముండియు నేమి ప్రయోజనంబగున్ ?

ఈపని కీ వొడంబడితివేని సతంబును కాలుమీద గా
ల్మోపుక గూరుచుండి సుఖభోగము లొందెద వెంతయేని నీ
వోపెద యట్లుగానియెడ నూకొని రా జొనరించు సేతకున్
కాపుర మున్న యీ యినుపగజ్జెలతల్లి విధించు కైదుకున్.

కడుపే నిండని కార్యసాధనలకై గష్టింపగా నేల నీ
మిడిమేలంపు దరిద్రసంకటవిధి న్మీరంగ లేకుంటి వీ
వడుగ న్నాకడను వైరిరా జెవడు నీ కామాటయే లేదురా
ముడు నీవా డయి కూర్చు నేమొ సిరులన్ ముందేల కాదంచనన్.

తెలిసి యవ్యక్తమున బడు తెన్ను దోచె-విష్ణురూపుడుగాక భూవిభుడు కాడు
అతని కిడు కృతి శ్రీహరి కర్పణమెగ-నిర్విచారపథంబు వే నిర్ణయింపు.

# 'ఉదీర్ధ్వం జీవో!!'

[ఊహాచిత్రము]

•

శ్రీ తెన్నేటి సూరి

"ఉదీర్ధ్వం జీవో। అసుర్నఆగాద్ ప్రపాగ్ ఆత్తమ ఆజ్యోతిరేతి
అరైక్పంధాం యాతవే సూర్య అగన్మ యత్రః ప్రతిరంతరాయుః" —ఋగ్వేదము

"ఉదీర్ధ్వం జీవో!!!"—

"అబ్బా!......"

"ఉదీర్ధ్వం జీవో!!!"

"ఆ!......నే నెవరను...?"

"ఉదీర్ధ్వం జీవో!"

"అవును......ఆ శబ్దము వచ్చుచున్నది...నాకు వినబడును."

"ఉదీర్ధ్వం జీవో!"

"నేను బ్రతుకుచున్నానా? లేకున్నానా?—ఏదో ఒక యుగాంతమందు చైతన్యమును కోల్పడి, స్తబ్ధములై, శబ్దగ్రహణశక్తిని నశించిపోయిన నా శ్రోత్రపుటములలో జివ్వుజివ్వున నేడు విద్యుత్తరంగములు ప్రవహించుచున్నవి."

"శరీరము పులకించుచున్నది—ఈ అంధకార గర్భమునంతయూ జ్వలించుచూ బగల్ప్రిబోనికస్తై, గగనపథమున మ్రోగుచున్న యీ విశుద్ధగోళధ్వని యెవరిదీ?—యెవరు వారూ?—

"లెమ్ము నాయనా! నేనే!"

"భగవంతుడవా?—"

"కాదు—లేచిరమ్ము"

"విశుద్ధమైన మీ శాంతగంభీరమంగళనిస్వనము పూజ్యపాదులైన నా వంశకర్తల గాత్రధ్వనిని పోలి యున్న దే!—యెవరు మీరూ?"—

"దివ్యర్షుల పునీతరక్తము నా నాళములలో ప్రవహించుచున్నది. నా గాత్రమునకు కొంచెము పోలిక యుండవచ్చును. చిమ్మచీకటు లలమియున్న ఆ యంధకారగుహాకుహరాంతరమునుండి బయటికి లేచి రమ్ము. ఆ మృత్యుగర్భమునుండి బయల్పడుము—ఇచ్చట దిగ్దిగంతముల విస్ఫురితము గావించుచు, ఉజ్జ్వలముగా మహోదయ మగుచున్నది; పునీతము లైన యీ అమృతకిరణములలో స్నాతుడవై సజీవుడవు కమ్ము!"—

"ఓ ప్రాజ్ఞ్యుడా! క్షమించి నన్ను విడువుము; నేను నమస్కారము చేసెదను—"

"ఎందు కంత కలవరము!"

"నాకు చాల భయముగా నున్నది."

"కారణము?—"

"ఆ తేజఃపుంజములలో నేను బ్రతుకజాల నేమో!—యుగయుగములుగా యీ చీకటిలో బ్రతుకుటకు నా శరీరము అలవాటుపడియున్నది."

"భ్రమపడకుము—అసలు నీ విప్పుడు బ్రతికి లేవు; నీవు తిరిగి సజీవుడవు కావలయునన్న యీ అమృతరేఖలు నీపై ప్రసరింపవలసియున్నది."

"క్షమింపుడు—జీవితాశ...నాకు లేదు."

"వ్యర్థుడవు కాకుము—నీవు బ్రతుకునట్లు చూచుట నా విధి."

"ఆ!...ఎందు కింత బలవంతము?—"

"ముందు లేచివచ్చెదవా?—"

"అంత ఉజ్వలముగా పిలువకు స్వామీ!— ఆ పిలుపు నాకంఠమును పాశమువలె బిగించి, ముందుకు పడనీడ్చుచున్నది. పడిపోవుచున్నాను."

"అట్లయిన పిలువను లెమ్ము...నీయంత నీవే నెమ్మదిగా లేచిరమ్ము"—

"నేను చాల బలహీనముగా నున్నానయ్యా! లేచి నిలచిన తూలిపడిపోయెదనేమో...లేచి నిలచుటకు అసలే నా శరీరములో ఎముక లుండవలెనా?—"

"నీ శరీరములో బలిష్ఠమైన ఎముక లున్నవి. నీబలము నీవు తెలుసుకొనజాలకున్నావు—అనంతమైన బలసంపన్నతి నీలో కలదు; దైన్యభావములను విదలించివైచుకొని, నీ శక్తినంతయు ఒక్కుమ్మడి జృంభించి, చివాలున లేచి నిలువుము."

"ఆశ్చర్యము స్వామీ! ఇంద్రజాలము వలె నున్నది. నాలోనున్న శిరనాడు లన్నియు కదలి మేల్కొనుచున్నవి అనాదిముక్తకము నాశరీరమంతయు యేవో శక్తితరంగములు వ్యాపించుచున్నవి— ఇదుగో! చివాలున లేచినిలచినాను."

"మంచిపని చేసితివి. ఇక కదలిరమ్ము!"

"నా కాళ్లకూ, చేతులకూ లోహశృంఖలములు తగిలించియున్నవి. నడచుటకుమాత్రము వీలుపడదు లెండు."

"అసంభవము—నీవు మానవుడవు—లోహశృంఖలములు నిన్ను బంధింపజాలవు. నిన్ను నీవు బంధించుకొనకున్న, నిన్ను బంధింపగల శక్తి యీ బ్రహ్మాండమున లేదు."

"మరి వీని నేమందురు స్వామీ!"

"నీ పాదముల గమనమును ప్రతిరోధించుచున్నవి లోహములు కావు—నీ ఊహలతో నిన్ను నీవు బంధించుకొనుచున్నావు. అవి విభ్రాంతచేతస్కుడవైన నీ యూహలు—త్రెంచుకొనుము."

"ఏదియో చెప్పుచున్నారు—అయినను ప్రయత్నించిచూచెదను...ఆహా! విపరీతముగానున్నదే!... ఈ లోహములు సర్పములుగా మారి, నా పాదముల నుండి దిగజారి, యీ అంధకారములో లీనమైపోయినవి—సరే, వచ్చుచున్నాను...స్వామీ!"—

"ఏమి నాయనా?"—

"నేను బయటికి రాగలుగుట అసంభవము—నా చుట్టును ఉక్కుతలుపులు మూసుకొనియున్నవి."

"ఇదియు నీయూహాకల్పితమగు మరియొక దుర్భ్రమ; నిశ్శంకుడవై ముందునకు నడచిరమ్ము; నీ ముందు నిరోధము లేవియూ లేవు."

"అబ్బా!..."

"ఏమైనది?"—

"తల పగిలిపోయినది—రక్తము స్రవించుచున్నట్లున్నది."

"కలవరపడకుము—అసలు నీకు దెబ్బతగులనే లేదు."

"క్షమింపుడు—ఏదో తగుల నేతగిలినదని భయపడితిని. అసలిచ్చట నిరోధము లేవియు నున్నట్లు కాని ఎంచుటలేదు. ఉక్కుతలుపులు భూగర్భములోనికి కరంచుకొనిపోయినట్లున్నవి.

"మంచిపని జరిగినది—సరే, ఇక త్వరగా నడచిరమ్ము."

"వీరా రేమి చెప్పుచున్నారు—ఈ నిమ్నోన్నతములలో గండశిలలు తగిలి నా మోకాళ్లు బ్రద్దలై రక్తము లోడిపోవుచున్నవి. కన్నులు పొడుచుకొన్నను కనుపించుటలేదు—ఈ చీకటిలో నడచుటెట్లు? ఎచ్చట నేమి తగిలి తల పగులునో!—అబ్బా!!! ...ఎంత దెబ్బ తగిలినదీ!"—

"తొందరలేదు నాయనా......నెమ్మదిగా రమ్ము."

"ఈ అంధకారగర్భమున మార్గమే కనుపించుటలేదు—ఎటువైపునకని నడచిరావలయును?"—

"ఇదుగో, నా చిటికెనవ్రేలు పుచ్చుకొనుము—నా అడుగులో అడుగుగా, వెన్ను నానుకొని, నెమ్మదిగా నడచిరమ్ము."

"ఎందరు చెప్పుట లేదు ?"—

"ఆ చెప్పుచున్నవారు పట్టి అజ్ఞానులు."

"నా దైవమును దూషించుచున్న ఆ నీచుల సంగతి మీకు తెలియదు లెండు."

"నీ దైవమును దూషించువాడు తన దైవమును తాను దూషించుకొనుచున్నాడు"—

"బాగున్నది మీవాదము"

"ఎవరికైనను ఉన్నవాడు భగవంతుడొక్కడే"

"క్షంతవ్యుడను"—

"అది సరిగాని — ఈ మానుషాభిమానము నుండి భగవంతుని రక్షింపుమని ఈ అధికారము నీ కెవ్వ రిచ్చినారోయీ ?—భగవంతుడు నీ రక్షణ లేనిది బ్రతుకజాలనంత బలహీనుడని నీ కెవరు చెప్పిరి?"

"సమాధానము చెప్పుకొనజాలనుగాని నా సోదరుని రక్షణమాత్రము నా కవశ్యకర్తవ్యము—ఈ ఖడ్గముతో ఆ కిరాతుని సంహరించుచున్నాను."

"సంహరింపవలసినది ఆ కిరాతుని గాదు ; యుగయుగములుగా నీలో స్తబ్ధముగా దాగియుండు నీ బలహీనసమయములను అవకాశముగా తీసికొని పైశాచరూపమున బయల్పడజూచుచున్న నీ పశుత్వమును"—

"ఏమో వచించెదరుగాని, సోదరుని హత్యను కన్నులార జూచుచూ ఇట్లూరకుండవలసినదే నటయ్యా?"

"హత్యచేయబడనున్న నీ సోదరుని రక్షణార్థము నీ వేమి త్యాగము చేయగలవు?"

"ఏమిచేయను—ప్రాణము లొడ్డెదను."

"ధీరునివలె మాట్లాడితివి—అట్లు చేయుము ; నీ సోదరునికంఠముపై నీకంఠము నాచ్ఛాదనగా నిడి ఆ కిరాతుని ఖడ్గము నాకు బలిగా నొసంగుము"

"నా కంఠము తెగిపోవలయుననియా మీ యూహ ?"

"నీసోదరుడు రక్షింపబడును."

"నా సర్వనాశనముసంగతి తలపోయరేమండీ !"

"నీకు నాశము లేదు—నీవు అనంతుడవు. కన్నులు తెరువుము. కల్పాంతముదనుక నీ దృష్టిని ప్రసరించి చూచుకొనుము—నీవు శాశ్వతుడవు".

"స్వామీ సిద్ధ... నా కంఠమును నా సోదరుని కంఠమునకు రక్షణగా ఆచ్ఛాదించుచున్నాను."

"అమరజీవివి కమ్ము ! ఈ ఖడ్గాఘాతము నీ కంఠమున విజయమాల యగుగాక !—నీ శత్రువులెల్ల నశించిరి."

"ఓ మహానీయుడా ! నన్నాశీర్వదింపుము... మీ దివ్యనామముతో పవిత్రములైన ఆ యక్షరపంక్తులైన తెలిసికొననైతిని."

"అహంకారములకు తావలములైన ఈ నామములతో పని యేమి నాయనా ?—విజయమూర్తివై నిరంతరాయముగ శిఖరాగ్రమున వర్ధిల్లుము—మంగళమగుగాక ! నీకు సర్వదా నా ఆశీస్సులు కలవు."

"చరితార్థుడను."

"మరి యిక నేను పోయివచ్చెదను... నాకు పిలుపు వచ్చినదే."

"ఆఁ ! ఆ !...భయదము !! కర్ణపుటములు చిటిలిపోవునట్లీ పిడుగులురిమిన ప్రళయాంభోదమెవ్వరు !!!—ప్రభూ !!!"

"హరే రాం !!"

"......మహాత్మా !!!..."

# అంగయ కన్యాంబ

## శ్రీ కోట సుందరరామశర్మ

ఈ సమాసం ధూర్జటి రచించిన 'శ్రీ కాళహస్తి మాహాత్మ్యము' లోనిది. మూడవ ఆశ్వాసంలో నత్కీరుని కథ వస్తుంది. ఆ నత్కీరుడు పాండ్యదేశపు ఆరాజాస్థానంలోవాడు. కవిత్వానికి సంబంధించిన ఒక విషయంలో శివునితో వాదం పెట్టుకోగా, శివు డాతణ్ణి శపిస్తాడు కుష్ఠరోగివి కమ్మని. శాపమోక్షం వేడగా, కైలాసశిఖరంచూస్తే రోగనివారణ అవుతుం దని శివుడు సెలవిస్తాడు. నత్కీరు డప్పట్లే తీర్థ యాత్రాపరుడై పోతూ, ఆర్యావర్తం చేరుకొంటాడు. ఇంకా కైలాసం ఎంతో దూరం ఉంది. దారిలో యాత్రికు లందరికీ సంభవించిన ఒక భూతమువల్ల కలి గిన బాధను నివారిస్తాడు సుబ్రహ్మణ్యస్వామి. నత్కీ రుడు ఒక్కడూ మిగిలి 'సేనాని'ని ప్రార్థిస్తాడు తన అవస్థ వివరిస్తూ. అంత కుమారస్వామి, "శివుడు కైలా సమే అన్నాడుగాని 'ఉత్తరదిశాకైలాస' మనలేదు గదా. దక్షిణకైలాసమయిన శ్రీ కాళహస్తిదర్శనం చేస్తే చాలు. నీ శాపం పోతుంది" అని పలుకుతాడు. పైగా "ఈ చెరువులో స్నానం చెయ్యి. ఒక్క మాటుగా శ్రీ కాళహస్తిలోకి వెళ్ళగలవు" అనికూడా ప్రసాదిస్తాడు. నత్కీరు డప్పట్లే స్నానంచేసి తలయెత్తే సరికి, శ్రీ కాళహస్తి ప్రత్యక్షమయి, అతని కుష్ఠవ్యాధి పోతుంది.

ఈ పై కథనుబట్టి నత్కీరచరిత్ర ఈ కాళహస్తి మాహాత్మ్యంలో రావలసివచ్చింది.

ఈ నత్కీరచరిత్ర అరవవాఙ్మయంలో ప్రసిద్ధ కెక్కిందే. మన తెలుగులో 'నత్కీర' అంటే, అర వంలో 'నక్కీర' అని ఉంది.

పాండ్యరాజ్యానికి మధురానగరం ముఖ్యపట్టణం. కాబట్టి ఈ కథలో మధురానగరవర్ణనకు ప్రసక్తి వచ్చింది. ఈ సందర్భంలో ధూర్జటికి అరవవాఙ్మయ పరిచయం కలిగిఉంటుంది. ఈ వ్యాసానికి హృదయము ఇదే. ఏతత్పరిచాయకములయిన నాలుగైదు ముక్కలు దొరుకుతాయి. వరుసగా వాటిని పేర్కొని వివర్ణించు కొందాం.

### ౧. వాలవాయి

"కపటచతుష్షష్టికళల నాడిన వాల
వాయి చొక్కళు నివాసభూమి" (మధుర)

తెలుగుపంక్తినిబట్టి చూస్తే 'వాలవాయి' అనే పదం తప్పు. 'ఆలవాయి' అని ఉండాలి. అరవంలో 'ఆలం' అంటే విషము. వాయి అంటే నోరు. విషము నోటియందు కలది సర్పము. 'హాలాస్య' క్షేత్ర మనగా మధుర. హాలము (విషము) ఆస్యమునందు కలది అని అర్థము. ఈ పేరు ఎలా వచ్చిందో కొంచెం వివరిస్తాను.

వెనుక ఒకానొక పాండ్యరాజు—శివభక్తుడు—తపస్సుచేసి శివుణ్ణి ప్రత్యక్షంచేసికొని . శివసాయుజ్య మిమ్మని ప్రార్థిస్తాడు. "రాజధర్మాన్ని అనుసరించి రాజ్యపాలన చెయ్యి, తరువాత నీకు మోక్ష మిస్తా" నంటాడు శివుడు. శివభక్తిలీనుడయిన రాజు, "రాజ్య మేమిటి, రాజధాని ఏమిటి" అని అడుగగా, నాగభూష ణుడు తన ఒంటిమీది ఒక సర్పమును క్రిందికి విసరి వేస్తాడు. అది మహాసర్పమై పెద్దవలయాకారంగా చుట్టుకొంది. ఆ వలయము మధురానగరముహద్దును సూచించింది రాజునకు. అందువల్ల మధురకు 'ఆల వాయి' అనే పేరు వచ్చింది.

ఇక 'వాలవాయి' అని ధూర్జటి వాడడాని కారణం. శ్రీశబ్దభవమైన 'తిరు'+ఆలవాయి కలిసి, 'తిరువాలవాయి' అని అరవభాషలో ఉంది. తీసి వేయగా మిగిలిన 'వాలవాయి'ని ధూర్జటి వాడినాడనడం భాషాశాస్త్రదృష్ట్యా సమంజసంగానే ఉంది.

ఇక ఇక్కడ ఒక చమత్కారం చూపి, ధూర్జటి వాడిన 'వాలవాయి' పదాన్ని సమర్థించవచ్చు. వాల మనగా తోక (అరవమందుకూడాను). వాయి నోరు. ఇక వాలవాయి అనగా, సర్పము చుట్టచుట్టు కొన్నప్పుడు, నోరు తోక కలిసికొన్నవికదా. ఈ పదం సర్పం వలయాకారంగా చుట్టుకొన్నదని నిరూ పిస్తోంది.

### ౨. కూడలళఘుయ

ఈ పదం ఈ మధురానగరవర్ణనకు సంబంధించిన సీసపద్యంలోనే ఎత్తుగీతిలో "కూడలళఘుయవైకుంఠ, కుంతితాఘు" అని 'అళ ఘుర్' అనగా అందమైనవాడు అనే అర్థంలో మధు రలో ఉండే విష్ణుదేవునికి పేరు. అయ్య (అయ)అనే ఆర్యవాచకంచేర్చి, అళఘుయ అని ధూర్జటి తెలుగులో

ప్రయోగించాడు. 'కూడలళఘుయ' అంటే, ఘోరవర్షం మధురానగరంలో కురవబోగా, ఈ విష్ణుదేవుడు తన మహిమను వెలయించాడు. నాల్గు పెద్ద మేఘములు అడ్డువచ్చి ఆకాశమంతా వ్యాపించినాయట, పైనున్న మేఘాలు వర్షం కురవకుండా. ఈ నాల్గుమేఘముల కూడలి-కలయిక గల విష్ణువునకు 'కూడలళఘుయ' అనే పేరు వచ్చినట్టు అరవవాఙ్మయం చెపుతోంది. ఈ వైష్ణవస్థలం మధురకు పద్ధెనిమిది మైళ్ళ దూరంలో ఉంది.

## 3. మణ్ణాస, పెణ్ణాస

శివుడైన నత్కీరుడు తీర్థయాత్రలు చేస్తూ, ఉణ్ణాముల ప్రదేశం దగ్గఱకు వచ్చాడు. ఉణ్ణాముల అంటే 'అపీతకుచాంబ'. ప్రపంచాలన్నీ కన్న తల్లి గారి (అమ్మలగన్న యమ్మ, ముగురమ్మల మూలపుటమ్మ—భాగవతం.) కన్యగా నెలిసింది. ఆమెను దర్శించాడు నత్కీరుడు.

"ఉణ్ణాముల జగదంబిక
నణ్ణామలవిశ్వనాథు సారాధించెన్"

ఈ అణ్ణామల అరుణాచలం. అరుణపదం అణ్ణ, అణ్ణ క్రింద మారింది. అచలశబ్దంలోని అకారం వలన సవర్ణదీర్ఘసంధి వచ్చి అణ్ణా అని దీర్ఘరూపం కనిపిస్తోంది. ఇక పర్వతిపర్యాయమైన 'మలై' (మల) కలిసి 'అణ్ణామల' అయింది—జ్యోతిర్లింగం ఉన్న చోటు. ఈ అచలశబ్దం తెలుగువాళ్ళ పేర్లలోనూ ఒక విచిత్రం కలిగించింది. తెలుగువారి దేవుడయిన వెంకటాచలపతి, శేషాచలపతి (వేంకట+అచల) (శేష+అచల) అని కావలసివస్తూవుండగా, తెలుగువాళ్ళలో ఎంతమంది చలపతిరావు లున్నారో!

పైన ఉదాహరించిన కందానికి ఉత్తరార్థము—

"మణ్ణాసయు బొన్నాసయు
బెణ్ణాసయు లేనివారి పెన్నిధు లగుటన్"

ణకారద్విత్వప్రాసను గమనించండి—పూర్వార్థంలో అణ్ణామల ఉణ్ణామల మార్చరానివి. ఇక, మణ్ణాస = మణ్+ఆస (అరవసంధి). తెలుగులో మన్ను+ఆస = మన్నాస అనే అంటాం. రాజ్యాశ, లేక భూసంపాదనేచ్ఛ అని అర్థం. అరవంలో మణ్ అనేగాని, 'మణ' అని నేల,మన్ను అనే అర్థంగల పదం లేదు. దంత్య, మూర్ధన్యములయిన 'న ణ'ల ఉచ్చారణకు ఆ భాషలో చాలా పట్టింపు. అలాగే 'పెణ్+ఆస' యున్నూ. పెణ్ అనగా స్త్రీ (తెలుగులో పెంటి). ప్రాసస్థానంలో లేని 'పొన్నాస'లో (బంగారుమీది ఆశ) పొన్ దంత్యనకారాంతమే.

ఈపద్యాన్నిబట్టి ధూర్జటికి అరవభాషాపరిచయం ఉందంటారా, లేదా చదువరులు.

## ౪. ఓదిపిచ్చ నయనారి

ఇంకా నత్కీరుడి యాత్ర పూర్తికాలేదు. తిరువత్తూరిపురంలో ఈ నయనారు ప్రతిష్ఠ జరిగింది. నయనార్లు శివభక్తులు. ఈ ఓదిపిచ్చ నాయనారనే పేరుకు అర్థమేమిటి? (ప్రతిపేరునకు ఒక అర్థముండవలయునుగదా!)

ఆదిభిక్షునయనార్ అని ఊహించడానికి సావకాశం ఉంది. భిక్షుశబ్దానికి అరవంలో ఇప్పటికీ 'పిచ్చు' అని తద్భవం పేర్లరూపంగా కనిపిస్తోంది. పిచ్చుఅయ్యర్ మొ. ఇక 'ఓది' 'ఆదికి' సంబంధించినదై ఉంటుంది. ఆదిభిక్షువు శివుడు. నయనారుకా పేరు ఎంతో తగి ఉంటుంది.

## ౫. అంగయకన్యాంబ

ఇప్పుడు కడపటికి, 'అంగయకన్యాంబ' సమాస విచారణకు వద్దాం. దీన్ని వ్యాకరిద్దాం:

అల్+కయల్ = అంగయల్ అని అరవంలో అవుతుంది. అందమైన చేప అని అర్థం. కణ్ = కన్ను. అంగయల్+కణ్ = అంగయకణ్ణ్ అందమైన చేపవంటి కన్ను. అది కలది 'అంగయకణ్ణి.'

మధురమీనాక్షికి ఈ పేరు అరవవాఙ్మయంలో వాడతారు. ధూర్జటి అంబాశబ్దం చేర్చాడు, ఉపపదంగా. అంగయకణ్ణి+అంబ=అంగయకణ్ణ్యాంబ కావాలి-సంస్కృతసంధిసూత్రంప్రకారం యణాదేశం వచ్చి. లేదా అంగయకణ్ణంబ కావాలి తెలుగు సంధిప్రకారం. కాని అంబాశబ్దం అనేకఆకారాంత సంస్కృతపదాలకే చేరుతూఉండడంచేత, సంస్కృతప్రియమైన తెలుగుకవిమనస్సుకు కన్యాంబ అని వాడడం నచ్చింది. పైగా 'క' ద్విత్వము తీసివేసి వినసొంపుగా ఉండేటట్లు 'అంగయకన్యాంబ' గా ప్రయోగించాడు ధూర్జటి.

"గంగాధరుని మహోగ్ర
పాంగము రతి విధవ జేసె నాలోపల మా
యంగయకన్యాంబకృపా
పాంగం బంగజుని దేవి పైదువ జేసెన్" (3-33).

ఇంతకూ ఈవిధంగా క్షేత్రము ఉనికినిబట్టీ, అచటి వాఙ్మయమునుబట్టీ, ఇతరభాషాపదము లాయా పురాణములలో దొర్లుచుండు ననుట స్పష్టమవుతోంది. ధూర్జటికి అరవభాషాపరిచయ ముం దని—ఈ చర్చవలన మనం తెల్పుకోగలుగుతున్నాము.

# భాష-దాని ఉత్పత్తి స్వభావములు



శ్రీ గురుభాగవతుల ధర్మారావు

భాషాపరిణామంలో మూడు దశలు ఒకదాని తరువాత మరొకటి విశిష్టంగా కనుపిస్తవి. మొదటిది బహుపురాతన మైనది. ఈ దశలో జంతువులు తమ మనోవికారములను తెలుపుటకు చేయు గొంతు ధ్వనులకు కారణము కేవలము అవి జన్మతః సంపాదించిన ప్రవృత్తియే (*Instinct*). ఇదిగాక, అవి చేయు శబ్దములందే ఆ శబ్దముల భావము ఇమిడియుండును.

రెండవ దశ: ఇదికూడ జంతువులకు సంబంధించినదే. ఈ దశలో పెంపుడుజంతువులు మనము చేయు కొన్ని కంఠధ్వనుల కర్థము జతపరచగలవు. కాని ఈ అర్థ గ్రహణము జంతుస్థజీవవస్తువు (*Germplasm*) పైగాక, కేవల బాహ్యపరిస్థితిపై ఆధారపడియుండును. ఇక మూడవ దశ—మనుష్యజాతికి సంబంధించినది. ఈ దశలో ఫలానాశబ్దానికి ఫలానా అర్థమని కల్పించుట, అది నిర్ణయించుట మనుష్యుడే చేయును. ఈ మూడు దశలున్నూ మరికొంత పరిశీలిద్దాం.

ప్రాణసృష్టియందు మూలమువద్దనున్న కొన్ని జంతువులలో భాష కేవలము ప్రావృత్తిక (*instinctive*) మని చెప్పవచ్చును. అనగా తమ మనోవికారములను వ్యక్తీకరించుటకు అవి చేయు ధ్వనులు, పుట్టిన తరువాత అవి అలవరుచుకొనిన అనుభవజన్యములు గాక—భయావేశమున పరుగెత్తుట, ఆకలికై వేటాడుట ఇత్యాదివ్యవహారములవలె—కేవలము స్వాభావిక ప్రవృత్తులే. జంతువుల యరుపు లెట్లు ప్రావృత్తికములో, ఏకజాతికి జెందిన మృగములు తమతమ ధ్వనులర్థముచేసుకొనుటకూడ ప్రావృత్తికమే. ఒక కుక్కగాని, పిల్లిగాని భౌ అని, మ్యావు అని అరచినప్పుడు, ఆజాతికి చెందిన కుక్కలు, పిల్లులు ప్రకృతి (*Nature*) పుట్టుకతోనే ప్రసాదించిన సాధనసామగ్రి (*Neuro - Sensory Equipment*) వల్ల అర్థము చేసుకొనును. జంతుసమూహములలో ధ్వనులుచేయుట, ఆధ్వనులను అర్థము చేసుకున్నట్లు తెలుపుటకై అవి చేయు కార్యములు—ఈ రెండును స్వాభావిక ప్రవృత్తిజన్యములే. ఈ ధ్వనులయొక్క అర్థములు ఆ ధ్వనులలోనే అంతర్భూతమై యుంటవి.

పెంపుడు జంతువులను కనిపెట్టిచూస్తే ఒక విశేషం గోచరిస్తుంది. అవి మనము చేయు కంఠధ్వనులను బోధపరచుకొన్నప్పుడు, ఆ యర్థము కేవలము వాటి అంతరశక్తులపైగాక కొంతవరకు బాహ్యపరిస్థితిపై కూడా ఆధారపడి ఉంటుంది. కుక్కకు స్వాభావిక నిరోధక్రియ (**Conditioned Reflex**) అని చెప్పబడు ఒక నరముల నిర్మాణవిశేషము కలదు. అందుచేత, మనం షేక్‌హాండ్ అని చేయిచాచినప్పుడు, ఆ మాటలను అర్థం చేసుకోలేక పోయినా, ఈ 'నిరోధక్రియ' వలన అర్థముచేసికొని మోకాళ్ళలో ఒకటి పైకెత్తును. మొదటి దశకును, రెండవదశకును భేద మేమనగా—మొదటి దశలో కంఠ ధ్వనులను అర్థం చేసుకొనే శక్తి దాని ప్రకృతిలో ఉండును. రెండవ దశలో—అర్థగ్రహణము బాహ్యప్రపంచ సహాయము వలన కలుగును.

కుక్కవలె అన్నిజంతువులూ 'నిరోధక్రియ' కలవి అని చెప్పుట కష్టం. కాని, షేక్‌హాండ్ అని మనము దానికి చెప్పినపుడు ఆ యాదేశము కేవలము తన ప్రాకృతిక ప్రవృత్తివల్లకాక బాహ్యప్రపంచపు సంపర్కమువల్ల కలిగిన అనుభవంచేత అది గ్రహించగలిగింది.

ఇక మూడవదశ. మానవసమాజమునందు కంఠధ్వనులు చేయు మనుష్యులే యీ కంఠధ్వనుల కర్థము

కల్పించుచున్నారు. ఒక ఉదాహరణ—'దా' అని మనము శిశువును పిలిచినప్పుడు, ఆ శబ్దమునకు మనము "నీ వున్న స్థలము విడిచి నా వైపునకు కదలు" అనే అర్థము నిస్తున్నాము. ఆ శబ్దమునకు స్వతహాగా ఏమీ అర్థములేదు. అర్థము మనము కల్పించినది. 'కాకి' అనే శబ్దమునకు "ఒకవిధమయిన పక్షి" అనే అర్థము ఆ శబ్ద నైసర్గికస్వభావంలో లేనట్లే, 'దా' అనే శబ్దంలో కూడా పైని వివరింపబడిన అర్థం శబ్దతః లేదు. ఈ రెండు ఉదాహరణలలోను (శిశువు, కుక్క) అర్థం అనుభవంవల్ల పుట్టుతున్నది.

ఈ రెండు ఉదాహరణలలో ఉండే సమాన ధర్మాన్నిబట్టియే డార్విన్ అనే విద్వాంసుడు తన '*Descent of Man*' అనే గ్రంథంలో ఇలాగు చెప్పేడు: "*The lower animals differ from man in his almost infinitely larger power of associating together the most diversified sounds and ideas.*" (*chapter III*) ఇట్లే యితరశాస్త్రజ్ఞులుకూడా జంతువుల మనస్సూ, మనుష్యుని మనస్సూ ఒకేరకమైన దనిన్నీ, రెండింటికీ తరతమభేదములే కాని వస్తుతత్త్వ మొకటే అనిన్నీ చెప్పేరు.

కాని ఈ సిద్ధాంతం కొంచెం పరిశీలిస్తే డార్విన్ ప్రమాదపడినట్లు తెలుస్తుంది.

సర్ లెస్లీ ఎ. వైట్ అనే పండితుడు '*The symbol as origin and basis of human behaviour*' అనే గ్రంథంలో శబ్దార్థ సంబంధం గురించి వ్రాస్తూ "*Man is able to use symbols; no other creature possesses this ability*" అని అన్నాడు. మనుష్యునకు జంతువులకు లేని శక్తి యొకటి యున్నది. అది ప్రతీకములను, ద్యోతకములను వాడుట. ప్రతీకము (*symbol*) యొక్క స్వభావ మిది: ఏ మానవులు పరస్పరమనోభావవ్యక్తీకరణమునకై వాడెదరో, వారే దాని యర్థమును నిర్ణయించెదరు. దీని స్వరూప మేమైనను కావచ్చు—ఒక ఆంగిక వ్యాపారము (*gesture*), ధ్వని (*sound*), ఆకృతి (*shape*), రంగు (*colour*), రుచి (*taste*), వాసన (*odour*). కాని వీటి అన్నిటిలోనూ స్పష్టమైన ఉచ్చారణ గల కంఠధ్వనులే ముఖ్యమైనవి. 'చూడు' 'పిల్లి' 'చక్కని' అనే మాటల కాయాయర్థములు అనుద్దేశకంగా కల్పించి, ఈ అర్థములతోనే ఆ శబ్దాలను వాడుదామనే సమాధానానికి వచ్చి వ్యవహరిస్తూ వచ్చేవారు.

కాని ఈ సిద్ధాంతానికి డార్విన్ ఒక పూర్వపక్షం చేసేడు. "షేక్‌హాండ్ అనగానే పడుకున్న కుక్క లేచి, మోకాలు యజమాని కందించి, ఏవిధంగా ఎల్లాగ యజమాని మాటలూ, వాక్యాలూ అర్థంచేసుకున్నదో, అదేవిధంగా మనుష్యులుకూడా 'చూడు' 'చక్కని' 'పిల్లి' అనే మాటలు అర్థం చేసుకుంటున్నారని ఎందుకు భావించకూడదు?" అని.

కాని ఈ పూర్వపక్షంలో ఒక లోపం ఉంది. కుక్క మాటలను అర్థం చేసుకోగలదుకాని అర్థస్పష్టి చేయలేదు. ఈమాటకీయర్థం, ఆమాటకాయర్థం అనే నిర్ణయమూ చేయలేదు. మనుష్యునికిని, కుక్కకును గల భేద మిందులోనే ఉన్నది. మనుష్యుడు తన భావమును, ఉద్దేశమును అనుసరించి మాటల కర్థం కల్పించగలడు. ఆ యర్థంతోనే మాటలు వాడుకలోనికి వచ్చేటట్టు నిర్దేశించనూ కలడు. గణితంలో *X* అనే చిహ్నం. ఒక వీసెడు వంకాయలనుగాని, వెయ్యి మనుష్యులనుగాని, ఒక రాజునుగాని, లేక తనకు తోచిన మరే అర్థంతోగాని వాడగలడు. 'పసుపు' అనే శబ్దమును (౧) స్త్రీలు వాడుకచేయు పదార్థమనిగాని, (౨) లేక మంగళస్వరూప మనిగాని, (3) లేక జాతీయపతాకలోని ఒక వర్ణమని కాని అర్థము చేసుకోగలము. ప్రతీకప్రపంచమున (*Symbolic World*) మానవుడు సర్వస్వతంత్రుడు. ఏ వస్తువుకైనా తన చిత్తం వచ్చిన అర్థం కల్పించగలడు. మానవత్వమంతా మనకు గల ఈ విశిష్టశక్తిపై ఆధారపడిఉంది. ఈ శక్తి మూలంగానే మానవుడు ప్రపంచచరిత్రలో గల సభ్యతలన్నీ సృష్టించుకున్నాడు. మానవజీవితంలో ఈ *Symbolic faculty* వల్ల కలిగిన ఫలితాలు ఇవా

రించకపూర్వం కుక్కకూ, మనుష్యునికీ గల భేదం ఇంకా కొంచెం గమనించాలి.

కుక్క మాటలను గ్రహించగలదని మనం అంగీకరించాం. మన ఆదేశానుసారం అది పండుకొంటుంది. చెయ్యి చాచిగాని, అరచిగాని అడుగుతుంది; నేలమీద దొర్లుతుంది. నిజంగా, ఈ చేష్టలన్నీ **Response to Stimuli** అని వ్యవహరింపబడే సిద్ధాంతానికి దృష్టాంతాలు. 'షేక్ హాండ్' అనేమాట *stimulus*; అది వినగానే మోకాలు మనవైపున కెత్తడం *Response*. షేక్ హాండ్ అన్న మాట ఒక *sign*; అనగా గురుతు; చిహ్నం. ఒకటి మరొకదానిని సూచిస్తే దాన్ని *sign*, లేక సాంకేతిక-చిహ్నం అంటాం. పొగను చూచి అగ్ని ఉన్నదని అనుమానిస్తాం. రోడ్డు మీద రాత్రి నడుస్తూ మునిసిపాలిటీవారి ఎర్రదీపం చూచి 'ప్రమాదం' అని తెలుసుకుంటాం. పొగ యొక్క అర్థం దాని నైసర్గిక గుణాల్లోనూ, దానికీ అగ్నికీ కల సన్నిహితకార్యకారణసంబంధంలోనూ ఉన్నది. అనగా సాంకేతిక-చిహ్నాలకు అర్థం దాని నైసర్గికగుణాల్లోనూ, అవి తెలుపుదుచేసే వస్తువునకూ ఆ గుణాలకూ కల సంబంధంలోనూ ఉన్నదన్న మాట. ఎరుపుదీపం విషయంలో పైని చెప్పబడిన 'నిరోధక్రియ' వర్తిస్తుంది. ఈ 'నిరోధక్రియ' ద్వారా దీపానికీ ప్రమాదానికీ మన మనస్సులో అన్యోన్య సంబంధం కల్పిస్తాం **Association** వల్లకాని, **Conditioning** వల్లకాని, సాంకేతిక-చిహ్నం, దాని అర్థం ఏకీభావం పొందుతవి. అందుచేత సాంకేతికంలోనే దాని అర్థం లీనమవుతుంది......ఇక మనము దైనిక జీవితంలో వాడుకచేయు మాటలను పరిశీలిద్దాం.

ప్రతీకము (**Symbol**) అనేదాని అర్థం దానిని వాడు మన నిర్ణయంపై ఆధారపడిఉంటుందనీ, **Sign** (సాంకేతిక-చిహ్నం) అనేదాని యర్థం మనుష్యులు నిర్ణయించినా, నిర్ణయించకపోయినా మరొక వస్తువును సూచించేదనిన్నీ ఇదివరకే తెలుసుకున్నాం. నిత్య వ్యవహారంలో మనం వాడు మాటలు **Symbols** గానూ, **Signs** గానూ — రెండువిధాలుగా ఉపయోగ పడుతున్నవి. అనగా ఒకప్పుడు వాటిని మనము **Symbol Contexts** లోనూ (ద్యోతకసందర్భాలు అనుకుందాం), ఇంకొకప్పుడు **Sign Contexts** (చిహ్నసందర్భాల)లోనూ ప్రయోగిస్తాం. ప్రతీకముల అర్థము త్వక్, చక్షు మొదలగు పంచేంద్రియములవలన గ్రహించలేం. ఒక క్రొత్త భాష మనం వినేటప్పుడు, ఆభాషాశబ్దముల యర్థం మనకు తెలియదు. *It is Greek to us*. ఒక ఆంధ్రుడు మొదటిసారి తమిళదేశంలో ప్రయాణంచేస్తూ, ఇద్దరు అరవసోదరుల సంభాషణలో 'ఆమా' అనే మాట విన్నాడను కొందాం. ఆమాట అతనికి ఏమీ అర్థంకాదు. అరవసోదరుల ప్రద్యోతకనిర్మాణం (**Symbol Mechanism**) ఆంధ్రుల ప్రద్యోతకనిర్మాణం కన్న భిన్నం. 'ఆమా' అనే సూచకంయొక్క అర్థం గ్రహించేందుకూ, వాడేందుకూ ఒకవిధమైన **Neural Structure**, లేక ప్రద్యోతకనిర్మాణం అవసరం. తదితరప్రద్యోతకములుకూడా ఇట్టివే. ఒక రంగు చూడగానే, అది సూచించేది విచారమో, ధైర్యమో, లేక ఒక రోగమో తెలుసుకోవాలంటే, దానిని వాడినవారి ప్రద్యోతకనిర్మాణంతో మనకు పరిచయం ఉండాలి. ద్యోతకముల విలువలు (**Values of Symbols**) మనం గుర్తించలేము అనే విషయాన్ని, శాస్త్రీయంగా ఇట్లా చెప్పవలసి ఉంటుంది: "ద్యోతకార్థములకు (**Values of Symbols**) ఉత్పత్తిస్థానం వాటియందుగాక, అన్యత్ర ఉన్నది" అని. ఉప్పుయొక్క క్షారగుణం, పంచదార మధురగుణం, ఆ వస్తువుల (**Atomic Structure**) నైసర్గికనిర్మాణమునందే కలదు. కాని, ఈ వస్తువులను ఎంత పరీక్షచేసినా, ఎంత పదార్థవిజ్ఞానిక, రసాయనికపరిశోధన ఒనర్చినా, వాటి బజారుధర మనము కనుక్కో లేము. ఎందుచేత ననగా—బజారుధర ఒకవిధమయిన ప్రతీకమూల్యము (**Symbolic Value**). సమాజం ఈ ధరను నిర్ణయిస్తుంది. ఇల్లాగే ఎర్రదీపానికి ప్రమాదం అనే అర్థం సమాజకల్పితము. కాబట్టి సూచకప్రపంచం (**Symbolic World**) ఇంద్రియాతీతమని చెప్ప వచ్చును. ఈ ప్రపంచకంలో అర్థములు, విలువలు జీవిస్తూ నిత్యవ్యవహారం జరుపుతూ ఉంటవి. కాని,

మనము వాటి విలువ రుచిచూచిగాని, తదితరేంద్రియ సహాయంవల్లకాని గ్రహించలేం. ఈ ప్రతీకములకు నైసర్గికంగా స్వరూపం అవసరము. ఆ స్వరూపాలు ఇంద్రియగోచరములు కాకపోతే అవి మన యనుభూతి లోనికి ప్రవేశించలేవు. కాని ప్రతీకముయొక్క భౌతి కాకారము వేరు; దానియర్థము, విలువ వేరు. ప్రతీక ములు భౌతికాకారస్థములైన అతీంద్రియమూల్యములు. ఏ మానసికశక్తిచేత ఈ ధర్మములు సృష్టింపబడినవో, ఆ శక్తిచేతనే అవి యితరులకు ప్రకటింపబడుతవి. ఈ శక్తిని పాశ్చాత్య భాషాతత్త్వవేత్తలు *Neurological Symbolic Faculty* అని నామకరణం చేసేరు. అర్థ జ్ఞానం ఈ *Symbolic Faculty* వల్ల కలుగుతుంది. ఇందువల్లనే జంతువుల అనుభూతిప్రపంచకానికీ, మానవానుభూతప్రపంచకానికీ భేదం ఏర్పడింది. జంతు వులు మానవసమాజంలోనికి ప్రవేశించలేవు.

*Physical form* నకు అర్థము, మూల్యము ఆపా దించుటచేత ప్రతీకము లేర్పడుతున్నవి. శిశువు తల్లి వద్ద మాటల నభ్యసించు మార్గము పరికిస్తే, మాట లెట్లు ప్రతీ కములుగ జనిస్తుంటవో గ్రాహ్యమవుతుంది. తల్లి ఒక కొత్తమాట శిశువునకు నేర్పునపుడు, ఆ మాట నెన్నో సారులు ఆమె ఉచ్చరించును. దీనిమూలంగా శబ్దము, శబ్దార్థము శిశువుయొక్క అనుభవంలో మిళితములై కొన్నాళ్లకు శబ్దమే శబ్దార్థమును వ్యక్తముచేయు పరిస్థితి ఏర్పడును. ఇందు కుదాహరణ: మనము 'బోటా' అను నూతనశబ్దమును సృష్టించి, దానికి 'తలఊపు' అనే అర్థ మును కల్పించి, పదేపదే ప్రయోగించినయెడల, ఆ వాడుక శబ్దార్థమును మనమనస్సులో స్ఫురింపజేయును. క్రమక్రమంగా ఈశబ్దార్థమునకును, తదితరశబ్దార్థము లకును గల భేదముకూడ శిశువు గ్రహింపగలదు. ***Psychologists*** (మనశ్శాస్త్రవేత్తలు) శబ్దమునకును, దాని యర్థమునకును సంబంధమును కల్పించు నరముల వృత్తికి ***Conditioning*** అని పేరుపెట్టినారు. శబ్దార్థముల సంయోగము మన మనస్సులలో ఏర్పాటయినతరువాత శబ్దము వినగానే దాని యర్థము మనకు స్ఫురిస్తుంది. మనశ్శ్రోత్రేంద్రియముద్వారా ఈ అర్థమును గ్రహి స్తాము. కాని, ఇది ప్రతీకసందర్భము ఎంతమాత్రమును కాదు. ఇచ్చట (*Symbol Context*) ప్రతీకసందర్భము గడిచి, మరియొక సందర్భము ఏర్పడినది. ఇందులో శబ్దములు (*Symbolic Function*) ప్రతీకధర్మముగాక సాంకేతికచిహ్నధర్మము నిర్వర్తిస్తున్నవి. కాబట్టి, మానవవ్యవహారములలో శబ్దములు ప్రతీకములుగా నుద్భ వించి, వాటి యర్థము మనము గ్రహించినపిదప సాంకే తికములుగ మారుతవి. ఇప్పుడు, మాటలు, వాక్యములు బోధపరచుకొను కుక్కపరస్థితి పరిశీలిద్దాం.

'పాడో'అనే మాటను సృష్టించి, ఆ మాటకు 'కూర్చో' అనే అర్థము కల్పించి, అది ఉచ్చరించినపు డల్లా కూర్చునేటట్లు కుక్కకు పాఠం బోధపరిస్తే, కుక్క ఆ మాట వినగానే తప్పక కూర్చుంటుంది. కుక్కకు బదులు శిశువుకే ఈ పాఠం బోధపరిచే మను కుందాం. కుక్కవిషయంలో మనం చేసిన ప్రయోగము (*Experiment*) నకును, శిశువువిషయంలో మనం చేసే ప్రయోగమునకును ముఖ్యమైన భేదం ఉన్నదా? ఏమీ లేదు. శిశువు కుక్కకన్న త్వరగా పాఠం బోధ పరచుకొన్నా, కుక్కప్రవర్తనకూ (*Behaviour*) శిశుప్రవర్తనకూ ఏమీ తేడా లేదు. ఈ రెండు సంద ర్భాలలోనూ, మాట లర్థమును పొందుతవి: మృగముకాని, శిశువుకాని ఒకేవిధంగా (అనగా కూర్చోవడంవల్ల) అర్థం గ్రహించినట్లు తెలుపుడుచేస్తవి. అయితే మాటలను అర్థంచేసుకోవడంలో కుక్కకును, శిశువునకును భేదం ఏమిటి? మాటలు కుక్కకు కేవలము సాంకేతిక చిహ్నాలు (*Signs*). మానవునికిమాత్రము సాంకేతిక ములే కాక, ప్రతీకములుకూడను.

కుక్క చేయలేనిది వస్తువుల కర్థముకల్పించుట. కొత్త అర్థములను సంపాదించుకోగలదుకాని, వాటిని సృష్టించలేదు. 'పాడో' అనే శబ్దార్థమును గ్రహించ గలదుకాని, ఆ శబ్దాని కర్థం కల్పించే ప్రమేయంలో, దాని కేమీ సమర్థత లేదు...ఇంతే కాదు. ఎంతవరకు తన పంచేంద్రియములద్వారా భౌతికప్రపంచాన్ని అది *Perceive* చేయగలదో, అంతవరకే దాని అర్థజ్ఞానము యొక్క పరిమితి. ప్రతీకార్థములు, మూల్యములు(***Symbolic Meanings and values***) దాని జ్ఞానప్రపంచానికి

అవతలివి. 'పుణ్యం' 'పాపం' అనే శబ్దా లుచ్చరించి, అవి ఉచ్చరింపబడినపుడు తాను చేయవలసిన పని కుక్కను అభ్యసింపజేసినచో, అది మన బోధనల ననుసరించి చెప్పినట్లు చేయగలదు. కాని 'పుణ్యం' 'పాపం' అనే మాటలు మన కేయర్థము నిస్తవో, ఆ అర్థం కుక్క చేసుకోలేదు. ఎందుచేత ననగా, ఈ మాటలకు సాంకేతికార్థమే కాక, ప్రతీకార్థముకూడా కలదు. ఈ రెండు రకాల అర్థాలను గ్రహించేందుకు సాధనభూతమైన విశేష మేధానిర్మాణము (*Special neural mechanism*) ఒక్క మనుష్యుడే పొందియున్నాడు.

దీన్నిబట్టి కుక్కమనస్సుకూ, మానవుని మనశ్శక్తికీ భేదం స్పష్టమవుతుంది. తనకు తోచిన దేనికైనా, అంతకుపూర్వము లేనిఅర్థము సృష్టించి, దానికా అర్థమును సంధించగలడు. ఈ అర్థములను ఇతరులు తెలుసుకొనేటట్లు శబ్దములద్వారాగాని, సంజ్ఞలద్వారాగాని, లేక ఏ యింద్రియగోచరములగు క్రియారూపమునగాని వ్యక్తపరచగలడు. కుక్కలు, కోతులు, ఎలుకలు—ఈ జంతువులు తమ యనుభవంలో ఏవో కొన్ని శబ్దములతోనూ, ఇతర రూప, రస, గంధములతోనూ ఏకీభావం పొందిన కొద్దిపాటి యర్థములనే అవగాహన చేసుకోగలవు. ఆ యర్థములను ఎంత మాత్రమూ నిర్ణయింపజాలవు. ఈజంతువుల అర్థగ్రహణము *Sense perception* అని చెప్పబడు క్రిందిసోపానమునకే చెందుతుంది. ఈ భేదంలో ఒక సూత్రం ఇమిడిఉంది.... అర్థగ్రహణంలో గల ఈ భేదపరిశీలన అల్లాఉంచి, అది ఎందుచేత పుట్టుచున్నదో—అనగా, *Psychological origin* విచారించవలెను.

మనుష్యుడు కళ్లతో చూస్తాడు చెవితో వింటాడు. ముక్కుతో వాసన చూస్తాడు. కాని ప్రతీకములను అతనిలో ఉన్న ఏ ఇంద్రియం సృష్టిస్తుంది? భాషయే ప్రతీకవ్యక్తీకరణమునకు ముఖ్యసాధన మగుటచేత, కొంద రీ ప్రతీకశక్తి పదోచ్చారణయందు పనిచేయు దవుడలు, నాలుక, పెదవులు, కంఠము మొదలగు అవయవములందే యున్నదని భ్రమపడ్డారు. ఈ యవయవములు కోతుల కున్నవి. కాని ప్రతీకములచే భావములు వ్యక్తపరచుటకు నోటిమాట లనవసరము. అక్షరముల ద్వారాగాని, బొమ్మలు గీచికాని, ఇతర సంజ్ఞలద్వారాగాని—ఇవియు ప్రతీకములే—మనోభావములను మనము తెలుపగలము. ఏ వస్తువునకైనను అర్థము కల్పించే ప్రతీకశక్తిచే ఒక భాషయేకాదు, పరస్పరమనోభావ వ్యక్తీకరణమునకై తదితరమైన సాంకేతికసమామ్నాయమును కల్పింపగలము. సంజ్ఞారూపకముగా కాలిప్రేళ్ళను, చేతిప్రేళ్ళను, టెలిగ్రాఫ్‌పద్ధతిలోవలె చుక్కగీరలను (*dot, dash*) ప్రయోగించగలము. చెవి ఎన్నోవిధములుగా కదపగలిగితే, చెవులతోకూడా ఒక ప్రతీకసమామ్నాయమును కల్పించడం సాధ్యమే. కాని ఇవన్నియు మాని శబ్దజాలమునే ప్రతీకవ్యక్తీకరణమునకై మానవు డేల వాడెను? భాష సుస్పష్టము, సులభము, సద్యోపాయమూ *Most Economical* కాబట్టి.

వక్తృతావయవములు(*Organs of speech*)—పెదవులు, నాలుక, దవుడలు, *Vocal chords* మొదలగునవి—ప్రతీకశక్తియొక్క ఉత్పత్తిస్థానములు కావు. ఇం కేదియై యుండును? ఇంతవరకు ఈ ప్రతీకశక్తి అనే గంగాప్రవాహానికి గంగోత్రి కనుక్కోలేక పోయేరు శాస్త్రజ్ఞులు. కాని *Nervous System*, లో, అందులో ముఖ్యముగా, పూర్వమేధస్సు (*Fore Brain*) లో ఈ శక్తి జన్మించిన దని నిస్సందేహంగా చెప్పవచ్చును. కాని ఈ విషయంలో త్వరగా ఒక నిశ్చితాభిప్రాయానికి రావడం ప్రమాదకరం. కోతిమేధస్సుకన్న మానవుని మేధస్సు పెద్దది. దానియందు *Convolutions*, జాడలు చాలా బాహుళ్యంగా ఉంటవి. కాని *Brain Cell* లో (మేధస్సునందున్న జీవాణువులు) మనకూ, కోతికీ తేడా ఏమీ కనపడదు. రెండింటి నిర్మాణం ఒక నమూనాగా ఉంటుంది. అయితే మనుష్యుడు ప్రతీకించగలుగుటకును, కోతికా శక్తి మృగ్య మగుటకును కారణం ఊహింపవలసి ఉంటుంది. ప్రస్తుతము మనకు గలిగిన జ్ఞానము ననుసరించి ఒక సమాధానం చెప్పవచ్చును. అది ఏద నగా—మానవుని మేధస్సు కోతిమేధస్సుకన్న పెద్దది. ప్రమాణభేదంవల్ల (*Quantitative difference*) గు-

భేదాలు కలుగవచ్చు. కొన్ని డిగ్రీల వేడివల్ల నీటి యొక్క *Structure* మారి ఆవిరి బయలుదేరుతుంది. గ్రుడ్డునందు పరిణామం ఒక దశకు రాగానే కోడిపిల్ల పొడచూపి అంతేతరమగు తన జీవికలో గల విశిష్టతను చాటుతుంది. ఈవిధంగానే అడవిమనుష్యుని మేధస్సు ఎన్నోయుగాలకు పరిణామం పొంది క్రొత్తదశకు వచ్చినప్పుడు, నూతనశక్తి ఒకటి ఆవిర్భవించింది. ఇది కేవలం అంచనా—నిరూపించడం కష్టం. ఎంచేతననగా—ప్రతీకశక్తి పనిచేసేటప్పుడు (*Symboling*) నరములలో కలుగు ప్రభేదము లింతవరకును శాస్త్రరీత్యా పరిశోధింపబడలేదు.

కొందరు జీవతత్త్వశాస్త్రవేత్తలు (*Biologists*) భాషాఉత్పత్తిని *Mutation*—అనగా హఠాత్తుగా వచ్చిన మార్పు అని అభిప్రాయపడుతున్నారు. కాని పూర్వ ప్రాతీకదశ (*Sub symbolic Level*) నుండి ప్రాతీకదశకు (*Symbolic level*)మార్పు అకస్మాత్తుగా కలిగినదని భావించకూడదు. శిక్షణలేకుండా శిశువు ప్రతీకములను వాడగలుగుచున్నాడా? లేదు. తలిదండ్రులు శిశువునకు శబ్దార్థముల పరస్పరసంబంధం బోధించి, భావయుక్తంగా మాట్లాడే అభ్యాసం అలవరచుటకు ఎంతోకాలం పట్టుతుంది. ఈవిధంగానే *Anthropoids* అనబడు ఒకరకం కోతులు *Symbolic Faculty* సంపాదించి, ఆ శక్తిని భాషమూలకంగా వ్యక్తపరచగలిగేసరికి, వేలకువేలు సంవత్సరాలు గడిచి ఉండాలి. తరువాత దైనికవ్యవహారాల్లో సార్థకమైన శబ్దజాలం పరిపాటిగా వాడబడే యుగం వచ్చేసరికి ఇంకా మరెన్నో లెక్కలేనన్ని యుగాలు గతించి వుండాలి.

పూర్వ ప్రాతీకదశ నుండి ప్రాతీకదశకు వచ్చేటప్పుడు ఈ మార్పు జనసముదాయంలోనూ, ప్రత్యేకవ్యక్తిలోనూ హఠాత్తుగా కాక—*Mutation Theory* ఇక్కడ కేవలం వర్తించదు—క్రమక్రమంగా వచ్చిందని అనుకొనుట సబబుగా కనిపిస్తుంది. ఇంక రెండోవిషయం: పూర్వప్రాతీక దశకును ప్రాతీకదశకును గల భేదం—ఈ భేదం సజాతీయం గాదు; విజాతీయం. పూర్వప్రాతీకదశలోఉన్న కుక్కలు, పిల్లులు ఇవి ప్రతీకించలేవు. ఆశక్తి వాటికి లేదు. వీటివిషయంలో పైని చెప్పబడిన రెండు దశలకును మధ్యనున్న అంతరస్థితి—అంచీ—లేదు. కోతులకు మనుష్యులభాష నేర్పటానికై ఎన్నో ప్రయత్నాలు చేసేరు. కాని అవి ఫలించలేదు.

ప్రతీకములను వాడుటవల్ల సమాజజీవితంలో కలిగిన ఫలితాలేమి? అనే ప్రశ్నకు ఇప్పుడు జబాబు కనుక్కుందాం. జంతువులకన్న మానవునికి గల ఉచ్చస్థితికిన్ని, మానవప్రత్యేకతకూ, మానవసభ్యతకూ అతని ప్రతీకశక్తియే ముఖ్యకారణము. *Anatomically* (అంగనిర్మాణంలోనూ) *Temperamentally* (మనః ప్రవృత్తుల్లోనూ) మనుష్యుడు, ఇతరజంతువులను, కోతిని పోలిఉన్నాడు. శారీరకధర్మములలో (*Physiologically*) కూడా అనగా *Digestion*, *Respiration*, *Reproduction* మొదలగు ధర్మములవిషయంలో మానవునికిన్నీ, కోతి-తదితరమృగములకూ ఎన్నో సామ్యాలు లున్నవి. కాని. ఒక్కవిషయంలోమాత్రం మనుష్యుడు ఇతరమృగాలకన్న చాలా భిన్నుడు. ఈ భిన్నత్వమే అతనిని ప్రాణికోటులకల్లా అగ్రస్థానం గ్రహించేటట్లు చేసింది. అది ప్రతీకశక్తి. "శబ్దం పరబ్రహ్మస్వరూపం" అనే సత్యాన్ని ఆర్యులు దివ్యదృష్టివల్ల కనుక్కున్నారు. శబ్దములకూ, ధ్వనులకూ సృష్టించే శక్తి కలదని తెలుసుకున్నారు. కోతిని మనుష్యునిగను, అడవిజాతిమనుష్యులను సభ్యతాసంస్కృతులు గలవారినిగను మార్చినవి శబ్దములే.

కొందరు నాగరికత మానవుడు ఉపకరణములు (*Tools*) ఉపయోగించుట ప్రారంభించినప్పటినుండి జన్మించినదని చెప్పుచున్నారు. కోతులుకూడా ఉపకరణములను, సాధనములను ఉపయోగించగలవు. కాని ఆంతరంగికదృష్ట్యా (*Subjectively*) చూచినా, బాహ్యదృష్ట్యా (*Objectively*) చూచినా, కోతులకు గల ఈ శక్తి అవిచ్ఛిన్నంగా, ఏకధారగా అభివృద్ధి పొందినట్లు కనపడదు. ఉపకరణాలు వాడుకచేయడంలో ఇప్పటి కోతులకూ, ఇథ్యోపులనాటి కోతులకూ ప్రభేదం లేదు.

పైని చెప్పినదానివల్ల తేలిన సంగతి ఏమనగా—మానవునికి ఉపకరణము బాహ్యప్రపంచమందలి వస్తువుమాత్రమే కాదని. అది భావము(*Idea*) కూడను. అది ప్రాతీకస్వరూపమున (*Symbolic form*) ప్రకాశింపజేయబడు ఒక సాత్రికభావము (*Concept*).—*A concept expressed in symbolic form.* ఒక గడ్డపార-వ్యవసాయోపకరణమును తీసుకొందము. ఇది మన కళ్ళముందుగాని, చేతిలోగాని లేకపోవచ్చును. కాని సర్వదా భావరూపమున మనలో నుండును. ఈ *Idea-tool* కమ్మరి తయారుచేయుదానికన్న నిత్యము, పరిపూర్ణముగా. అదే, నమూనాలైన కమ్మరిచే తయారుచేయబడిన గడ్డపారలకు మాతృక. ఏ ఉపకరణమైనప్పటికీ, భావప్రపంచమందు తరమునుండి తరమునకూ, యుగంనుండి యుగానికీ అవిచ్ఛిన్నంగా వస్తూఉండడం చేత క్రమక్రమాభివృద్ధి జెందింది, అభివృద్ధిసూచకమౌతుంది. ప్రాతీకశక్తి ఉద్భవించకపూర్వము ఈ ఉపకరణజనితానుభవము మానవపరిణామంలో ఏకధారగా ప్రవహించక, ఒకప్పు డున్నట్టూ, ఒకప్పుడు లేనట్టూ విచ్ఛిన్నంగా ఉండేది. కాని ఈ శక్తి యుద్భవించిన తరువాత, ఒక తరంవారి అనుభవం తరువాతివారి అనుభవంతో సమ్మేళనం పొంది, ఒకవిధమైన సంజ్ఞానం,సభ్యతా ఏర్పడి, ఈ సంజ్ఞానసభ్యతలు అఖండప్రవాహంగా పురోగమించే అవకాశం కలిగింది.

నాగరికతలను, సభ్యతలను నాణ్యముచేయుటకు ఎన్నో కొలబద్ద లున్నవి. అందులో ముఖ్యమైనది ఉపకరణము. ఈ ఉపకరణం పునాది. ఈ పునాదిపైని నాగరికతాసౌధముయొక్క సాంఘిక, వైజ్ఞానికగోపురములు నిర్మింపబడ్డవి. ఉపకరణం సభ్యతకు పునాది. కాని ప్రతీకము సభ్యతాసాధనము. ఈ సాధనం లేనిదీ సాంఘిక, వైజ్ఞానికజీవితం సాధ్యం కాదు.

భాష లేకుంటే సాంఘికజీవనాన్ని సరియైన దారిలో నడపడానికి తగిన సూత్రాలు మృగ్యమౌతవి. కామము, పశుబలము, నిరంకుశేచ్ఛ ఇవియే సంఘజీవనాన్ని నడుపు శక్తు లౌతవి. ఏకపత్నీత్వము, బహుపత్నీత్వము—ఈ *Concepts* మనుష్య లాంఛోరులకు తెలుపుడుచేసి, సూత్రీకరించుటకు అవకాశ మిచ్చినది ప్రతీకశక్తి. ఇది లేకపోతే నీతి, ధర్మము అను భావములు జనించవు. 'అమ్మ', 'నాన్న', 'అన్న', 'తమ్ముడు', 'అక్క', 'చెల్లెలు'—మొదలగు బాంధవ్యవివేచనము గాని, దగ్గరబంధువులను వివాహమాడకూడదనిగాని, శాస్త్రవిషయములుగాని, కళలవిషయములుగాని తెలుసుకొనుటకు భాషయే ముఖ్యసాధనము. జన్మ, జన్మాంతరం, మంచి, చెడ్డ, ఇహం, పరం—ఇట్టి భావములు భాష లేకపోతే స్వరూపింపజాలవు. నాగరికతలో స్వల్పవిషయము మొదలు ప్రపంచరాజ్యము అనే విషయము వరకు శాస్త్రవేదాంతములు—ఈ *Concepts* అన్నిటికీ ప్రతీకమే మూలాధారం.

ఈ దృష్టితో చూస్తే మానవప్రపంచమందు గల ప్రాతీకానుభవంయొక్క ఆధిక్యమును గ్రహించవచ్చు. కుక్కగాని, పిల్లిగాని 'అన్న' 'సోమవారం' 'మూడు' 'సొమ్ము' అనే *Concepts* బోధపరచగలమా? *Stimulus and Reaction* పద్ధతిపై కుక్కలచేతగూడా "౪ × 3 = ౧౨" అనే లెక్కలు చేయించవచ్చునట. కాని ప్రతీకమయమైన భావప్రపంచంలోనికిమాత్రం జంతువులు ప్రవేశించలేవు. మన స్వర్గం, నరకం, దేవతలు, సంస్థలు, న్యాయములు, వేదాంతము, నీతి, కర్మకాండ, కళలు, శాస్త్రములు—మన ప్రపంచమంతా—ప్రతీకములచే నిర్మింపబడిన భవనం. ఎద్దుతో భూమి దున్నుతాం; ఇంకా ఎన్నో జంతువులు, పక్షులు భగవత్సృష్టిలో మన అన్నదమ్ములే. కాని అవి మన ఇంటి గడప దాటలేవు. మనతో కలిసి ప్రతీకానుభవం పొందలేవు. ప్రాతీకప్రపంచం మానవుని స్వకీయం.

# ధన్య జీవితము

శ్రీ బెళ్లూరి శ్రీనివాసమూర్తి

౧

చదలన్ వార్షికవారిదోత్కరము లాచ్ఛాదించె; నత్యంత భీ
ప్రదమై తోచె నిరమ్మదమ్ములు; జగద్భాండంబు భేదించు చు
న్నది నిర్ఘోషము ఘోరమైన ప్రళయధ్వానంబువోలెన్; రసా
స్పదమార్గంబున ద్రిప్పుమోయి హృదయస్థానంబు లోకప్రభూ!

౨

ఆశావీథుల తీవ్రమై విసరు ఝంఝాకీర్ణమై వృక్ష శా
ఖాశాఖానిచయంబు లూగెడు విహంగశ్రేణి కంపింప; నా
వేశించెన్ గగనంబు నాదు హృదయోర్వీన్ భావనోన్మత్త కే
కిశోభల్ నటియించు హృద్యమగు తత్కేకారవారంభముల్.

౩

దెసలెల్లన్ సురభీకరంబులుగ ధాత్రిన్ వర్షబిందూత్కరం
బెసగెన్, ధారలు గ్రుమ్మరించెడిని వాహిన్యాకృతుల్ వోయె నీ
వసుధాగర్భములోన వెల్వడి శుభప్రారంభమున్ దెల్పుచున్
రసవద్భేకనినాద మెల్లెడల శ్రోత్రప్రీతి గావించెడిన్.

౪

ఓ విశ్వస్తవనీయరాగనిధి, నన్నుఱ్ఱూతలూగించు నీ
ప్రావీణ్యంబు ఋతుప్రవేశమున నిన్ బ్రార్థింతు నీ వర్షధా
రావేగంబున రాలు నొక్క చినుకై రాణింపనిమ్మోయి నే
నీ విశ్వంభరలో ప్రయోజనముగా వీక్షింతు నాజీవికన్.

# ప్రాక్ - పాణిని

శ్రీ
శివశంకరశాస్త్రి

(గత సంచిక తరువాయి)

## కర్మంది వివరణము :

### కార్మంద వివరణము

"వ్యాచకార తదా సర్వం కర్మందశ్చ మహాకవిః."

అద్వైయాకరణులయిన శిష్యులకొఱకు వ్యక్తావధూత, క్రాంతదర్శియగు భగవాన్ కర్మందుడు తన భిక్షుసూత్రమునకు పూర్వవృత్తరూపమున వ్యాకరణసూత్రములు కొన్ని రచించినట్లు సన్యాసిసంప్రదాయమున ప్రసిద్ధి కలదు. భిన్నవిషయకము లయినను ఈ సూత్రములు ప్రస్తావనావశమున భిక్షుసూత్రాంశములే అనవచ్చును. ఇది కేవలము జనశ్రుతి కాదు. కవీంద్రాచార్యసూచీపత్రమున వ్యాకరణప్రస్తావనలో 'కర్మంది వివరణ' నామకగ్రంథోల్లేఖనము కలదు. కవీంద్రాచార్యుడు సన్యాసి యని, గ్రంథము తత్కృతముగా నధిగతమయినది. కర్మందప్రోక్తవ్యాకరణసంబంధిసూత్రములు భిక్షుసూత్రముకంటె భిన్నముగా భావించువారు ఈ గ్రంథమును 'కార్మందవివరణ' మందురు.

సరస్వతీదేవి ప్రథమమున కర్మందునికి ఈ సూత్రము లిచ్చె ననియు, అనుభూతిస్వరూపాచార్యునికి పూర్వుడగు పరివ్రాజకనరేంద్రాచార్యుడు ఈ సూత్రము లన్నింటిని కూర్చి, స్వకీయవృత్తివార్తికాదులతో కలిపి సారస్వతవ్యాకరణ మనుపేర లోకమున వెలయించె ననియు కొందరు కొంద రందురు. దీనికి పూర్వ మీ గ్రంథము సన్యాసులకడ నుండెడిది. ఇందాశ్చర్యము లేదు. నేటికిని సన్యాసులకడ గుప్తముగా నున్న కొన్నివిద్యలు గృహస్థాశ్రమములోని పండితులకు స్వప్నాతీతము లన్నను అతిశయోక్తి కాదు.

"కర్మందకృశాశ్వాదినిః" (అష్టా. ౪-౩-౧౧౧) సూత్రమువలన కర్మందమస్కరి పాణినికి పూర్వు డని తెలియుచున్నది. కర్మందుని భిక్షుసూత్రము వ్యాసుని భిక్షుసూత్రముకంటె పూర్వ మని కొంద రనుచున్నారు. వ్యాసుని భిక్షుసూత్రమునకు తరువాత మరియొక భిక్షుసూత్రము ప్రణీతము కాకుండుట హేతువు. కర్మందుని గ్రంథ మేదియు లభింపలేదు.

## కాశకృత్స్న వ్యాకరణము

"కాశకృత్స్నేన యత్ ప్రోక్తం
తత్ కాశకృత్స్నకం శుభమ్."

కాశకృత్స్ననామముతో నొక వ్యాకరణము కలదు. దానిని రచించినది కాశకృత్స్నుడో, కాశకృత్స్నియో. శబ్దము రెండువిధములను సాధింపవచ్చును—కాశకృత్స్నేన ప్రోక్తం కాశకృత్స్నం; వా కాశకృత్స్నినా ప్రోక్తం కాశకృత్స్నమ్. కాని, కవికల్పద్రుమప్రారంభమున బోపదేవగోస్వామి కాశకృత్స్నుడు ఆదిశాబ్దికు డని యిట్లు వ్రాసినాడు:

"ఐంద్రః చంద్రః కాశకృత్స్నాపిశలీ శాకటాయనః
పాణి న్యమర జైనేంద్రా జయం త్యష్టాదిశాబ్దికాః."

కాశకృత్స్నుడు మీమాంసకు డనియు ప్రసిద్ధి. కాతీయసూత్రమందు యాజ్ఞవల్క్యపుత్రుడు కాత్యాయనుడును, మహాభాష్యమున (౪-౧-౧౪)పతంజలియు

ఇతనిని మీమాంసకు డన్నారు. దీనినిబట్టి కాశకృత్స్నుడే వ్యాకరణకర్త యని చెప్పవచ్చును.

అష్టాధ్యాయియం దితని నామము కనబడకున్నను ఈతడు పాణినికి తర్వాతివాడు కాడు. "పారాశర్యశిలాలిభ్యాం భిక్షునటసూత్రయోః" (అష్టా. ౪-౩-౧౧౦) అను సూత్రమున పాణిని వ్యాసుని నామము, వేదాంతసూత్రమును స్మరించినాడు. "అవస్థితేరితి కాశకృత్స్నః" అను వేదాంతసూత్రమున (౧-౪-౨౨) వ్యాసభగవానుడును ఇతనిని స్మరించినాడు. ఈ సూత్రమునుగూర్చి శ్రీభాష్యమున రామానుజాచార్యు డిట్లు వ్రాసినాడు: "పరమాత్మన ఏవ జీవేఽన్తరాత్మతయాఽవస్థితేః జీవాత్మశబ్దస్య పరమాత్మని పర్యవసాన మితి కాశకృత్స్నయం మతం సూత్రకారః స్వీకృతవాన్." పారాశర్యుడే వ్యాసభగవాను డగుటకు సంశయము లేదు. తైత్తిరీయారణ్యకమునందు వ్యాసుడే పారాశర్యనామమున ఆమ్నాతు డయినాడు (౧-౯-౩౫). "గర్గాదిభ్యో యఞ్" (౪-౧-౧౦౫) అను సూత్రముపై కాశికావృత్తియందు "వ్యాసః పారాశర్యః. అంతరాపత్యవివక్షాయాంతు.... పారాశర ఇతి". అని జయాదిత్యుడు లిఖించినాడు. "పారాశర్యో వ్యాసః" (౪-౩-౧౧౦) అని బాలమనోరమలో వాసుదేవదీక్షితుడు వ్రాసినాడు. పారాశర్యుని భిక్షుసూత్రములే వేదాంతసూత్రములు (బ్రహ్మసూత్రములు) అనుట నిస్సంశయము.

భామతి ప్రారంభమున వాచస్పతి మిశ్రుడు—

"బ్రహ్మసూత్రకృతే తస్మై వేదవ్యాసాయ వేధసే
జ్ఞానశక్త్యవతారాయ నమో భగవతే హరేః"

అన్నాడు.

"భిక్షవః సన్న్యాసినః, తదధికారికం సూత్రం భిక్షుసూత్రమ్, వ్యాసప్రణీతం ప్రసిద్ధమ్." అని బాలమనోరమలో (౪-౩-౧౧౦; సిద్ధాంతకౌముది ౧౪౯౦) నున్నది. వేదాంతసూత్రములు బాదరాయణసూత్రములని కొన్నికొన్ని గ్రంథములయందు గానవచ్చును. కాని వేదవ్యాసునికి బాదరాయణ శబ్దము నామాంతరము. మత్స్యపురాణము పరాశరపుత్రు డనియు, ద్వైపాయను డనియు వ్యాసుని పేర్కొన్నది (౧౪-౧౬). పురాతత్త్వవేత్తయగు అభయకుమారగుహ మహాశయుడు వ్యాసుడు బాదరాయణుడే అని ప్రతిపాదించినాడు డాసన్ మహాశయుడు దీనిని సమర్థించినాడు.

పాణిని వ్యాసుని పేర్కొన్నాడు, వ్యాసుడు కాశకృత్స్నుని పేర్కొన్నాడు. కావున ఇతడు వ్యాసపాణినులకు పూర్వుడు. "శతాచ్చ ఠన్యతావశతే" (౫-౧-౨౧) అను సూత్రమునుగూర్చి ప్రదీపమున కైయటాచార్యుడు "ఆపిశల కాశకృత్స్నయోస్త్వగ్రంథ ఇతి వచనా దప్యత్ర ప్రతిషేధాభావో నియతకాలాశ్చ స్మృతయో వ్యవస్థాహేతవ ఇతి మునిత్రయమతే నాద్యత్వే సాధ్వసాధుప్రవిభాగః" అన్నాడు. ప్రౌఢమనోరమలో యఙ్ లుక్ ప్రకరణమున భట్టోజి "కిం బహునా! కాశకృత్స్నాదిమతానామపి మునిత్రయవిరోధ ఇదానీ మగ్రహణ మేవ. దృశ్యంతే హి నియతకాలాశ్చ స్మృతయో యథా శతా పారాశరీ స్మృతి రితి. ఏతచ్చ 'శతాచ్చ ఠన్యతావశతే' (౫-౧-౨౧ సి. కౌ.) ఇతి సూత్రే కైయటహరదత్తాది గ్రంథే స్పష్టమ్. మునిత్రయమధ్యేపి యథోత్తరప్రామాణ్యమాశ్రిత్య భాష్యావిరోధేనైవ వ్యవస్థేతి తత్త్వమ్. ఏతచ్చ భర్తృహరి కైయటహరదత్తాదిసకలసమ్మతమ్" అని వివరించినాడు.

వేంకటాచలమహాశయు డిట్లు వ్రాసినాడు: "శతాచ్చ ఠన్యతావశతే ఇతి సూత్రే శాకల్యకాశకృత్స్నవ్యాకరణాంతరస్థం శతాచ్చ ఠన్యతాక గ్రంథే ఇతి సూత్ర మపన్యస్య తన్మతే శత్యః శతికో వా గోసంఘ ఇతి సాధుః. పాణినిమతేతు శతకో గోసంఘ ఇత్యేవ సాధురితి వ్యాకరణయో ర్విరోధ ముపన్యస్య, నియతకాలాశ్చ స్మృతయో వ్యవస్థాహేతవః, శతా పారాశరాః స్మృతాః ఇతివత్ మునిత్రయమతే నాద్యత్వే సాధ్వసాధుప్రవిభాగః ఇత్యుక్తమ్."

మాఘుకవీంద్రుని "వృథాం ద్వయేషా మపి మేదినీభృతాం" (౧౨-౧౩) ప్రయోగమునుగూర్చి భట్టోజి యి ట్లన్నాడు: "యత్తు చాంద్రవర్మణావ్యాకరణే ద్వయశబ్దస్యాపి సర్వనామతాభ్యుపగమాత్ తద్రీత్యా ఽయం ప్రయోగ ఇతి, తదపి న. మునిత్రయమతే

నేదానీం సాధ్వసాధుప్రవిభాగః; తస్యై వేదానీంతన శిష్టైః వేదాంగతయా పరిగృహీతత్వాత్. దృశ్యతే హి నియతకాలాశ్చ స్మృతయో యథా శలా పారాశరీ స్మృతిః."

వీనివలన పాణినీయవ్యాకరణము పూర్వుల గ్రంథములకంటె బలవత్తరమయిన దని తేలుచున్నది. ఇంతేకాక, పాణినికంటె కాత్యాయనుడు, అతనికంటె పతంజలి రచించిన వాక్యములు అధికతరాదరణీయములు అని పర్యవసానము. అందుచేతనే కైయటాదుల మతమున ఆపిశలిశాకల్యచాంద్రవర్మాదులవలె కాశకృత్స్నుడు పాణినికంటె పూర్వు డని స్పష్టము.

అష్టాధ్యాయియం దీ మునినామము లేకున్నను పాణినికి కాశకృత్స్నవ్యాకరణ మవిదిత మనుటకు వీలులేదు. "ప్రత్యయోత్తరపదయోః" అని కాశకృత్స్నమున కలదు; "ద్విగుసంఖ్యా" అని దానికి పూర్వ ముండియుండును. పాణినిముని "తద్ధితోత్తరపద సమాహారేచ" (౨-౧-౫౧), "సంఖ్యాపూర్వో ద్విగుః" అనియు సూత్రీకరించినాడు. ఈ రెండు సూత్రములను మనసులో నుంచికొని వార్తికకారుడు కాత్యాయనుడు "ద్విగుసంజ్ఞాప్రత్యయోత్తరపదయో శ్చే దితరేతరాశ్రయత్వా దప్రసిద్ధిః" అన్నాడు. దీనిపై ప్రదీపకారుడగు కైయటుడు "కాశకృత్స్నస్య 'ప్రత్యయోత్తరపదయో' రితి సూత్రం తావ ద్విచారయతి, పాణినీయం తు పశ్చా ద్విచారయిష్యతి" అని వ్రాసినాడు. రెండు సూత్రములలో ఇతరేతరాశ్రయదోషమున్న దని తెలుపుటకు పతంజలిమహర్షి, ద్విగుసంజ్ఞానిమిత్తే ప్రత్యయోత్తర పదే, ప్రత్యయోత్తరపదనిమిత్తాచ ద్విగుసంజ్ఞా. తదేత దితరేతరాశ్రయం భవతి, ఇతరేతరాశ్రయాణి చ కార్యాణి న ప్రకల్పంతే." అని వివరించినాడు. కాశకృత్స్న సూత్రవ్యవస్థలో ద్విగునిమిత్తము ప్రాతిపదికోత్తరప్రత్యయమును భావింపవలెను. ప్రత్యయము పరమం దుండుటవలన ద్విగుసంజ్ఞను గ్రహింపవలెను. కాబట్టి యిక్కడ ఇతరేతరాశ్రయదోషము దుర్వార మగును. దీనిని నివారించుటకు పాణినిముని ప్రత్యయోత్తరపదయోః అను స్థానమున అర్థశబ్దాన్విత 'తద్ధితార్థోత్తరపదసమాహారేచ' అను సూత్రము చేసినపిమ్మట 'భావిని భూతవ దుపచారః' అను న్యాయప్రకారము ద్విగుసంజ్ఞావిధానము చేసినాడు. అందులకే భాష్యమునం దిట్లున్నది: "ఏవం తర్హి అర్థే ఇతి వక్ష్యామి. అర్థేచేత్ తద్ధితానుత్పత్తిః బహువ్రీహివత్. అర్థేనచేత్ తద్ధితోత్పత్తి ర్నప్రాప్నోతి. ద్వైమాతురః ......... ప్రత్యయోత్తరపదయోః ద్విగుసంజ్ఞా భవతీతి వక్తవ్యమ్. ననుచోక్తమ్— ద్విగుసంజ్ఞా ప్రత్యయోత్తరపదయో శ్చే దితరేతరాశ్రయత్వా దప్రసిద్ధిరితి. నైష దోషః. ఇతరేతరాశ్రయమాత్ర మేతచ్చోదితమ్. సర్వాణి చేత రేతరాశ్రయా ణ్యేకత్వేన పరిహృతాని— సిద్ధంతు నిత్య శబ్దత్వా దితి. నేదం తుల్య మన్యై రితరేతరాశ్రయైః. నహి సంజ్ఞా నిత్యా. ఏవం తర్హి భావినీ సంజ్ఞా విజ్ఞాస్యతే. తద్యథా: కశ్చిత్ కంచిత్ తంతువాయ మాహ— అస్యసూత్రస్య శాటకం వయేతి. సపశ్యతి— యది శాటకః న వాతవ్యః; అథ వాతవ్యః న శాటకః. శాటకో వాతవ్యశ్చేతి విప్రతిషిద్ధం భవతి. భావినీ ఖల్వస్య సంజ్ఞా అభిప్రేతా. స మన్యే, వాతవ్యో యస్మిన్నుతే శాటక ఇత్యేతత్ భవతీతి." పాణిని యే యాలోచనతో సూత్రీకరించెనో భాష్యము దానిని బాగుగా ప్రదర్శించినది.

పాణిని సూత్రవ్యవస్థను గమనించినచో కాశకృత్స్నముని భ్రమపడియుండడు. ఈతని సూత్రదోషమును గ్రహించియే పాణిని చక్కగా నివారించినాడు. కాశకృత్స్నుని 'ప్రత్యయోత్తరపదయోః' అను సూత్ర మిచట ప్రత్యాఖ్యాత మయినను, ప్రసంగాంతరమున పాణిని ఇట్టి శబ్దవిన్యాసముతోడనే 'ప్రత్యయోత్తరపదయోశ్చ' (౭-౨-౯౮) అను సూత్రము విధించినాడు. పాణినీయగణపాఠమునందు కాశకృత్స్న నామమున్నది. కావున నీ ముని పాణినికి పూర్వుడు కానోపును.

పతంజలి కాశకృత్స్నవ్యాకరణమును జూచి యుండవచ్చును; కాని భర్తృహరి చూచినాడో, చూడలేదో తెలుపుట కష్టము. ఒకచోట 'తదర్హమ్ (పా. ౫-౧-౧౧౪) ఇతి నారబ్ధం సూత్రం వ్యాకరణాంతరే' అన్నాడు భర్తృహరి. దీనిపై వ్యాఖ్య వ్రాసిన హేలరాజు "వ్యాకరణాంతరే కాశకృత్స్నాదికే" అని వివరించినాడు. కిల్ హార్ను మహాశయుడు

జయాదిత్యుడుగాని, వామనుడుగాని దానిని చూడలే దన్నాడు:

*Why Chandra is passed over in Kasika on Panini (4. 2. 65 and 5. 1. 58). The authors of Kasika had occasion to speak of the three Adhyayas of Kasakritsna's sutra, of the eight of Panini, of ten of Vyaghrapada, they surely could not have helped thinking of the sutra of Chandra which contains six adhyayas. Amuse though I am to conjucture, I would venture to ask. Was Chandra Vyakarana good enough to be copied from, but too modern a work to be honourably mentioned together with the sutras of sages like Kasakritsna and others, of which Jayaditya and Vemana knew very little more than we do. (The Indian antiquary, vol. 5. pp 183-4).*

కాశికావృత్తిలో చాంద్రవ్యాకరణవిషయము నుదాహరింపని వామనజయాదిత్యులను గూర్చి కీల్‌హారన్ పై వాక్యములు లిఖించినాడు.

క్రీ. శ. ౧౨వ శతాబ్దిలోని క్షీరతరంగిణియందు "కాశకృత్స్న అస్యా నిష్ఠాయా మనిట్త్వ మాహుః" అని వ్రాసిన క్షీరస్వామి కాశకృత్స్నము చూడక యీ మాట లెట్లు లిఖించియుండును? క్రీ. శ. ౧౧, ౧౨ శతాబ్దులలో ఈ గ్రంథము లేకపోవచ్చును. కాని భారద్వాజసంప్రదాయమందో, సానాగసంప్రదాయమందో కల గురుపరంపరాశ్రవణమువలన నిట్లు క్షీరస్వామి వ్రాసియుండవచ్చును. మాధవీయధాతువృత్తియందుసాయణాచార్యుడు నిట్లే వ్రాసియుండును: "నిష్ఠాయా మిదం నేచ్ఛంతి కాశకృత్స్న ఇతి స్వామి కాశ్యపా" (౨-౫౯). స్వామి అన్నప్పుడు క్షీరస్వామి యనియు, కాశ్యపుడు బాలావబోధనవ్యాకరణ రచయిత యగు బౌద్ధకాశ్యపు డనియు గ్రహింపవలెను. వీ రిరువురు ౧౧, ౧౨ శతాబ్దులలోనివారు.

"త్రయోఽధ్యాయాః పరిమాణ మస్య సూత్రస్య త్రికం కాశకృత్స్నమ్" (౫-౧-౫౮), "ఏవం త్రికాః కాశకృత్స్నాః" (౪-౨-౬౫) అని కాశికావృత్తియందున్నది.

జైన శాకటాయనుడును అమోఘవృత్తియందిట్లే లిఖించినాడు. వీనినిబట్టి కాశకృత్స్నవ్యాకరణము మూడధ్యాయముల గ్రంథ మనియు, దానిని పఠించు వారలను కాశకృత్స్ను లనుచుండి రనియు తెలుచున్నది. ఈ వ్యాకరణమున మూడునాలుగు సూత్రములు మాత్రము నేడు లభించుచున్నవి. ఈతడు కాశకృత్స్నతండ్రి యని తోచును.

## సే న కీ య వ్యా క ర ణ ము

"సేనకేఽనాథ వై గ్రంథః ప్రణీత స్తదనంతరమ్."

"గిరేశ్చ సేనకస్య" (౫-౪-౧౧౨)అను సూత్రము అష్టాధ్యాయియం దున్నది. ఇంతకుమించి సేనకుని పేరు మరి యే గ్రంథమునందును కానరాదు. దీనినిబట్టి సేనకుని గ్రంథము బహుకాలముక్రిందటనే లోపించియుండును. పాణినిముని సేనకుని వ్యాకరణము స్వయముగా చూచినాడో, గురుపరంపరలో వినినాడో చెప్పుటకు వీలులేదు.

## కాశ్యపి వ్యాకరణము

"శిష్యాణాం హితకామేన కశ్యపేనాఽథ కాశ్యపి."

"తృషిమృషికృశేః కాశ్యపస్య" (౧-౨-౨౫); "నోదాత్తస్వరితోదయ మగార్గ్యకాశ్యపగాలవానామ్" (౮-౪-౬౭) అను సూత్రములు అష్టాధ్యాయియం దున్నవి. వీనివలన కాశ్యపివ్యాకరణగ్రంథ మేదో ఒకానొక కాలమున నున్నట్లు గోచరించును. కాశ్యపి పాణినికి ప్రమాణపురుషు డనియు, మహర్షి యనియు తోచును. "కాశ్యపకౌశికాభ్యా మృషిభ్యాం ణినిః" (౪-౩-౧౦౩) అను పాణినిసూత్రమువలన, కాశ్యపి ప్రోక్తమైన కల్పసూత్రమో, వ్యాకరణమో 'కాశ్యపి' నామమున ప్రసిద్ధ మయియుండు ననిపించును. కాశ్యపి ఋషిగ్రంథ మేదియు లభ్యము కాలేదు.

వాజసనేయిప్రాతిశాఖ్యలో కాత్యాయనమహర్షి కాశ్యపీయమతమునుగూర్చి ఉల్లేఖించినాడు. "లోపం కాశ్యపశాకటాయనౌ" (౪-౫): అనగా కాశ్యపశాక

టాయనుల మతమున రేఫముకాని, ఊష్మవర్ణముగాని పరమందుండగా మకారముగాని, నకారముగాని లోపించును. వానికి పూర్వమున నున్న స్వరము సానునాసిక మగు నని భావము. ఈ ప్రాతిశాఖ్యలో "అథ పద గోత్రాణి" (౮-౯౪) అను సూత్రము తరువాత—

"భరద్వాజక మాఖ్యాతం భార్గవం నామ భాష్యతే
వాసిష్ఠ ఉపసర్గస్తు నిపాతః కాశ్యపః స్మృతః"
(౮-౫౦)

అని యున్నది. పురందరశిష్యుడు మహర్షి భరద్వాజుడు ఆఖ్యాతమునుగూర్చియు, భృగుమహర్షి నామమునుగూర్చియు, బ్రహ్మర్షి వసిష్ఠుడు ఉపసర్గనుగురించియు, కాశ్యపమహర్షి నిపాతనుగురించియు విశేషముగా నాలోచనచేసినవా రని ప్రతీతమగుచున్నది.

బ్రూణో లీబిష్ మహాశయులు ప్రకటించిన క్షీరతరంగిణియందును,మాధవీయధాతువృత్తిప్రభృతిగ్రంథములందును తరచుగా కాశ్యపనామమున నానావిధ సూత్రములు, వచనములును ఉద్ధృతము లయినవి. మహర్షి కాశ్యపునకును, ఈ కాశ్యపునకును సంబంధము లేదు. ఈతడు క్రీ. శ. ౧౧, ౧౨ శతాబ్దులలోని సింహళ బౌద్ధపండితుడు. ఈతని 'బాలావబోధన' వ్యాకరణము సుప్రసిద్ధము. చాంద్రవ్యాకరణసారాంశము లీ గ్రంథమున సంకలితములు. ఇది ప్రచారము నొందుటచే చాంద్రవ్యాకరణము సింహళమునుండి తిరోధాన మందినది. ఇప్పు డక్కడగూడ బాలావబోధనవ్యాప్తి తగ్గిపోయినది.

## స్ఫోటాయన వ్యాకరణము

"స్ఫోటాయనేవ యోగాత్తు తథా స్ఫోటాయనం కృతమ్."

"అవజ్ స్ఫోటాయనస్య" (౬-౧-౧౨౩) అను పాణినిసూత్రముచే స్ఫోటాయనమత ముల్లిఖితము. "తపర స్తత్కాలస్య" (౧-౧-౭౦) అను సూత్రముపై భాష్యమున పతంజలి స్ఫోటాయనశ్లోకము నుద్ధరించి యుండవచ్చును :—

"ధ్వనిః స్ఫోటశ్చ శబ్దానాం ధ్వనిస్తు ఖలు లక్ష్యతే,
అల్పో మహాంశ్చ కేషాంచి దుభయం తత్ స్వభావతః".

స్ఫోటాయనవ్యాకరణ ముండె ననుటకు సందేహము లేదు. హైరణ్యగర్భమున స్ఫోటశబ్దము నామతః లేకున్నను స్ఫోటబీజము నిహితము. స్ఫోట మనగా శబ్దార్థప్రకాశక మగు స్వయంప్రభవశక్తివిశేషము. "స్ఫుటతి అభివ్యక్తీభవతి అస్మాదితి స్ఫోటః. స్ఫోటత్వమర్థప్రకాశకత్వమ్. ప్రకాశశ్చ జ్ఞానమ్. తథా చార్థనిష్ఠవిషయతాప్రయోజకశక్తిమత్త్వం పర్యవస్యతి" అన్నారు స్ఫోటవాదులు. మహాభాష్యాది తాత్పర్యానుసారముగా మనియర్ విలియమ్సు మహాశయుడు స్ఫోటసందర్భమున నిట్లు వ్రాసినాడు:

*"The eternal and imperceptible element of sound or words and the real vehicle of idea which bursts or flashes on the mind when a sound is uttered."*

కక్షీవత్పర్వతముపై ఔశిజనాము డగు వైయాకరణయోగి నిజగ్రంథమున శబ్దమున కుండెడి అర్థప్రకాశకశక్తివిశేషమును ప్రపంచించి, దానికి స్ఫోటమని పేరిడినాడు. ఈ నూతననామమువలన నతనికి స్ఫోటాయను డను పేరు ప్రసిద్ధమయినది. అతడు పాణిని కెంత పూర్వుడో తెలియదు; వ్యాసభగవానునకు తరువాతి వాడు మాత్ర మగును. మహాభారతమున స్ఫోటశబ్దము కానరాదు. కాని వ్యాసభాష్యమున స్ఫోటతాత్పర్యము నిహితమగుటచే స్ఫోటాయనుడు వ్యాసునకు తరువాతి వాడు, పాణినికిపూర్వుడు ననుట అసంగతము కాదు.

వ్యాసభాష్యము వేదవ్యాసప్రణీతము కాదనియు, మహాభాష్యపరవర్తి యనియు చాలమంది యందురు. వారి యుపపత్తులు, వానికి సమాధానములు పూర్వపక్షసిద్ధాంతరూపమున గానవచ్చును:

(౧) పూర్వపక్షము: మహాభాష్యముతో పోల్చి చూచినచో వ్యాసభాష్యరచనాపద్ధతి హీన మనియు, అది వేదవ్యాసవిరచితము కానేర దనియు డాక్టర్ రాజేంద్రలాల్ మైత్రామతము.

సిద్ధాంతము : యోగవార్తికములో విజ్ఞానభిక్షువు వ్యాసభాష్యము వేదవ్యాసప్రణీత మన్నాడు :

"సర్వవేదార్థసారోఽత్ర వేదవ్యాసేన భాషితః;
యోగభాష్యమిషేణాలో ముముక్షూణామిదంగతిః"

(౧ సూత్రవార్తికము). విజ్ఞానభిక్షువుకు పూర్వము వాచస్పతిమిశ్రుడు కూడ నిట్లే వ్రాసినాడు. యోగసూత్రములపై తత్త్వవైశారదీటీకారంభమున వాచస్పతి మిశ్రుడు—

"నత్వా పతంజలి మృషిం వేదవ్యాసేన భాషితే,
సంక్షిప్తస్పష్టబహ్వర్థా భాష్యే వ్యాఖ్యా విధీయతే"

అన్నాడు.

(౨) పూర్వపక్షము: వ్యాసభాష్యమున వార్షగణ్యనామ మున్నది (౩-౫౩). *'Yoga system of Patanjali'* అను గ్రంథభూమికలో ***Haughton Woods, "There is little room to doubt that Varshaganya was an older contemporary of Vasubandhu"*** అని వ్రాసినాడు. ***Professor Takakusu*** అను జపానీయవిద్వాంసుడు వసుబంధు క్రీ. శ. ౫, ౬ శతాబ్దులలోనివాడని నిర్ధారణ చేసినాడు. కావున వ్యాసభాష్యము ౫వ శతాబ్దికి ముం దుండుటకు వీలు లేదని హోటర్‌మహాశయుని వాదము.

సిద్ధాంతము: క్రీ. శ. ౫, ౬ శతాబ్దులలోని సిద్ధసేనగణి, ఉమాస్వాతిప్రణీత 'తత్త్వార్థాధిగమసూత్ర' భాష్యటీకలో ప్రసంగోపాత్తమయిన "సోపక్రమం నిరుపక్రమంచ" (విభూతిపాదము, ౧౨ సూత్రము) అను యోగసూత్రవ్యాఖ్య చేయునపుడు వ్యాసభాష్యమునుండి "యథాఽఽర్ద్రం వస్త్రం వితానితం హ్రస్వీయసా కాలేన శుష్యేత్ తథా సోపక్రమమ్; యథా చ తదేవ సంపిండితం చిరేణ సంశుష్యేత్ తదేవం నిరుపక్రమమ్..." ఇత్యాదివాక్యరాశి నుద్ధరించినాడు. ౫, ౬ శతాబ్దులలో వ్యాసభాష్య ముదాహృతమయి, అందు వార్షగణ్యుడు పూర్వాచార్యరూపమున నుల్లిఖితు డయినచో వార్షగణ్యుడు ౫, ౬ శతాబ్దులలోని వసుబంధువుకు సమకాలికు డెట్లు కాగలడు?

వసుబంధువుకు బహుపూర్వవర్తియగు ఈశ్వరకృష్ణాచార్యుని సమర్థించుటకై సాంఖ్యకారికపై 'యుక్తిదీపికా' వ్యాఖ్యలో కపిల-కణాద-వసిష్ఠ-హారీత-వృషగణాదిపూర్వాచార్యులవలె వార్షగణ్యుని వాదము కూడ ఉద్ధృత మయినది. యుక్తిదీపిక ఆధునిక గ్రంథము కాదు.

ఈశ్వరకృష్ణునకు చిరకాలముముందే "ఉరణ్ రపరః" (౧-౧-౫౦) అను పాణినీయసూత్రముపై మహాభాష్యములో క్రీ. శ. పూర్వము ౩, ౨ శతాబ్దులలోని పతంజలి వార్షగణ్యుని పేర్కొన్నాడు: "కర్తా హర్తా వార్షగణ్యః", "వార్షతి: వృషగణ స్యాపత్యమ్. గర్గాదిత్వాద్ యఞ్"అని ఛాయ.

పతంజలికి పూర్వమే పాణినీయగణపాఠమున, నడాదిగణమున "అగ్నిశర్మన్ వృషగణే"అని యున్నది. అభినవశాకటాయనుని "శరద్వచ్ఛునకదర్భాత్ అగ్నిశర్మకృష్ణదర్భాత్ భృగువత్సవసిష్ఠవృషగణబ్రాహ్మణాగ్రాయణే" (౨-౪-౩౬) అను సూత్రము చూచి పాణినీయగణపాఠమున నీయంశము ప్రక్షిప్తమైన దనవచ్చును. కాని, అతనికి పూర్వమే "నడాదిభ్యః ఫక్" (౪-౧-౯౯) అను సూత్రముపై కాశికావృత్తిలో నడాదిగణ ముద్ధృతమయినది. కాశీనాథ బాపూ పాఠక్ మతమున, దేవనందికృతజైనేంద్రవ్యాకరణమందలి "శరద్వచ్ఛునకదర్భాగ్నిశర్మకరణాత్.." (౩-౩-౧౩౪) అను సూత్రమును జూచి, పాణినీయగణపాఠాంశము కాశికకు పూర్వమునను, దేవనందికి పరమునను ప్రక్షిప్తమయినదట. ఈ యూహ ముచితము కాదు. జైనేంద్రవ్యాకరణమునకు పూర్వమే యున్న చాంద్రవ్యాకరణమున "నడాదిభ్యః" (౨-౪-౩౫) అను సూత్రముపై వృత్తిలో చంద్రగోమి పాణిని ననుసరించి "అగ్నిశర్మన్ వృషగణే"అని రచించినాడు. అగ్నిశర్మాయణవార్షగణ్యుడు వృషగణవీరుని పౌత్రుడు. వార్షగణ్యునితోపాటు వృషగణవీరుని నామము, వాదము యుక్తిదీపికలో గానవచ్చును. పాణిని ప్రాతిపదికపాఠమునందు వృషగణుని పేర్కొన్నప్పుడు వార్షగణ్యుని తప్పక ఎరిగియుండును.

పాణినికి పూర్వమే ద్వైతవనవాసియు, సామాచార్యుడు నగు జైమినిముని తన గృహ్యసూత్రములోని తర్పణప్రకరణమున వార్షగణ్యుని పేరు స్మరించినాడు.

తదనుసారముగా సామవేదశాఖాధిశేషమునందు వార్షగణ్యు నుద్దేశించి నేటికిని తర్పణము విడుతురు. సుబ్రహ్మణ్యశాస్త్రికృత గోభిలగృహ్యకర్మప్రకాశికాగ్రంథమున నిత్యాహ్నిక ప్రయోగమును జూడనగును.

మహాభారతశాంతిపర్వమున ౩౧౮ అధ్యాయములో గంధర్వరాజు విశ్వావసువు వార్షగణ్యుని స్మరించినాడు:

"జైగీషవ్యస్యాసితస్య దేవలస్య మయా శ్రుతమ్,
పరాశరస్య విప్రర్షేః వార్షగణ్యస్య ధీమతః"

కొందరుకొందరు వార్షగణ్యుని మంత్రద్రష్టగా భావించినారు. సాగి గాయత్రీ—ఉదాహరణమున తన్మంత్ర మొకటి "యజ్ఞో రిదం విశ్వ మేజతి తా విద్వాంసా హవామహే వామ్; వీతం సోమ్యం మధు" అనునది వినవచ్చుచున్నది. పింగళచ్ఛందస్సూత్ర (౩-౧౨) టీకలో యాదవప్రకాశుడు ఈ మంత్రమును వార్షగణ్యదృష్టముగా బలికినాడు.

వార్షగణ్యుడు వసుబంధువుకు సమకాలికు డను విషయమున *Woods* మహాశయుడు ఉపపత్తి చూపలేదు. కాబట్టి ఆయన భ్రమకు లోనయినాడు.

(౩) పూర్వపక్షము: "యథైకా రేఖా శతస్థానే శతం దశస్థానే దశైకా చైకస్థానే" (౩-౧౩) అను వ్యాసభాష్యము చూచిన, వ్యాసభాష్యకారుడు దశమికామానము నెరుగును. అది క్రీ. శ. ౬వ శతాబ్దిలోని వరాహమిహిరప్రవర్తిత మగుటచే వ్యాసభాష్యము అంతకు ముం దుండుటకు వీలు లేదని కొందరనుచున్నారు.

సిద్ధాంతపక్షము : దశమికమానశబ్దమువలన దశమికసంఖ్యయా (*decimal numerals*), దశమిక భగ్నాంశమా (*decimal fraction*) వీరు భావించునది? దశమికసంఖ్య వేదమున (యజు. ౧౭-౨) వ్యవహృతము. కావున దానితో వరాహమిహిరునకు సంబంధము లేదు. భాష్యకారుని యూహలో దశమిక భగ్నాంశ లేదు. అభిప్రాయ మది యగుచో "యథైకా రేఖా శతస్థానే శతతమాంశో (·౦౧) దశస్థానే దశతమాంశ (·౧) ఏకా చైకస్థానే (౧)" అని లిఖించియుండును.

(౪) పూర్వపక్షము : మాఘకవికి పూర్వము సంస్కృతభాషలో సంస్కారార్థక 'పరికర్మ'శబ్ద ప్రయోగము లేదు. శిశుపాలవధలో(౪-౫౫)"మైత్ర్యాది చిత్తపరికర్మవిదో విధాయ క్లేశప్రహాణ మిహ లబ్ధసబీజయోగాః"అని యున్నది. మాఘుడు మొదట సంస్కారార్థకపరికర్మశబ్దప్రయోగము చేయగా, అనంతరము "మైత్రీకరుణాముదితోపేక్షాణామ్..."అను సమాధిపాదసూత్రముపై వ్యాసభాష్యమున పరికర్మశబ్దము ప్రయుక్త మయినది. కావున వ్యాసభాష్యము ౭, ౮ శతాబ్దులలోని మాఘునికి పరవర్తియో, సమకాలికమో కావచ్చును.

సిద్ధాంతపక్షము: సనత్సుజాతీయభాష్యమున శంకరులు రాగిగీతలనుగూర్చి వ్రాసినారు: "ప్రసాదం కురు తన్వంగి, క్రియతాం పరికర్మ తే" అని రాగిగీతలోనున్నది. మాఘునికి పూర్వుడును, ౫, ౬ శతాబ్దులలోనివాడును అగు అమరసింహుడు "పరికర్మాఙ్గసంస్కారః" అన్నాడు. అమరసింహునికి పూర్వుడైన కాళిదాసు "విబుధైరపి యస్య దారుణైరసమాప్తే పరికర్మణి స్మృతః" అని కుమారసంభవమున ప్రయోగించినాడు. కాళిదాసునకు అత్యంతపూర్వుడగు ఆశ్వలాయనుని శ్రౌతసూత్రమున పరికర్మశబ్దము ప్రయుక్తము. మహాభారతములో అంగసంస్కారచిత్తసంస్కారార్థములందు పరికర్మశబ్దము కానవచ్చును. కావున యోగభాష్యకారుడు మాఘునివద్ద శబ్దము గ్రహింపలేదు.

(౫) పూర్వపక్షము: "తదస్యాస్త్యస్మిన్నితి మతుప్" (౫-౨-౯౪) సూత్రముపై మహాభాష్యమున "అథాస్తిగ్రహణం కిమర్థమ్? సత్తాయా మర్థే ప్రత్యయో యథా స్యాత్. నైత దస్తి ప్రయోజనమ్. న సత్తాం పదార్థో వ్యభిచరతి" అన్నాడు పతంజలి. దీనిని జూచి వ్యాసభాష్యమున "సర్వపదేషు చాస్తి వాక్యశక్తిః. వృక్ష ఇత్యుక్తేఽస్తీతి గమ్యతే. నసత్తాం పదార్థో వ్యభిచరతి" (౩-౧౭) అను రచన చేరిన దని కొందరన్నారు. దీనివలన వ్యాసభాష్యము మహాభాష్యమునకు పరము దున్నది.

సిద్ధాంతము: "న సత్తాం పదార్థో వ్యభిచరతి" అను వాక్యము రెండుభాష్యములలోను కానిపించు చుండుటచే ఇం దెవ్వరిది కాదు; ప్రాచీనకాలము నుండి ప్రతీతిలో నున్న ఆభాణక మనిపించును. ఏ సంప్రదాయమునకు చెందినదో చెప్పుట కష్టము. ఈ వాక్యము వైయాకరణగోష్ఠిలో నుద్గీత మని వాచస్పతి మిశ్రుని యభిప్రాయము. మహాభాష్యములో నున్న ఆభాణకములకు ప్రథమప్రవక్త లెవరో తెలియదు. అందులకే పాణిని అస్తిశబ్దము ప్రయోగించినాడు. తన కాలములోని వ్యాకరణమందలి ఆభాణకమును వ్యాసు డుపయోగించియుండును.

(౬) పూర్వపక్షము: విభూతిపాదములోని ౪౪వ సూత్రముపై వ్యాసభాష్యమున "అయుతసిద్ధావయవభేదానుగతః సమూహో ద్రవ్య మితి పతంజలిః" అని యున్నది. ఇందు మహాభాష్యకారుడే లక్షితుడు. ఈ వాక్యతాత్పర్యము మహాభాష్యములో "గుణసముదాయో ద్రవ్యమ్" (౪-౧-౩) అని కానవచ్చును.

సిద్ధాంతము: యుతసిద్ధావయవ మనియు, అయుతసిద్ధావయవ మనియు సమూహము రెండు విధములు. ఏ సమూహావయవములు అపృథగ్భావమున—అనగా పరస్పరసంశ్లిష్టభావమున అవస్థానము పొందునో ఆ సమూహము అయుతసిద్ధావయవము. దీనికి శరీర ముదాహరణము. "అయుతసిద్ధావయవభేదానుగతః సమూహో ద్రవ్య మితి పతంజలిః" అని వ్యాసభాష్యము. (*According to Patanjali substance is a collection, having for its basis the distinguishing features of its inseparable components.*) వాచస్పతిమిశ్రు డిట్లన్నాడు: "యుతసిద్ధాః పృథక్ సిద్ధాః సాంతరాలా అవయవా యస్య స తథోక్తః, యథా వన మితి. సాంతరాలా హి అవయవా......అయుతసిద్ధావయవశ్చ సమూహో వృక్షో గౌః పరమాణు రితి. నిరంతరా హి అవయవాః" మహాభాష్యమున "గుణసముదాయో ద్రవ్యమ్" అని యున్నది (*Substance is a collection of properties, such as form, i. e. object of sight etc.*). కైయటాచార్యుడు దీనిపై "గుణసముదాయ ఇతి. రూపాదిసన్నివేశమాత్ర మి త్యర్థః" అని, మరియొకచో "గుణానా మాశ్రయో ద్రవ్య మి త్యర్థః" అని వ్యాఖ్యానము చేసినాడు. భాష్యములోని యీ రెండు వాక్యములును ఏకార్థకములు కావు. సముదాయగత మయినను, సమూహగత మయినను పార్థక్యప్రదర్శనమే వ్యాసభాష్యప్రధానోద్దేశము. తత్ప్రసంగమున పతంజలివాక్య మని వినబడిన దానివలన అయుతసిద్ధావయవభేదానుసారియగు ద్రవ్యసమూహము నిర్ధారితమయినది. కావుననే వాచస్పతిమిశ్రుడు "త దేతేషు సమూహేషు ద్రవ్యభూతం సమూహం నిర్ధారయతి—అయుతసిద్ధేతి" అన్నాడు. మహాభాష్యమున "కస్య తావత్ భవా నేతం గుణం న్యాయ్యం మన్యతే స్త్రీత్వం నామ?" అని ప్రశ్నించి 'ద్రవ్యస్య' అను సమాధానము నంగీకరించుచు, ద్రవ్యస్వరూపనిర్ణయాభిప్రాయముతో పూర్వపక్షరూపమున "యది తావత్ గుణసముదాయో ద్రవ్యం, కా గతి ర్య ఏతే భావాః కృదభిహితా స్తద్ధితాభిహితాశ్చ చికీర్షా గోతేతి" (౪-౧-౩) అని పతంజలి వ్యాఖ్యానించినాడు. కావున నిచ్చట "గుణసముదాయో ద్రవ్యమ్" అనునది చరమసిద్ధాంతము కాదు. దానికై ౫-౧-౧౯ సూత్రముపై భాష్యమున "కింపునః ద్రవ్యం? కే గుణాః? శబ్దస్పర్శరూపరసగంధా గుణా స్తతోఽన్యత్ ద్రవ్యమ్" అని పతంజలి ద్రవ్యగుణభేదమును ప్రదర్శించినాడు. వైశేషికులు పదార్థవిభాగప్రసంగమున ద్రవ్యము, గుణము భిన్నపదార్థము లన్నారు. కావున ఉభయదృష్టికిని సంపూర్ణపార్థక్యహేతువగు వ్యాసభాష్యధ్వనిని మహాభాష్యమున కారోపించుట సంగతము కాదు.

ప్రాచీనకాలమున ఒకానొక మునిపుత్రుడు పతంజలినామధేయు డుండెను. సామశాఖాప్రవర్తకుడగు కౌథుమముని కాతడు శిష్యుడు. ఈ పతంజలి యొక సంహిత రచించినాడట. వ్యాసభాష్యకారుడీ సంహితనుండియే యీ వచనము నుద్ధరించియుండును.

ఇం దొకచో యుక్తిప్రదీపికాప్రసక్తి వచ్చినది. ఆ సందర్భమున కొన్ని విశేషములు చూడనగును. షడ్దర్శనటీకాకారుడగు వాచస్పతిమిశ్రుడు యుక్తిప్రదీపికాకర్త యని ప్రసిద్ధి కలదు. కాని యీ గ్రంథ

"నృపాంతరాణాం మనసా ప్యగమ్యాం
భ్రూక్షేపమాత్రేణ చకార కీర్తిమ్
కార్తస్వరాసారసుపూరితార్థ
సార్థః స్వయం శాస్త్రవిచక్షణశ్చ.
నరేశ్వరా యచ్చరితానుకార
మిచ్ఛంతి కర్తుం నచ పారయంతి
తస్మిన్ మహీపే మహనీయకీర్తౌ
శ్రీమన్నృగే౽కారి మయా నిబంధః"

'కల్పతరు'కారుడగు అమలానందు డిట్లు వ్రాసినాడు: "కార్తస్వరం సువర్ణం, తస్యాసారో అనవరత వర్షణం, తేన సుపూరితో౽ర్థిః కాంక్షితో యస్య సార్థస్య జనసమూహస్య స తథోక్తో బహువ్రీహిః. తథావిధః సార్థో యస్య ప్రకృతత్వేన వర్తతే స నృగ స్తథోక్తపరః. నృగ ఇతి రాజ్ఞ ఆఖ్యా."

మిహిరభోజునకు నృగు డను నామాంతర ముండవచ్చును. అతని కీపే రెట్లు వచ్చెనో అనుసంధానము చేయవలెను. నృశబ్దముపై గమ్‌ధాతు-ఉత్తర-డ ప్రత్యయమువలన నృగశబ్దము నిష్పన్నమయినది. నృగు డనగా నరులకు గమ్యస్థానము గాని, ఆశ్రయము గాని యగును. శివుడో, విష్ణువో అని భావము.

మహామహేశ్వరాచార్యవర్యు డగు శ్రీపుష్పదంతుడు "నృణా మేకో గమ్య స్త్వ మసి పయసా మర్ణవ ఇవ" అని మహిమ్నస్తోత్రమున మహేశ్వరుని స్తుతించినాడు. నృగమహారాజు ప్రసిద్ధుడు. భోజుడు నృగనామప్రసిద్ధి గాంచుటకు కారణ మున్నది. సాంఖ్యతత్త్వప్రకాశకుడగు కపిలుడు విష్ణునవతార మని పౌరాణికమతము. విన్సెంటు స్మిత్తు ఇట్లు వ్రాసినాడు:

*"Bhoja liked to pose as an incarnation of Vishnu and therefore assumed the title of Adivaraha, the primaeval boar, one of the incarnations of the God. Base silver coins inscribed with the title are exceedingly common in Northern India, and by their abundance attest the long duration and wide extension of Bhoja's rule. Unfortunately no Megasthenes or Bana has left a record of the nature of his internal government."*

కావున "రాజా విష్ణ్వంశసంభూతు డని ఋషులు నిర్వచించి, నృగశబ్దము వాడియుందు వాచస్పతియంతటి మహానుభావుడు భామతీ రెండుచోటుల నృగశబ్దము రాజపరముగా వాడినా అమలానందసరస్వతీస్వామి 'కల్పతరు' వ్యాఖ్యల "ఆచార్యం యో మహీపతిః మహో చకార తస్ నామ నృగ ఇతి" (౨-౧-౩౩) అని లిఖించినాడ దానవీరుడు, శాస్త్రవిచక్షణుడు, మహనీయకీర్తియ నగు భోజుని ప్రాజ్ఞులు స్తుతించుట యుక్తమే.

మహామహోపాధ్యాయ వింధ్యేశ్వరీప్రసా ద్వివేది న్యాయవార్తికభూమికలో నిట్లు వ్రాసినాడు "చాహమానవంశీయు డగు నృగప్రభువు దేహలీ (ఢిల్లీ రాజ్యమును పరిపాలించినాడు. వాచస్పతి భామతిలో అతనిని పేర్కొన్నాడు." ఐతిహాసికులు నృగరాజ విలసిల్లినట్లు సమ్మతించుట లేదు. "నృగశబ్దమువల గౌడాధిపతి ధర్మపాలుడు లక్షితుడు. వాచస్పతి ఆతని కాశ్రితుడు" అని ప్రజ్ఞానందసరస్వతి వ్రాసినాడు ఇది సంభావ్యము కాదు. ఆధునికచరిత్రకారులును పండితులును ధర్మపాలుడు క్రీ. శ. ౭౭౫-౮౧౦ వరకు రాజ్యము చేసినవా డనియు, శ్రీ శంకరాచార్యుల వారు ౭౮౮ లో ఆవిర్భవించి ౮౨౦ లో ఇహలీల చాలించి రనియు నమ్ముచున్నారు. వాచస్పతిమిశ్రుడు శంకరభగవత్పాదులకు సమకాలికుడు కానేరడు; కాని మిహిరభోజునికాలమున్నా డయినచో భగవత్పాదులకు పరవర్తియు, జయంతభట్టునకు పూర్వవర్తియు కాగలడు.

న్యాయసూచీనిబంధనమునుబట్టి చూచినచో మిహిరభోజుని పుత్రుడు మహేంద్రపాలుడు వాచస్పతికి సమకాలికుడు. కానేరడు వాచస్పతి మిహిరపాలుని యాస్థానమున నున్నచో రాజశేఖరునివలన నతని వృత్తాంతము గ్రంథస్థ మగును. భామతి[illegible] శ్లోకములో 'మహీప' శబ్ద మున్నది. దానివలన మ[illegible]పాలుని పౌత్రుడు మహీపాలుడు లక్షితు డగుటకు వలను పడదు. మహీపాలుడు ౯౧౪-౯౪౩ వరకు రాజ్యము చేసి, రాష్ట్రకూటవంశ్యుడగు తృతీయఇంద్రదేవునితో యుద్ధములో ఓడిపోయి, రాజ్యము విడిచిపోయినాడు. వాచస్పతి వర్ణించిన గుణగణము, సంపదలును మిహిరభోజునకే అన్వయించును.

(సశేషము)

# ఎరుక

[ ప్రాచీనగేయము ]



సంపాదన: శ్రీ చింతా దీక్షితులు

చిన్నదానా, చిన్నదానా,
రూపురేఖా లేదె నీకూ
పాపపుణ్యము లేదె నీకూ
కులము గోత్రము లేదె నీకూ.

చిన్నదానా, చిన్నదానా,
ఇంత చక్కని చిన్నదాన్ని
ఇంత దగ్గిర ఉంచుకోనీ
ఎన్నెన్నో యుగములనుంచీ
నిన్ను విడిచి బతికినానే
వట్టిబ్రతుకు బతికినాను.

చిన్నదానా, చిన్నదానా,
ఈ సంధిలో నిను జూచినాను
నీ రాక పోకా చూచినాను
నిన్ను జూచిన వేళనుంచీ—నీ
పొందు గోరీ చిన్నదానా,
నీమీాద కన్ను వేసితిని.

పోవోయీ పోవోయీ
చిన్నడా, నను పొందలేవూ, పోవోయీ
చిన్నవాడా చిన్నవాడా
నేను చిక్కను మాటలాకు
నేను చిక్కను మూాటలాకు
నేను చిక్కను ప్రజ్ఞలకు
నేను చిక్కను తెలివికి
చిన్నవాడా చిన్నవాడా
నన్ను పొందలేవు పోవోయీ.

ఓ చిన్నదానా చిన్నదానా
కొండంతా కొట్టు కొంటి
నీవు తెగువుతో పలుకుతున్నావూ
నీవు పలుకు పలుకు వింటేను
నా గుండెలో గుబు లెత్తుతుందీ
నా వళ్లు వణుకు ఎత్తుతుందీ
చిన్నదానా చిన్నదానా
కఠినముగా పలుకబోకే.

చిన్నవాడా చిన్నవాడా
ఆలుపిల్లల వదలితేనూ
అన్నదమ్ముల వదలితేనూ
ధనధాన్యము వదలితేనూ
నీ చుట్టపక్కాలు వదలితేనూ
చిన్నవాడా చిన్నవాడా
ఆపై చూతాములేరా.

చిన్నదానా చిన్నదానా
ఆలు పిల్లలు ఉండె ఏమీ
అన్నదమ్ములు ఉంటేఏమీ
చుట్టపక్కా లుంటె ఏమీ
ధనధాన్యా లుంటె ఏమీ
వాళ్ళూ ఉంటారు లేవే
నువ్వూ ఉంటావు లేవే.

ఓ చిన్నవాడా చిన్నవాడా
ఎంత పిచ్చివాడవోయీ

ఎంత అమాయికుడవోయీ
ఒక్క మగడికి అయితేనూ
ఇద్దరూ పెళ్లాలు ఉంటేను
ఒక పెళ్లాం ఇటు లాగా
ఒక పెళ్లాం అటు లాగా
వాడికి హాయి ఏమైన చిక్కేనా?

చిన్నదానా చిన్నదానా
నీ వన్నమాటా నిజమేనే
ఆలుపిల్లల వదులుతాను
అన్నదమ్ముల వదులుతాను
నా చుట్టపక్కాల్ వదులుతాను
ధనధాన్యాల్ వదులుతాను
కాలికింద కొమ్మ పోతే
నాకు
చేరి కందే కొమ్మ ఏదే?

చిన్నవాడా చిన్నవాడా
అంత పుణ్యము నీకు ఉంటే
వాళ్ళ నందరి వదులుకుంటే
కాలికింద కొమ్మ పోతే
చేరి కందే కొమ్మ నేనే
మంచి దిట్టమైన కొమ్మనిరా
ఆలునూ పిల్లలును నేనే
అన్నలూ తమ్ములును నేనే
చుట్టాలు పక్కాలు నేనే
ఈ లోకమూ నీ దేహము నేనే
చిన్నవాడా చిన్నవాడా
నీ జీవనముకూడాను నేనేరా.

చిన్నవాడా చిన్నవాడా
ఇక నన్ను పొందుతావోయీ
మనము ఇద్దర మేక మైనాక—
బుద్ధులన్నీ తీరిపోనూ
ఈ రాజాబజారులోనూ
బలే రామభజన చేద్దామూ.

[ఈ పై పాట ఆడవాళ్లు పాడుకొనేది. శేపల్లెలో పెద్దమ్మగా రనే యోగిని పాడగా నా మిత్రులు శ్రీ యన్. బలరామ రెడ్డిగారు వ్రాసుకొన్నారు. ఇది ప్రాచీనగేయము. ఉచితమని తోచినచోట కొద్ది సంస్కరణ చేసితిని. 'ఎరుక' అనే పేరు నేను పెట్టితిని. చింతా దీక్షితులు.]

---




[నాటిక]

శ్రీ తల్లావజ్ఝుల కృత్తివాస తీర్థులు

### స్వర మేళ

హోరు మని హోరు మని మ్రోగు రథనేమి!
భోరు మని భోరు మని రోదించు నెదలు!
రాలి పడి ధూళి చెడి వ్రీలి చను ఆశల్
బలి యైన హృదయాల రుధిరాల జాలుల్
హోరు మని హోరు మని మ్రోగు రథనేమి!

[శ్రావస్తిలో హోరుగాలి. కుటీరద్వారం చప్పుడు. దూరాన రథచక్రరవం. ఆకుల మర్మరధ్వని. చంటిపిల్ల కేరు మని ఏడుపు. సమయం సంధ్య]

**వాచస్పతి**

ఎవ రా తలుపు? సుప్రియా! పర్ణను సముదాయించు తల్లీ!

**సుప్రియ**

నాన్నా! ఎవరో పిలుస్తున్నారు. పిల్ల నిద్దరోదు. (క్షణం నిశ్శబ్దం) ఈసారి నీహారికాదేవి, ఆమె సోదరి మాంత్రికురాలు శ్రావస్తికి వస్తారట. (గాలిహోరు) ఈ పిలుపు ఎవరిదై ఉంటుంది? ఎవ రహో?

**వాచస్పతి (వృద్ధకంఠం)**

ఎందుకు తల్లీ? ఏ మాంత్రికురా లయితే నేమి, జరగవలసింది జరక్కుండా మానుతుందా?

**సుప్రియ**

నీహారిక, ఆమెసోదరి ఎక్కణ్ణించి వస్తున్నారు? పర్ణను ఆశీర్వదించమని ప్రార్థించనా?

**వాచస్పతి**

పిచ్చితల్లీ, ఆ అక్కచెల్లెళ్లు అనాదినుంచీ ఉన్నారు. ఎప్పుడూ ఉంటూనే ఉంటారు...ఎందుకు తల్లీ, కలతగా ఉన్నావు?

**సుప్రియ**

నాన్నా, ఈ హేమంతంలో ఆకులు రాలిపోతూ వుంటే నా గుండెలు దూసుకుపోతున్నాయి. అబ్బా! ఆకులు రాలడం, చలిగాలి సోకడం!

**వాచస్పతి**

ఇచ్చినవాడు మరిచిపోతే పర్ణ వెయ్యేళ్లు వర్ధిల్లాలి. వేయి వసంతాలు చూడాలి. నిత్యం తిరిగే చక్రాన్ని ఆపగలమా?

**సుప్రియ**

అవు నండీ...... బజ్జో చిట్టితల్లీ...... ఉయ్యాలకు కట్టిన గిలకలు చూస్తూ కన్ను మూస్తుందేమో అంటే, పడుకోదు. తల్లిదగ్గిరా పడుకోదు. దిష్టి అయినా తియ్యలేను.

**వాచస్పతి**

ఎందు కలా బాధపడతావు?

**సుప్రియ**

ఎవ రా తలుపు?......నాగుండెలకు ఏదో పిలుపు!

(కుటీరద్వారంవెనుక మాంత్రికురాలు)

**మాంత్రిక**

నేను మాంత్రికను. మా అక్క నీహారిక శ్రావస్తిలో హేమంతరథ మెక్కి విజయం చేస్తున్నది. ఊళ్లోవాళ్లందరూ ఆమె దర్శనానికి కానుకలు తీసుకురావాలి. 'తురుకేల' ఉద్యానందగ్గిరికి రావాలి.

సుప్రియ

కానుకలా ?

మాంత్రిక

ప్రియమై అమూల్యమైన మీ ఫలాలు.

వాచస్పతి

నీహారిక చల్లని తల్లి ! మానవకోటిరక్తం ఆ తల్లికి ఇష్టం !

సుప్రియ

నాన్నగారు ప్రవాహంలో ప్రతికెరటానికీ తల వొంచుతారు. మీ స్తిమితం నా చేలగుండెకు ఎలా వస్తుంది ?

మాంత్రిక

ప్రవాహవేగానికి తల వొంచకపోతే తలమునక లవుతుంది. మా అక్కగారి రాతిరథచక్రాన్ని ఎవ రాపగలరు? నీహారిక రథారోహణం చేసి ఊరుకేల ఉద్యానంలో ఊరేగుతుంది. ఆమె హోరుగాలిలో కొమ్మ లూపి, ఆకులు రాల్చుతుంది ! నేను శంఖం పూరించి 'ఓం హ్రీం' అనేసరికి రాలిన ఆకులు మా వశమై ధూళిపుప్పొడిలో దీనంగా పొర్లుతాయి ! తప్ప కుండా మీరు కానుకలతో రావాలి. ప్రతి హృద యమూ, ప్రతికుటీరమూ నైవేద్యము అర్పించాలి.

వాచస్పతి

(బాధలు అనుభవించి, అనుభవాతీతమైన కంఠం)

మాంత్రికురాలా ! నీవు అనాదిగా అదృశ్యంగా ఉంటూ మానవకోటిని వశం చేసుకొంటున్నావు. నీకు ఎదు రీదగలమా ?

సుప్రియ

నీహారికకు మా కానుకలే కావాలా ?

మాంత్రిక

ఓం హ్రీం— తప్పక కావాలి. హేమంత తుషారంవంటి మీ కన్నీటిజల్లుతో మా అక్క అభి షేకం చేసుకొంటుంది.

వాచస్పతి

సుప్రియా ! చిన్నదానివి ! ఆమెను మానవులు ఎదిరించలేరు. ఆ రథచారిణి ఎలాంటిదో నీ వెరగవు ! మాంత్రికురాలు శంఖారావం చేసేసరికి తీవ్రజంఝా మారుతం చెలరేగడం, మనం రాలడం, ఎండిధూళిలో కలవడం జరుగుతుంది. మాంత్రికమాట తోసివెయ్యకు తల్లీ !

[మాంత్రికురాలు శంఖారవం చేస్తూ నిష్క్రమణ]

సుప్రియ

తండ్రీ, ఏదో కాచి వడపోసిన అనుభవం చెబు తావు. నీహారికాదేవి వినీలకైశికాలతో తన నేత్రాలు కనపడకుండా బంధించుకొని అంధకారం కోరుతుందట ! ఆ భయంకరమూర్తిని ఎలా దర్శించను తండ్రీ ?

వాచస్పతి

మే మంతా ఎలా దర్శిస్తామో అలాగే. వెర్రితల్లీ! నీహారిక అంటే అంత భయ మెందుకమ్మా ?

సుప్రియ

అమ్మయ్యో ! రాలిపోయే తరుపర్ణాలతో విలా సంగా ఆడుకొంటుందా ?

వాచస్పతి

తల్లీ, ఆమెకు అదే విలాసక్రీడ !

సుప్రియ

ఆమె విలాసక్రీడ మానవులకు భయం కలిగిస్తుంది. ఏది ఎలా జరిగినా, మీరు స్తిమితంగా ఉండగలరు. ఈ హేమంతపరిదేవనం నా హృదయాన్ని కలచివేస్తు న్నదే. నా చిన్నితల్లిని చూచుకొన్నకొద్దీ ఆరని తృప్తి, వీడని వేదన !

వాచస్పతి

శాక్యసింహుడు ఉండగా ఎందుకీ తపన తల్లీ ? వెళ్లు, త్వరగా వెళ్లు.

సుప్రియ

అయ్యో పిల్ల ! కదలదు, మెదలదు ! ఎంత పని చేశావే మాంత్రికా ! అయ్యో. మందు, మందు !

వాచస్పతి

తల్లీ, మందూ మాకూ పనిచెయ్యవు. నువ్వు పద. నేను రాలేను. శాక్యమునిపాదాలక్రోల నీ చిన్నారిని అర్పించు. ఆ స్నేహసింధువు ఏ మంటాడో ?

సుప్రియ

(పరుగెత్తిన చప్పుడు) మంధు ! నా బిడ్డకు మందు ! శాక్యమునీ ! స్నేహసింధూ !

[౨]

[సుప్రియ పర్ణను ఎత్తుకొని పరుగెడుతుంది అందెల రవళి. ఆకుల మర్మరధ్వని]

సుప్రియ

అబ్బా, హోరుగాలి ! నా తల్లీ ! అబ్బా, నీహారికను ఎలా చూడను ? అబ్బా, వినలేను రథచక్రరవం ! వినలేను.

(దూరంగా రథధ్వని)

పాంథులు

ఘోష లహో, ఘోష లహో
రథ ఘోటక హేష లహో
ఆకుల సంకుల ఘోష లహో
ఘోష లహో, ఘోష లహో !

ఒక పాంథుడు

హిమదాహకీలలో
శిశిరంపు టార్తిలో
ఈ పర్ణ బ్రతుకింక
ఏమై పోవునో !
నాళమే తెగిపోనీ
రంగు లేమైపోనీ
అందాల పరువమ్ము
అశ్రువుల పాలౌనో !

మరొక పాంథుడు

ఈ హేమంతశోణఫలాధరం శిశిరానలకరాసిచేటురు తెగి సాంధ్యరక్తమై జాలిగా హరిదంతాక్రాంతమైనదే !

కవి

ఈ తరుపర్ణపాండిమ విరహశృంగి ప్రేయసీ శరీరకాంతి !

పాంథుడు

విధిజంఝూప్రభంజనధాటికి వశమై జీర్ణపర్ణాలు రథాగతి వేడుకొంటున్నాయి. ఏ నవపవవాసంతికవో స్వాగతంకోసం పత్రహృదయం తపిస్తున్నదో ! ...

కవి

ఈ హేమంతప్రకృతి జగజ్జననీవసనం! మాంత్రికురాలి రంగులతో, రేఖలతో, రుచులతో, అల్లిన వసనం!

సుప్రియ

అబ్బా ! ఈ హేమంతతుషారం ! నా చిన్నతల్లిముఖంకూడా కనపడదే ! మంచుజడికి చిన్నారికళ్లు మూసుకొనిపోతున్నాయి. నా గుండెల్లో ఎంత దాచుకొందామన్నా నీహారిక లాక్కొంటే ఎలాగ ? ఏందారి ! శాక్యమునీ ! స్నేహసింధో, నువ్వే దిక్కు !

[3]

[శాక్యముని, సుప్రియ]

సుప్రియ

కృపాసింధూ ! బుద్ధదేవా !

శాక్యముని

అలసి సొలసిన విహంగినివి తల్లీ ...

సుప్రియ

అయ్యో, నా పర్ణ ... పసికందు ... ప్రాణం ...

శాక్యముని

... ఊరుకో తల్లీ !

సుప్రియ

రెక్క లూడిన పక్షిని ...... నా కన్నతల్లిని బతికించాలి !

శాక్య ముని

వెర్రితల్లీ ! ఈ శ్రావస్తిలో నిరుపేదకుటీరాల్లో గాని, సౌధాలలో గాని నీహారికారథనేమిధ్వానం, మాంత్రికురాలి శంఖారావం విననివాళ్లుంటే, వాళ్ళదగ్గర పిడికెడు ఆవాలు పట్టుకురా, వెళ్లు తల్లీ !

సుప్రియ

ఎందుకిలా పరీక్షిస్తావు తండ్రీ ! నా చిన్నారిని నాకియ్యి తండ్రీ !

[౪]

[శ్రావస్తి. సుప్రియ ధనవంతుల గృహద్వారందగ్గిర]

సుప్రియ

ఎవరు తండ్రీ, ఎవరు తల్లీ, తలుపు తలుపు!

అబ్బా, హోరుగాలి! పిల్లలు గలదాన్ని! తియ్యండి తలుపు! అబ్బా, పిలుపు వినబడనంత బాధిరమా?

స్త్రీ కంఠం

ఎవ రమ్మా, ఉండు. (తలుపు తీస్తుంది) ఏం తల్లీ, ఇలా వచ్చావు ముసురులో?

సుప్రియ

తల్లీ, నీహారి రథచక్రరవం విన్నావా? విన్నావా తల్లీ?

స్త్రీ (ఇంట్లోనుంచి)

విన్నా నమ్మా విన్నాను. ఎన్నో సార్లు విన్నాను. ఎన్నో కానుకలు ఆ తల్లి మాగృహంలోంచి తీసు కొన్నది.

పురుషుడు

వినవో వినవో! రథచక్రారవ మదిగో!

వినవో వినవో! రథచక్రారవ మదిగో!

సుప్రియ

అమ్మా, తలుపు తలుపు!

(ఇంట్లోనుంచి కంఠం)

ఎవరి దా పిలుపు?

సుప్రియ

పేదగుండె పిలుపు!

వృద్ధకంఠం

ఏ మిలా వచ్చావు సుప్రియా! పిల్లదానికి సుస్తీ చేసిందా?

సుప్రియ

చెప్పు తల్లీ, చెప్పవా? విన్నావా రథచక్ర ధ్వానం—నీహారికరథధ్వానం!

వృద్ధకంఠం

ఏం తల్లీ?

సుప్రియ

వెంటనే చెప్పు తల్లీ...శాక్యముని పిడికెడు ఆవాలు తీసుకు రమ్మని......(డగ్గుత్తిక)

వృద్ధకంఠం

తరతరాలనుంచీ ప్రతిగృహంలో ప్రతిచెవికీ కాపాలరథనేమిధ్వని వినబడక తప్పదు...నా పతి మీదుగా చెట్టంత కొడుకుల్ని దోసతోటలాటి ఇంత వాళ్ళను, అంతవాళ్ళను (రోదిస్తూ) నీహారికకు అర్పించాను. నా తల్లీ, మనచేతుల్లో ఏదీ లేదు!

సుప్రియ

ఏ యిల్లయినా...ఏ కుటీరం గానీ, ఎక్కడా చక్రధ్వని వినని......ఇల్లే...లేదా? లేదా?

వృద్ధకంఠం

పిచ్చితల్లీ! ఊరుకో. శాక్యముని దయాశీతల సుధాహృదయం నీకు ఉపశాంతి కలిగిస్తుంది. వెళ్ళు.

సుప్రియ

శాక్యమునీ, ఎంత కఠినపరీక్ష? ఏది దారి? నీహారికా! (కోపంతో దుఃఖం దిగమింగుతూ) ఓ శిశిరా నిలకీలోజ్జ్వలకరాపీ? క్రూరక్షుధార్తభీకాట్టహాసీ! అబ్బా! మానవకోటిని నీ చతురంగపాళిలో ఓడించి, కరాళహాసంతో విలాసంగా అంధకారపేటికలో వేసు కొంటున్నావే!

[౫]

హోరు మని హోరు మని మ్రోగు రథనేమి!
భోరు మని భోరు మని రోదించు ఎదలూ!

సుప్రియ

కృపాసింధూ! గృహమే లేదు...చక్రధ్వని విననిది...రెక్క లూడిన పక్షిని...

శాక్యముని

ఏం తల్లీ, ఆవాలు పిడికెడయినా దొరకలేదా?

సుప్రియ

ఎందు కిలా పరీక్షిస్తావు తండ్రీ!

శాక్యముని

నీహారికను జయించి నీ పుత్రిక నిత్యమై వెలుగు తుంది.

సుప్రియ

ఈ తల్లిగుండె ఎంత తపిస్తున్నదో ఎరగవా! కడుపుతీపి ఏం చెప్పను?

శాక్యముని

రాలిన ఫలం మంటిలో బీజమై, వృక్షమై వన తలలో విచ్చుకుంటుంది. పుష్పరూపంలో పరిమళిస్తుంది!

కవాటం నీహారిక పాటనం చేస్తుంది. వెర్రితల్లీ, వసంతం విరియకుండా ఉంటుందా? మిహికాద్వారంతో యాత్ర పరిసమాప్తి కాదు.

కొమ్మలమీద పక్షులు

రాలవే పర్ణమా, అలరుశోభల వీడి
అందాలు పోవిడిచి, అమరధామము పోవె, రాలవే.
రాల్పవే ఆశలను రగులు నీ మిహికలో
శిశిరానిలమ్మునకు శీర్ణమై పోతివే, రాలవే
కన్నీరు గుండెలో కలచి శిలయై పోయె
రాల్పలే మశ్రువుల్, రాలమై పోతిమే! రాలవే

సుప్రియ

అమ్మయ్యో! నీహారిక వస్తున్నది. ఇవ్వను ఇవ్వను నా పర్ణను. అమ్మో, కరాళకుంతలాలతో కన్నులు కట్టుకొన్నదే! మానవలోకం చూస్తే హృదయం కరుగుతుం దని భయమా? మా రోదనం విన బడనంత బధిరవా? నీహారికా! ఎన్నిగుండెలమీద నీ రాతిరథం నడిపించావే? (గాలిహోరు—రథచక్రం స్పర్శ చేస్తూ) అబ్బా, స్పందనం లేని జడశరీరం!

ఎద పాషాణమె ఓ రథచారిణి?
మా గుండెలు నీ మార్గమ్ము లటే?
శిశిరకరాసిని దూసి కోసెదే?
మా రక్తములే మధురము లగునా?
మందారమ్ముల మంట కలిపెదే?

నీహారిక

మానవరోదన మెంత మధురమో! మాంత్రికా, రథం అవతరించి పర్ణను అందుకో.

మాంత్రిక (శంఖారవం)

ఏది సుప్రియా, నీ హృదయఫలం?

సుప్రియ

నా పర్ణ! నా గుండె! ఇయ్యను, ఇయ్యను, నా బాలమందారాన్ని!

శాక్యముని

తల్లీ! వినమ్మా తల్లీ! నీ కుమారి వసంతవనీ కుసుమంగా కుసుమిస్తుంది. కల్పలతికా ప్రసూనమై దివ్యపరిమళం విరజిమ్ముతుంది. నీహారికాదేవి పరిణామం అపలేదు. మాంత్రికురాలు శంఖారవం చేస్తుంటే ఋతుసంహారచక్రం తిరిగి పోక తప్పదు. రామ్మా నా దగ్గిరికి!

సుప్రియ (గద్గదకంఠి)

బుద్ధం శరణం గచ్ఛామి, ధర్మం శరణం గచ్ఛామి! సంఘం శరణం గచ్ఛామి, నమో తస్స భగవతో అహరతో సమ్మా సంబుద్ధస్స నమో......

నీహారిక

శ్రావస్తిలో మనకు లభించిన కానుకలు రథ చక్రాలకు కట్టు. సంతోషంతో ధైర్యంగా వాచస్పతి స్వయంగా కానుక అయినాడు. మాంత్రికా, రథ చక్రానికి కట్టెయ్యి.

మాంత్రిక

ఓం హ్రీం. (శంఖారవం) సరేనమ్మా!

నీహారిక (వికటహాసం)

జీర్ణతరుపర్ణాల బాధామంద్రగానం మధురం కాదే చెల్లెలా?

మాంత్రిక

అక్కా! నీ రథమార్గం హృదయరక్తాలతో సిక్తమై శోణమైంది!!

నీహారిక

నాకు హృదయరక్తం కావాలి.
హృదయాలతో నా ఆట!
మానవాశ్రువులలో నా జలక్రీడ!
రోదనమే కాహళి!
(దూరాన జనుల హాహాకారాలు)

స్వరమేళ

నమో తస్స భగవతో అరహతో సమ్మాసంబుద్ధస్స!

రథనేమి తడిసింది రాగరక్తాలతో
ముసిరింది ముసిరింది మూగగా తమసమ్ము.
పగిలింది పగిలింది పగిలింది ఒకగుండె.
శిశిరానిలమ్ములో శీర్ణమై పోయింది.
వాసంతిమధువుకై వసరింది వవరింది.




[కథానిక]

శ్రీ రా. సి. ఆంజనేయశాస్త్రి

చాలాకాలంనుంచీ తీసుకుంటూఉండి యిప్పుడు చచ్చిపోవడంవల్ల రామయ్య భార్య మాణిక్యమ్మమృతి కెవరూ వ్యాఖ్యానాలు చెయ్యలేదు. లోలోపల ఏమి ఆవేదన పడుతున్నా, రామయ్యకైనా, భార్య మరణానికీ, తను చేసిన హత్యకూ సంబంధ మేమీ స్ఫురించలేదు. కాని నెల తిరక్కముందే, గిండీ ఇంజనీరింగ్ కాలేజీలో చదువుకుంటున్న అతని పెంపుడు కొడుకు సుదర్శనం ప్రమాదవశాత్తు ఎలెక్ట్రిక్ ట్రెయినులోంచి పడి మరణించాడని తంతివార్త రాగానే ఊరంతా "నిండుప్రాణం తీసిన ఉసురు ..." అని నిర్ధారణగా చెప్పేశారు. రామయ్యకూ నమ్మక తప్పలేదు. అవును. తను తాసిల్దారు సుబ్రహ్మణ్యాన్ని చంపిన మాట వాస్తవమే. చంపాలని చంపలేదు. పదహారు వేలిస్తానన్నా ఒప్పుకోక, తనమీద "పర్మిటు లేకుండా బియ్యం రవాణాచేస్తున్నా"డనే కేసు పెట్టటానికి కూర్చున్నాడయ్యె! కేసే పెడితే తను తలెత్తుకు తిరగగలడూ? బెదిరిద్దామనే ఉద్దేశంతో కర్ర ఎత్తినమాట నిజమే. నిర్లక్ష్యంగా నవ్వుతూ జీప్ కారెక్కి "ఇక పోనియ్యవోయ్ కాసిం" అనేసరికి ఒళ్ళు భగ్గుమంది. ఆలోచించటానికై మేదీ? వెయ్యనే వేశాడు దెబ్బ! అలా వచ్చాయి రోజులు! మాడు పగిలే పోవాలి? సరే, చచ్చిపోయాడా పుణ్యాత్ముడు. తన నెవరూ అరెస్టు చేయలేదు. ఇదివరకటంత పెద్దమనిషిగానే తిరుగుతున్నా డిప్పుడూను. దొంగవ్యాపారం కూడా యథాపూర్వం చక్కగానే జరుగుతోంది... అయినా ఏదో బాధ, మంట, ఆవేదన ఎందుకు వేధించాలి తనని? ఆఖరికొక్కమాటైనా సుబ్రహ్మణ్యం తనకు కలలోకూడా కనపడలేదు. కాని క్షణక్షణమూ అతను తనను వెంబడించి "నన్నెందుకు చంపావు? ... నాపిల్లల గతేం కాను? ... లంచం పుచ్చుకోకపోయినందుకు నాకు చావూనూ, అలాంటి నన్ను చంపిన నీకు స్వేచ్ఛానా?" అని ప్రశ్నిస్తున్నట్టు బాధపడుతున్నాడు. ఆ ప్రశ్నలకు సమాధానం భూతలంలో ఎక్కడా కనిపించలేదు రామయ్యకు. ఒక్కొక్కప్పుడు-అర్ధరాత్రివేళ పెనుభూతాలల్లే ఆ ప్రశ్నలు అతని గుండెలమీద ఎక్కికూర్చుని కంఠం పిసికి ఊపిరి సలపకుండా ఉక్కిరిబిక్కిరి చేస్తాయి. సుబ్రహ్మణ్యం దగ్గరికే తను వెళ్ళగలిగితే తప్పంతా తనదేనసీ, ఏ శిక్షకన్నా తల ఒగ్గుతాననీ చెప్పేసేవాడే! కాని అలాంటి అవకాశ మేమీ

యీ లోకంలో కనిపించేటట్టు లేదు. "హంతకుడను నేనే" నని పోలీసుస్టేషను కెళ్ళి చెప్పేద్దా మనుకున్నాడుకూడాను ఓమాటు. తీరా వెళ్ళి చెబితే "వీడు పిచ్చివా" డని నెట్టేస్తారేమో! అంతకుముందే నలుగురు యానాదివాళ్ళను అరెస్టు చెయ్యడమూ, సుబ్రహ్మణ్యాన్ని చంపింది వాళ్లేనని కోర్టులో ఋజువవడమూ జరిగిందయ్యె! సెషన్సుజడ్జి కన్నా అసలువిషయం తెలియకపోదనీ, కేసు తప్పకుండా కొట్టేస్తాడనీ రామయ్య అనుకున్నాడు. కాని ఆయన హంతకులలో ఒకడికి ఉరిశిక్షా, తక్కిన ముగ్గురికీ యావజ్జీవ శిక్షా వేశాడు. ఆ సాయంత్రమే చెన్న పట్నంనుంచి తంతి వచ్చింది రామయ్యకు— "సుదర్శనం ఎలెక్ట్రిక్ రైలుకింద పడి చచ్చిపోయా" డని. అతనికి గంగవెర్రులెత్తాయి. కొడుకు పోయిన దుఃఖంకంటె నిరపరాధిని ఉరితీస్తారేమో ననే బాధ భరింపరానిదై పోయింది. శవాన్ని చూడటానికని పట్నం వెళ్లిన రామయ్య వారంరోజులయినా తిరిగి రాలేదు.

౨

అర్థబలంగాని, అంగబలంగాని ఏమాత్రమూ లేని యానాదులు హైకోర్టుకు అప్పీలుచేస్తారని ఎవరూ అనుకోలేదు. తన పేరు బయటికి రానియ్యవద్దని లాయరుతో ఎంత గట్టిగా చెప్పినా, ఊళ్లోమటుకు అందరికీ తెలిసిపోయింది-రామయ్యే అప్పీలుఖర్చంతా పెట్టుకుని ముద్దాయీలపక్షాన పనిచేశాడని. "ఎవడికోసం చేస్తాడు? లేకపోతే పురుగుబడి చావడూ—ఏపాపమూ ఎరగనివాళ్లని ఉరితీయిస్తే!" అన్నారు జనం చాటుచాటుగా. హైకోర్టువారు కేసు కొట్టేశారు. విడుదలయిన యానాదులు నలుగురూ వచ్చి "ప్రాణం రక్షించిన ప్రభువులు మీరు!" అంటూ రామయ్యకాళ్లకు మొక్కితే, అతను దుఃఖం ఆపుకోలేకపోయాడు. ఎక్కెక్కిపడుస్తూ, కన్నీళ్లు చాటుగా తుడుచుకుని, తలోవందా యిచ్చి "మీ రసలు దొంగజాతుల లిస్టులో కెందుకొచ్చారు?... హాయిగా ఏపనన్నా చూసుకోండి..." అని పంపించేశాడు.

ప్రపంచంలోని బరువైన వస్తువులన్నీ తన ఎదురొమ్ముమీద ఎవరో పేరుస్తున్నట్టు కుంగిపోతున్న రామయ్యకు యానాదుల విడుదల ఒక విశ్రాంతిని కలగజేసిన ట్టనిపించింది. కుమారుని మరణంవల్లకూడా తను మరింత తేలికపడ్డానని తరవాత తెలుసుకున్నాడు. భార్యమరణంమటు కతని బాధ నేమీ తగ్గించలేదు. అప్పటి కింకా, పోలీసు వాళ్లు తనను పట్టుకుంటారేమో, పట్టుకుంటే ఎలా లంచాలిచ్చి తప్పించుకోవాలి, తీరా విచారణకే వస్తే జడ్జికికూడా చెప్పాల్సొస్తుందేమో అనే ఆలోచనల్లోనే ఉన్నాడు.

ఏకోర్టులూ వెయ్యలేని శిక్ష సంఘం వెయ్యగలదు. సంఘంకూడా వెయ్యలేని శిక్ష మనస్సు వెయ్యగలదు. భార్యా, కొడుకూ చావటంవల్ల రామయ్యకు తగిన శిక్ష వేసినట్లే నని సంఘం సరిపెట్టుకుంది ఒకవిధంగా. కాని సుబ్రహ్మణ్యం అవివాహితకుమార్తెల మాట తలపుకొచ్చి రామయ్య రోజూ అర్ధరాత్రివేళ్ల నానాహైరానా పడటంమాత్రం ఇదివరకు మాదిరిగానే జరుగుతూనే వుంది. ఏదో అవ్యక్తశక్తి గుండెలు పట్టుకుని ఊపి చెంపదెబ్బ కొట్టి, "ఒరేయి! రామయ్యా

తాసిల్దారును చంపి దిక్కులేనివాళ్లను చేశావుగదట్రా పాపం ఆ పిల్లల్ని. వాళ్లు పెళ్లీ పెటాకులూ లేకుండా, అన్నంమెతుకులకూడా మొహం వాచి అఘోరిస్తుంటే, నిశ్చింతగా నిద్రపోదా మనుకుంటున్నావా? లే వెధవా! నీకడుపు చీలుస్తా" అని తనను తరుముతున్న ట్లనిపిస్తుంది. లేచి కూర్చుంటాడు తప్పనిసరిగా. ఇలా తనను హింసించడం కంటే మామూలుకోర్టువారు ఉరిశిక్ష వేసినా బాగుండును, ఒక్క అరగంట బాధతో సరిపోయేది!

తను తన తండ్రికి పెంపుడు. తనకు పిల్లలు లేక తనూ మళ్లా పెంపుడుచేసుకున్న సుదర్శనం యిలా అయ్యె! ఇరుపార్శ్వాలా నా అనేవాళ్లెవరూ లేరు. ఎందుకూ యీ ఆస్తంతా? తగలేసుకోనా? ఈ ఆస్తంతా ఎవరన్నా తీసుకుని తనకు మనశ్శాంతి ప్రసాదించరాదూ? అలాంటి శక్తిగలవాళ్లే ఉంటే ప్రపంచంలోని కోటీశ్వరులు నిశ్చింతతో ఎన్నిహత్యలన్నా చెయ్యొచ్చు!

### 3

తన తండ్రిని చంపిన రామయ్యను చూడటానికి సావిత్రి కొంతమాత్రమూ మనస్కొప్పలేదు యింతకాలమూను. చూసే వుంటే ఈపాటికే గరల్స్కూలులో ఉద్యోగం ఒచ్చేది. ఇక తప్పేటట్లు కనిపించలేదు. తండ్రి ఇన్సూరుచేసిపోయాడు కనక ఆ డబ్బుపెట్టుకుని యింతకాలం గుట్టుగా కాలం గడిపారు అప్పచెల్లెళ్లు నలుగురూ. ఇప్పుడా డబ్బు కాస్తా అయిపోయింది. నలుగురు కన్యలు మాత్రమే, వేరే మొగ సహాయంలేకుండా, ఒక యింట్లో కాపురం వుంటే ఊళ్లో యువకుల కెంత తేలిక భావమో సాధారణంగా ఊహించవచ్చు. కాని తాసిల్దారు సంపాయించిపోయిన మంచి పేరునుబట్టి ఆ యిల్లింతవరకూ ఎలాంటి అల్లరకూ గురికాలేదు. పెళ్లిళ్లయి కాపురాలు చేసుకుంటున్న ముగ్గురప్పల్లోనూ రెండోఆమె భర్త జిల్లాజడ్జి కావడంచేత కన్నూ మిన్నూ కానకుండా వుంది. వాళ్లు వీరి గడపే తొక్కరు. మూడోఆమెభర్త అతి సనాతనభావాలు కలవాడు. రజస్వలలయి ఏళ్ళు గడిచినా పెళ్లిళ్లు చేసుకోకుండా కూర్చున్న మరదళ్ళ నీడ పడితేనే సనాతనత్వమంతా మంట కలుస్తుందని వీళ్లని దాదాపు వెలివేశాడు. మొదటి అప్ప సంసారపక్షం. మేనరికంకూడానయ్యె! అడపాదడపా ఒచ్చిపోతూండటం కద్దుగాని నడుంకట్టుకు మరదళ్ళ పెళ్లిళ్లు చేసేటంత తాహతు కలవాడు మాత్రం కాదు ఆమెభర్త సాంబయ్య. ఉద్యోగంకోసం అంటూ చదవకపోయినా ఇల్లు గడవటానికి ఉద్యోగం చెయ్యాలిసొచ్చేసరికి ఆ చదువే అక్కరకొచ్చింది సావిత్రికి. దరఖాస్తులో తన స్థితిగతులూ, తండ్రిపేరుప్రతిష్ఠలూ అన్నీ ఉదాహరించినా, సిఫారసు లేనిదే ఉద్యోగం రావటం అసంభవ మని తేలిపోయింది. రామయ్య ఆ కమిటీ ప్రెసిడెంటుతో ఒక్క నోటిమాట చెబితేచాలు, టక్కున వేసి తీరాలి. అంత విలువ వుంది అతని మాటకు. అయితే తన పితృహంతకుడిని తా నెళ్లి అర్థిస్తుందా?

తన బావగారైన జిల్లాజడ్జిని ఒక్కమాట చూస్తే ఎక్కడో అక్కడ ఉద్యోగం ఇప్పిస్తాడని మన స్సూరించిందికాని, తండ్

పోయినతర్వాత యింతవరకూ తిరిగన్నా చూడని అప్పగుమ్మంలో కెళ్లటంకన్నా రామయ్యను ఒకమాటు సాయంచేయమని కోరటమే మెరుగనిపించింది సావిత్రికి. ఆత్మాభిమానం గల చెల్లెళ్లూ అదే సలహా చెప్పారు. చచ్చిపోయిన తల్లినీ, చంపబడ్డ తండ్రినీ, నిర్లక్ష్యం చేసిన అప్పనూ, వెలేసిన బావనూ, తమ దుస్థితినీ తలచుకుని తెల్లవార్లూ దుఃఖించటంవల్ల తెల్లవారకట్ల ఏం కునుకుపట్టిందో ఏమో పాపం, సావిత్రికి మెలుకువ వచ్చేసరికి బారెడు ప్రొద్దెక్కింది.

అప్పుడే రైలు దిగొచ్చిన సాంబయ్యను చూసి సావిత్రి బావురుమంది—"బావా! మా గతేమిటీ?" అంటూను. సహజంగా గంభీరస్వభావ అయిన సావిత్రి అంత బేలగా దుఃఖించడం సాంబయ్యకే ఆశ్చర్యంవేసింది. అనుకున్న ప్రకారం ఉద్యోగం రాలేదని మాత్రం గ్రహించాడు. అంతమాత్రానికే యింత బిగలాపడాలా?

"ఎందుకు సావిత్రీ అలా యిదవుతావు? సంగతేమిటీ?" అన్నాడు సాంబయ్య.

"నా పితృహంతకుడిని 'భిక్షాం దేహి' అనాల్సిన దురవస్థ పట్టింది బావా" అంది సావిత్రి ఎక్కెక్కెడుస్తూను. సాంబయ్యకు సరిగా అర్థంకాలేదు. చిన్నమరదలు సరస్వతి చెప్పింది "రామయ్య సిఫార్సుచేస్తే గరల్ స్కూలులో ఉద్యోగం యిస్తారనే ఉద్దేశంతో అతన్ని చూడాలనుకుంటోంది అక్కయ్య" అని.

సాంబయ్య దీర్ఘనిశ్వాసం విడుస్తూ ఒక క్షణం ఆగి "నువ్వు వెళ్ళొద్దు సావిత్రీ. రామయ్యతో నేను మాట్లాడొస్తా" నన్నాడు. ఏదో భారం దిగిపోయినట్లు సావిత్రి తెరిపిగా చూస్తూ "అయితే ఇప్పుడే వెళ్లిరా బావా! పొద్దెక్కితే ఆయన ఊళ్లోకి పోతాడేమో" అంది.

'భిక్షాందేహీ!' అని తనడిగితే ఒకటీ, తన తరఫున మరొకరడిగితే ఒకటీనా? వేస్తే గీస్తే ఆ ధర్మదాత వేసే ముష్టి ఎలాగూ తనకేగా! ఏమిటో వెధవమనస్సు! పిచ్చి తృప్తి!!

సాంబయ్య వెళ్ళేసరికి రామయ్య మంచంమీద పడుకునే ఉన్నాడింకా. తెల్లవార్లూ అసలు నిద్రేపట్టలేదట. కళ్లల్లో ఒత్తులేసుకూర్చున్నవాడు కూర్చున్నట్టే ఉన్నాడు ఉబ్బసం తెర రావడంవల్ల. తెల్లగా తెల్లారింతర్వాత కాస్త నడుంవాల్చాడు. కొంచెం కునుకుపట్టిందో, లేదో "కడుపులో మంట బాబోయ్" అంటూ లేచికూర్చున్నాడు. మళ్ళా దగ్గుతెర నిలవేసింది. ఓ మోతాదుమందు పుచ్చుకుని డాక్టరుకోసం నౌకరును పరిగెత్తించాడు. డాక్టరొచ్చి ఒక ఇంజెక్షనిచ్చి వెళ్ళేసరికి దగ్గు కాస్త తమాయించడంవల్ల మళ్ళా కాస్త పడుకున్నాడు. బాగా వయస్సుమళ్లిన వంటమనిషీ, ఒకరిద్దరు నౌకర్లూ తప్ప యింట్లో ఎవరూ లేక పోవడంచేత దివాణంలాటి లోగిలి బావురుమంటోంది. ఆ ముసలమ్మ కాస్త దూరపు చుట్టంకూడా అవడంచేత కేవలం వంటమనిషిమాదిరి కాకుండా, కాస్తంత ఆదరంతో రామయ్యకు మందూ మాకూ యిస్తూ కనిపెట్టుకునివుంటోంది.

వ్యాధేమాత్రమూ ప్రమాదకరమైంది కాకపోయినా, అదేం చిత్రమోగాని, తా

నింకా ఆట్టేకాలం జీవించననే అధైర్యం పుట్టింది రామయ్యకు. వ్యాపారమంతా గుమాస్తాల కప్పగించేశాడు. "ఆస్తిపాస్తులేంచేద్దామా" అనే ఆలోచనలోకూడా పడ్డాడు. ఏ దేవస్థానానికో, సత్రానికో రాసి పారేస్తే ఆలోకంలో యిన్నిళ్లు పుట్టుతాయి. ఏమో! తనకే నమ్మకం లేకపోయింది! ఈలోకంలో యింత వ్యథ అనుభవించాడుకదా! ఆ లోకంలోమటుకు తననిది విడిచిపెడుతుందా? మళ్ళా ఓకుర్రాణ్ణి దత్తు చేసుకుంటే, నోట్లో యిన్ని నీళ్ళన్నా పోస్తాడు. ఏమో! ఎవరి కెన్నిరోజులు నీళ్లున్నాయో యీమట్టిమీద! సుదర్శనం నన్నువిడిచిపెట్టి వెళ్ళిపోలేదూ? ఇలాగే తీసుకుంటూ ఇంకా త నెంతకాలం బతకాల్సుందో! "పాపీ చిరాయుః" అన్నారు. తీరా నిక్షేపంలాంటి ఏకుర్రాడో యీ పాపిష్ఠివాడి చేతుల్లో పడగానే ఎగిరిపోతాడేమో!

తాసిల్దారుగారి కూతుళ్లు చాలా కష్టదశలో ఉన్నారని ఆనోటా ఆనోటా వింటున్నాడు తను. ఒక్కమాటు వెళ్లి వాళ్ల కాళ్లమీద పడి, క్షమార్పణ వేడి యీ ఆస్తంతా వాళ్ల కప్పజెప్పితే, తను మనశ్శాంతితో నిశ్చింతగా చావవచ్చు. కాని తనకు మొహం చెల్లుతుందీ వాళ్ల ఎదుట పడటానికి? పోనీ, ఎవరిచేతనన్నా కబురుచేస్తే? అవును. అది బాగానే వుంది... ఇవాళ సుబ్బయ్యను పంపాలి అనుకుంటాగాని, వాళ్ళు నిక్కడికి రమ్మని కబురుచేస్తే ఒస్తారూ? పోనీ, తనే వెళ్లితే... నమ్ముతారూ తనను? కాదుకాదు...వాళ్లపేర విల్లు రాసేసి. ఆత్మహత్యచేసుకుంటే!... మళ్లీ దగ్గుతెరా...గుండెమంటా ఒచ్చింది... శ్రీరామరామా! పగవాడికికూడా ఒద్దురా బాబూ............

కళ్లు తెరిచి చూసేసరికి ఎదురుగుండా కుర్చీలో కొత్తాయ నెవరో కూర్చునివుండటం కనిపించింది. సాంబయ్య ఫలానా అని రామయ్యకు తెలీదు. ప్రశ్నార్థకంగా చూస్తున్న రామయ్యచూపులకు సాంబయ్య లేచి నిలబడి "...నేను సుబ్రహ్మణ్యంగారి అల్లుడినండి...అంటే...తాసీల్దారుగా యిక్కడ పని చేస్తుండగా, దొంగలు కొట్టి చంపారు చూశారూ, ఆ సుబ్రహ్మణ్యంగారికండి... నేను మేనల్లుణ్ణికూడాను......నా పేరు సాంబయ్య అంటారు.. ఏదో...తమతో..." అర్థోక్తిలోనే రామయ్య ఇక ఆపమటూ సైగచేశాడు. తను అధికప్రసంగం చేశానేమోననీ, ఒచ్చినపని సానుకూలపడదేమోననీ భయపడ్డాడు సాంబయ్య. రామయ్య తల తిరిగిపోయినట్టయింది. తా నెత్తిన కర్రా, వేసిన దెబ్బా, పగిలిన నెత్తీ, కారిన రక్తమూ...అన్నీ ఒక్కమాటు తెరమీద సినిమాచిత్రాలల్లే పరిగెత్తి కళ్లు బైర్లుకమ్మించాయి. సంతతధారగా కన్నీరు కారటం మొదలెట్టింది. సాక్షాత్తూ సుబ్రహ్మణ్యమే ఎదటి కొచ్చినట్టనిపించింది-మేనమామపోలికలు తీర్చిదిద్దినట్లు, మేనల్లుడు సాంబయ్య మొహంలో స్పష్టంగా కనపడటంవల్లనో ఏమో! రామయ్య యింత జబ్బుస్థితిలో ఉన్నాడని తెలీదు తనకు. తెలిస్తే యిప్పుడొచ్చేవాడే కాదు. ఆయనకు కష్టం కలిగించేమాట తనైనా అన్నదేముంది? ఫలానా అని గుర్తుచెయ్యటానికి "దొంగలు కొట్టి చంపిన తాసిల్దారుగా"రని చెప్పాడు...... సిఫారసు చెయ్యకపోతే పోనీగాని...కొంప

తీసి నామీదా, మరదళ్లమీదా దెబ్బ తియ్యడుకదా!...పుట్టలోఉన్న తాచును లేవ గొట్టాడేమిటి తను కర్మంకాలి! మనిషి రక్తం ఒకమాటు రుచిచూస్తే ఇక ఒదల రంటారుకూడాను......

ఏం ప్రమాదం మూడుతుందోనని కంగారుపడుతూ గాభరాగా ..."చిత్రం!... నేను మనవిచేసేది..." అంటూ ఏమో చెప్ప బోతున్న సాంబయ్యను మంచందగ్గిరిగా రమ్మని పిలిచి "...మీరు సుబ్రహ్మణ్యంగారి అల్లుడుగారా!... మేనల్లుళ్లకూడానా ..." అంటూ కావిలించుకున్నట్లుగా మీద చేతు లేసి పసిపిల్లాడల్లే బావురు మన్నాడు రామయ్య."ఆయన్ను చంపిం దెవరో మీకు తెలీదూ?..." అన్నాడు ఏడుస్తూనే .. సాంబయ్యకంగారు మరీ ఎక్కువైంది. అతను సమాధానం చెప్పకముందే రామయ్య —"మీకే కాదు ... ప్రపంచానికంతా తెలుసు. ఎవరికీ తెలియకపోయినా... ఆ పరమాత్ముడికి తెలుసు...ఆయనకూ తెలీక పోయినా ... చచ్చి స్వర్గానఉన్న ఆ సుబ్రహ్మణ్యంగారికి తెలుసు... కనీసం నాకన్నా తెలుసు సాంబయ్యగారూ... ఈ ఛండాలుడు కదూ ఆయన్ను చంపింది..." అని మళ్ళీ బావురుమన్నాడు.

"నావల్ల అపరాధమైతే..." నంటూ సాంబయ్య ఏమో చెప్పబోతూంటే అర్ధోక్తి లోనే రామయ్య అందుకుని "...ఎంతకాల మని కుమిలికుమిలి చావను సాంబయ్య గారూ!... క్షమార్పణ కోరుకుంటానికి కూడా నాకు మొహం చెల్లటంలేదు. ఆయన సాక్షాత్తు ధర్మరాజు. ఆయనే ఇప్పు డుంటే తనను హత్యచేసిన నన్ను తప్పకుండా క్షమించితీరేవాడు. నాకీ శిక్ష ఎంతకాలం? నన్ను క్షమించరూ? మీరూ, మీభార్యా, మరదళ్లూ—ఒకరేమిటి? సుబ్రహ్మణ్యంగారి రక్తస్పర్శ గలవాళ్లంతా నేను చిందించిన ఆయనరక్తాన్ని ఒక్కొక్క చుక్క తమ రక్తంలో కలుపుకుంటే నా యీచేతుల మరకలుపోతాయి..."అని ఆగాడు.సాంబయ్య కిలాంటి మాటలు వినడం యిదే మొదలు. అందులోనూ రామయ్యలాంటి లక్షాధికారి తనలాంటి బహుసామాన్యమైన మనిషి యెదుట యిలాంటి మాటలు మాట్లాడటం సాంబయ్యను ఉక్కిరిబిక్కిరి చేసింది. రామయ్య మాంచి ఆవేశంగా కనిపించాడు... కొంపదీసి సంధిచేస్త లేం కాదుకదా! ఏదో వ్యవహారసంబంధమైన విషయాలు మాట్లాడు కుంటున్నారేమోననే ఉద్దేశంతో, లోప ల్నుంచి వంటమనిషిగాని, ముందు దొడ్లో పశువులకొట్టం బాగుచేస్తున్న పనివాళ్లుగాని యీవేపేమీ దృష్టి సారించలేదు. డక్టర్ను దిగబెట్టి మందు కొనుక్కురాబోయిన నౌక రింకా తిరిగిరాలేదు.

నిర్ఘాంతపోయి చూస్తున్న సాంబయ్యను కుర్చీ మంచందగ్గిరిగా లాక్కుని కూర్చో మని చెప్పి... "మీమరదళ్ల కింకా పెళ్లిళ్లు కాలేదు కదూ!...అవును, ఎలా అవుతుంది? పెళ్లిచేసే తండ్రిని కాస్తా నేను పొట్టనపెట్టు కుంటిని..." అన్నాడు రామయ్య.

"తమ రలా ఏమిటోగా మాట్లాడు తున్నారు..." అన్నాడు కాస్త ధైర్యం తెచ్చుకుని సాంబయ్య... కన్నీళ్ల చారిక లలా ఉండగానే శుభ్రమైన ఒక చిరునవ్వు

నవ్వి ..."మీ రేమీ భయపడకండి...నేను ఒళ్లు తెలిసే మాట్లాడుతున్నా ... మీ మామగార్ని చంపిందీ మొదలు నేను పడుతున్న నరకయాతన ఆ పరమాత్ముడికి తెలియాలి... నే నింక ఎక్కువరోజులు బతకను. మీకు తెలిసే ఉంటుంది...నా పెంపుడు కొడుకు రైలుకిందపడి చచ్చి పోయాడు...నా కేమీ చింత లేదిప్పుడు...." దగ్గుతెర కొద్దిగా వచ్చేసరికి ఒక క్షణం ఆగి మళ్ళా సాగించాడు రామయ్య:

"చూశారా! ఆ పిల్లలకు మీరే ముఖ్య దిక్కు...పైగా మేనత్తకొడుకులు మీరు... పెళ్ళిళ్లూ, పేరంటాళ్లూ చెయ్యాల్సింది మీరు..." సాంబయ్య ఏదో చెప్పబోతే సందివ్వకుండా . రామయ్య తను చెప్ప దలుచుకుంది పూర్తిచేశాడు...

"నాకు తెలుసు మీ స్థితిగతులు...నా స్థితిగతులూ మీకు తెలుసు...గుమాస్తాల దగ్గిర అన్ని వివరాలూ ఉన్నాయి—ఏఏ ఫ్యాక్టరీల్లో ఎన్నెన్ని భాగాలు నాకున్నాయో!...నగదంతా బ్యాంకులో వుంది...ఇనప్పెట్టెలో వెండి బంగారా లున్నాయి....అంతా మీపరం చేస్తున్నా.... మీరు తిన్నా, మీభార్యాపిల్లలకు పెట్టినా సుబ్రహ్మణ్యంగారి రక్తమే.......మరదళ్ల పెళ్ళిళ్లుమటుకు చక్కని సంబంధాలు తెచ్చి చెయ్యండి....తండ్రిలేని లోపం తీర్చటం మీ తరం కాదు ...బ్రహ్మతరంకూడా కాదు.... అయినా శక్తివంచన లేకుండా. .. మనుష్య ప్రయత్నంగా...."

...దగ్గుతెర కొంచెం తీవ్రంగా వచ్చిందీమాటు...కాస్త తమాయించిన తర్వాత "నా ఉత్తరాధికారిగా మిమ్మల్ని నియమిస్తూ కాగితం రాస్తున్నా" అన్నాడు.

సాంబయ్య దిగ్భ్రమ చెందాడు. "...మీరు మనుష్యులు కారు...సాక్షాత్తు.." ....అర్ధోక్తిలోనే రామయ్య అందుకుని "రాక్షసిని..."అన్నాడు.



# ప్రాచీనఖగోళము

## [illegible]. గ్రహములు

### శ్రీ వేలూరి శివరామశాస్త్రి

పురాణములు 'రాహువు సూర్య చంద్రులను మ్రింగును' అని చెప్పెను. 'రాహువు పాము. అది బ్రహ్మవరదానబలమున సూర్యచంద్రుల నాచ్ఛాదించును' అని వసిష్ఠుడును, 'రాహువు తమోమయుడు. మేఘమువలె లేచి పర్వములందు చంద్రుని, సూర్యుని అచ్ఛాదించును' అని దేవలుడును చెప్పి రని ఉత్పలుడు వ్రాసెను.

చంద్రగ్రహణమునకును, సూర్యగ్రహణమునకును కారణము చెప్పబోవుచు ఆర్యభటుడు 'రాహువు కల్ల' అని అనెను. వరాహమిహిరుడు—'రాహువు సింహిక కొడుకు. అసురుడు. అమృతము త్రాగబోవుచుండు నా రాహువును చూచి విష్ణువు చక్రముచే వాని తల తరిగెను. అమృతస్పర్శచే రాహుప్రాణములు పోవలేదు గాని వానికి గ్రహత్వప్రాప్తి కలిగెను.' ఇట్లు చెప్పు ఈ పురాణములు నిజమై రాహువు గ్రహమయినచో రవిచంద్రులకువలె దానికి బింబ మేల లేదు? రాహువునకు బింబమున్నదని పౌరాణికు లందురుకదా! అది మన కాకాశమున కనబడదేల? బ్రహ్మవరప్రభావమున రాహువునకు కారశీకటవరంగు కలుగుటవలన అమాపూర్ణిమేతరతిథులందు కనబడదని వా రందురు. మరికొందరాచార్యులు సింహికాసుతుడగు రాహువునకు పడగయు, తోకయు గలవుగాని అవి విభక్తాంగములు అనియు, ఇంకకొందరు 'రాహువునకు మూర్తి లేదు. అది అంధకారమయు'డనియును అందురు. కాని రాహువునకు మూర్తి ఉండి—తలయే యుండుగాక, తోకయే యుండుగాక—నక్షత్రమండలమున నియతగతి యుండి, తిరుగాడుచో ఆరు రాసుల చాటున నుండియే చంద్రసూర్యులనుమాత్రమే ఏల గ్రసింపవలెను? రాహువుగతి నియతము కాదని యందురా, గణితముచే అతనిగతి తెలియుచునే యున్నదే. అతనికి తలయు, తోకయునే యున్నవని యందురా, ఆరు రాసు లెడముగా నుండియే యేమి, రెండు రాసులు మూడు రాసులు ఎడముగా నుండియే గ్రసింపవచ్చునే. రాహువు పాము అని యందురా—ఆ పాము తలతో మ్రింగనిండు, లేక తోకతో మ్రింగనిండు—సర్పాకారముగు నతని శరీరము తలతోకల నడుమ నున్న రాశి చక్రమునందలి అర్ధాంశమును, అనగా ఆకాశములో సగమును ఏల యాచ్ఛాదింపదు? కావున ఈ మాటల నన్నిటి నటుంచి తత్త్వము విచారింతము.

చంద్రగ్రహణసమయమున చంద్రుడు భూచ్ఛాయ నడుమను, సూర్యగ్రహణసమయమున సూర్యుని నడుమను ప్రవేశించును. సూర్యునినుండి ఏడవ రాశిలో భూచ్ఛాయ తిరుగుచుండును. చంద్రుడు పున్నమనా డచటికి వచ్చును. చంద్రుడును, భూచ్ఛాయయు తూరుపుదెసగా పోవుచుండును. భూచ్ఛాయకంటె చంద్రుడు వడిగా పోవును. ఇందువలన చంద్రుడు తూరుపుదిక్కునుండి భూచ్ఛాయలో ప్రవేశించును.

సూర్యగ్రహణసమయమున చంద్రుడును, సూర్యుడును ఏకరాశిలో నుందురు కాని సూర్యునిక్రింద నున్న చంద్రుడు వడిగలవా డగుటవలన పడమటినుండి వచ్చి సూర్యు నాచ్ఛాదించును. ఇందువలన చంద్రునిలో పడమటి సగమునందును, సూర్యునిలో తూరుపు సగమునందును గ్రహణమున కారంభము సంభవింపదు.

ఇట్లగుచో నెలనెలకును చంద్రగ్రహణ మేల రాదు? భూచ్ఛాయ మొదలు పెద్దది. చివర చిన్నది. చంద్రుడు సూర్యునుండి ఏడవ రాశిలో నుండి భూచ్ఛా

యకు ఉత్తరముగనో, దక్షిణముగనో దాటిపోవును. ఎక్కువదూరము పోవనియెడలనే పూర్వాభిముఖుఁడై భూచ్ఛాయలో ప్రవేశించును.



(సూర్యగ్రహణము)

చంద్రగ్రహణము అన్ని దేశములందును సమానముగనే కానిపించును. కాని సూర్యగ్రహణము దేశభేదముచే ఒకచోట కనఁబడును, ఒకచోట కనఁబడదు. దీనికి కారణ మేమి?

చంద్రుఁడు సూర్యునికిందుగా పడమటనుండి వచ్చిన మేఘఖండమువలె వచ్చి సూర్యు నాచ్ఛాదించును. ఈ కారణమున దేశవిశేషమునందు సూర్యగ్రహణము సర్వగ్రహణముగను, ఖండగ్రహణముగను కనబడును. మబ్బు అడ్డు వచ్చినచో సూటిగా క్రింద నున్నవారికి సూర్యుఁడు కనబడఁడు. అటులే సూర్యుఁడొకానొక దేశములో కనఁబడనేకనఁబడఁడు. మబ్బునకు సూటిగా క్రింద ఉండక ప్రక్కలనున్న కొందరకు సూర్యునిలో సాబాలును, కొందరకు నాలవపాలును, మరికొందరకు పగకపాలును కనబడును. గ్రహణమును అంతియే 1.

---

1. ౧౮౬౮ సంవత్సరమున ప్రకటితమయిన తత్త్వబోధిని అను మాసపత్రిక-౧ సంచిక-పూర్ణసూర్యగ్రహణమునుగురించి పెద్ద వ్యాసము వ్రాసెను. దానినుండి గ్రహింపబడిన యీ దిగువ విషయము ప్రకృతమున కుపయోగింపగలదు:—"మీఁద వ్రాసిన చరిత్రలోఁ గనుపఱచిన సంపూర్ణగ్రహణకాలము (౧౮౪౨ సం. ఫ్రాంసుదేశమందలి బెర్జినాక్ అనియెడు పట్టణమందుఁగలిగిన సంపూర్ణగ్రహణము) ౩ నిమిషముగా నుండియుండ, ఇపుడు మనము చూడఁబోవునది (౧౮౬౮ ఆగస్టు ౧౮) ౭ లేక ౬ నిమిషముల కాలముఁ గలదిగా నుంచున్నది. అధికముగాఁ జీఁకటిఁ గొన్న సంపూర్ణగ్రహణకాలము ౮ నిమిషములకుఁ హెచ్చఁబడనేరదు. రాఁగల సంపూర్ణగ్రహణకాలము ఆఱు నిమిషములుగా నుండుటకుఁ గారణ మేమనఁగా ఆకాలమందు సూర్యుఁడు భూమికిఁ దుంగోచ్చస్థానమందును, చంద్రుఁడు అతిసమీపస్థానమునందును బోవుచున్నారు. ఇంతటి దీర్ఘసంపూర్ణగ్రహణకాలము సంభవించుట యరుదు. జనులకుఁ దెలిసియుండువఱకు ఇటువంటి గ్రహణము లీవఱకు రెండే కలిగియున్న వని తెలియవచ్చుచున్నది. ఆ రెంటిలో ౧ ది క్రీస్తుజననమునకుముందు ౫౮౫-వ సంవత్సరము మేనెల ౨౮-వ తేది గ్రీసుదేశమందుఁ గలిగెను. అది యాదేశపు గొప్పపండితులలో నొక్కరగు థేలుసు అనువారిచే గణింపఁబడి యెల్లరకును దెలుపఁబడెను. రెండవది క్రీస్తుశకము ౧౪౩౩ సంవత్సరము జూన్ నెల ౧౭-వ తేది స్కాట్లండను దేశమందుఁ గనఁబడెను. వీనినెల్లఁ దలంచిచూడఁగా నీలాటి గ్రహణము ఇఁక నెన్నిశతాబ్దములకుఁ దరువాత ఎంత యరుదుగా సంభవించునో దాని మీరే యెఱుంగవచ్చును. కనుక యీ వచ్చెడు గ్రహణమును అలక్ష్యము చేయఁగూడ దని మన సోదరులకు మన మెచ్చరింపవలసినది మన ధర్మముగా నున్నది.

ఈ సంపూర్ణగ్రహణముయొక్క నీడ శ్రావణ-బహుళ అమావాస్యనా డుదయాన, ఆఫ్రికాఖండము యొక్క అబిసీనియాదేశమందలి కొండార్ అను పట్నమునొద్దఁ గలిగి తూర్పుముఖముగా బేబల్ మాండల్ జలసంధిని దాఁటి అరేబియాదేశమందలి మోకాఏడన్ పట్టణముల మార్గముగా యవనసముద్రమునందుఁ బ్రవేశించి సుమారు ౯ గంటకు హిందూస్థానపర్యాయద్వీపము పశ్చిమభాగమందుండు గోవా, సెవరన్ దుర్గము అను పట్టణముల నడుమ ప్రవేశించి తూర్పుగట్టున నుండు కృష్ణాగోదావరీముఖద్వారముల మార్గముగా భరతఖండ

మరియు చంద్రున కాచ్ఛాదకమగు భూమి పెద్దది. దానఁజేసి అర్ధగ్రస్తమగు చంద్రుని కొమ్ము మొక్కపోయిన చందముగా కానిపించును. సూర్యు నాచ్ఛాదించు చంద్రబింబము చిన్నది. దానఁజేసి అర్ధగ్రస్తుఁ డగు సూర్యుని కొమ్ము తీక్ష్ణముగా కనబడును.

దివ్యజ్ఞానము గల ఆచార్యులు కొందరు గ్రహణమున కీ పై కారణములు చెప్పిరి. కావున గ్రహణమున కసలు కారణము రాహువు కాదు కేతువు కాదు. పైఁజెప్పినదే శాస్త్రమున కర్థము.

---

మును వదలిపెట్టి బంగాళాఖాతముపై వ్యాపించి అండమానుద్వీపములకు నుత్తరముగాఁ బోయి మెర్గ్యుయిెన్ సరము లోనగు స్థలములను మలేయా యను పర్యాయద్వీపమును గడచి సయాంసింగుశాఖలో ౧౨ గంటల కించుకముందుగాఁ బ్రవేశించును. అచ్చట సంపూర్ణగ్రహణకాలము అఱుమ్మక్కాలుగంట. పిదప నచ్చోటి నుండి వెడలి కాంబోడియాపట్టణమును దాఁటి చీనాసముద్రమున కవ్వల బార్నియోద్వీపమందుఁ బ్రవేశించును. అవ్వల సెలిబీస్ ద్వీపములఁ గడచి న్యూగినియను ద్వీపముయొక్క దక్షిణభాగమును బొత్తిగా మూసి న్యూహెబ్రిడీస్ అను ద్వీపముమీఁద వ్యాపించును. ఆచోట సాయంకాల నాలుగంటలకు సంపూర్ణగ్రహణ మారంభించును. అమీఁదట గ్రహణము తెలియనేరదు.

పైనఁజెప్పిన నీడ హిందూపర్యాయద్వీపమునకు వచ్చునపుడు ౧౮౦ మయిళ్లు విరివి గలదిగా నుండును. ఆ ఛాయామధ్యరేఖ విజయదుర్గము, కోలాపురము, గుంటూరు, మచిలీబందరు మొదలయిన స్థలములకు సమీపముగాఁ బోవును. సంపూర్ణగ్రహణకాలము మచిలీబందరునందు ౫ నిమిషములును ౪౭ క్షణములును, గుంటూరున ౫ నిమిషములు ౪౨ క్షణములును, కర్నూలునందు ౪ నిమిషముల ౧౦ క్షణములనుగా నుండును.

సంపూర్ణగ్రహణచ్ఛాయయొక్క యుత్తరదక్షిణపరిణామము ముందు చెప్పినట్లు కాండార్ మొదలు న్యూహెబ్రిడీసుపర్యంతము రమారమి ౧౫౦ మైళ్లు గలదిగా నుండును. పార్శ్వగ్రహణముగా నిది ప్రపంచములోని పలుభాగములకుఁ దెలియవచ్చును. ఆ భాగము లేవనఁగా భూమధ్యసముద్రముయొక్క తూర్పుభాగము, నీలసముద్రమున నొక భాగము, కాస్పియన్ సముద్రము, ఏషియామైనరు, అరేబియా, పారసీకము, భరతఖండము, చీనాదేశపు దక్షిణభాగము, తిబేత్తు, ఫిలిప్పైను ద్వీపములు, పసిఫిక్కుమహాసముద్రము కొంతభాగము, ఆఫ్రికాఖండముయొక్క ప్రాగ్భాగము మెడగాస్కరువఱకు, మొరిషస్ బోర్బోన్ ద్వీపములు, ఆస్ట్రేలియా వాండిమెన్సులాండు మొదలగునవియే. ఈ సంపూర్ణగ్రహణమందు నక్షత్రములును, గ్రహములును సుమారు నలువదికిఁ గొఱవడక కనఁబడును. వానిలో ముఖ్యములు—అంగారకుఁడు, బుధుఁడు, శుక్రుఁడు, మృగవ్యాధుఁడు, కృత్తిక మొదలగునవి. ఇందులో శుక్రుఁడు సూర్యునికిఁ జక్కని పడమట నుచ్చస్థానములోఁ బ్రకాశించును. శుక్రునికిఁ గొంచెము త్తరపశ్చిమముల నంగారకుఁడు తెలియఁబడును. బుధుఁడు సూర్యునికి నించుక యీశాన్య మూలగాఁ జూపట్టును. నక్షత్రములలో గొప్పదైన మృగవ్యాధము శుక్రునికిఁ జక్కని దక్షిణమందు వెలుఁగును. వీనిలో శుక్రుని నెవ్వరు నెప్పుడును నుచ్చస్థానమందుఁ జూచియుండరుగాన నది మిక్కిలి యదృశ్యమైన వింత.

ఇదివఱకు నుగ్గడించినది గాక సంపూర్ణగ్రహణకాలమునందుఁ గలిగెడు నని శాస్త్రజ్ఞులు తెలిసియుండు నాలుగు వింతలు గలవు. వానిలో (౧) కస్పసు, అనునది సూర్యునిపైఁ జీఁకటి మూసికొనివచ్చి సూర్యుఁడు విదియచంద్రరేఖయుంబోలెఁ దోఁచునపుడు ఆ రేఖాంతములు వీడి కానుపించును. (౨) బేలిసీట్సు, అనునది సంపూర్ణగ్రహణ మగుటకుఁ గొంచెము ముందుగా సూర్యునియొక్క దారములవంటి కిరణముల ప్రకాశము నడుమ, పలుచోట్లఁ దునియలయి జపమాలవలెఁ దెలియఁబడును. మీఁదఁజెప్పిన రెండును చంద్రునివద్ద నుండెడు కొండల యుచ్చస్థానములని ఛాయచేతఁ గలుగుచున్న వని చెప్పుచున్నారు. ఈ రెండు వినోదములును దూరదృష్టి ముకురముచేతనే చూడఁగూడును. (౩) కొరోనా, అనునది సూర్యునిమీఁదఁ జంద్రుని ఛాయ వ్యాపించి సూర్యుఁ డున్న చోటు నలుపుగాఁ బోయినతర్వాత దానిచుట్టును మండలాకారముగా నొక కాంతి తెలియును. ఆ కాంతి పలురంగులు గలదిగా నుండు నని కొందఱు చెప్పెదరు. అది నల్లని బింబమునకు సమీపమందు మిక్కిలి ప్రకాశమైయుండును. సూర్యుఁడు మఱిగియున్నపుడు వానిఁ జుట్టియుండు వాతావరణమందు సూర్యప్రకాశము

అటు లగుచో శ్రుతిస్మృతి సంహితా వాక్యములు పొల్లులా ?

చంద్రుడు అమావాస్యనాడుగాని, పూర్ణిమనాడుగాని పాతమునకు దాపున లేనిచో గ్రహణము పట్టదు.



(చంద్రగ్రహణము)

"గ్రహణ సమయములయం దిచ్చు దానమును అగ్నిహవనమును బట్టి రాహువు తృప్తిపొందుగాక, అని బ్రహ్మ రాహువునకు వర మొసగెను. గ్రహణసమయమున రాహువునకు చంద్రసూర్యసాన్నిధ్యము కలుగును గావున లోకులు రాహువు చంద్రసూర్యులను మింగుచున్నాడని అనుకొందురు. ఇట్లు లనుకొనుటకు మరి యొక కారణమును గలదు. సూర్యుడు పోవు మందు దారికి ఉత్తరముగను, దక్షిణముగను చంద్రునకు గమనము కలుగుటకు హేతువు చంద్రపాతము. లోకు లా చంద్రపాతమునుగూడ రాహు వని అందురు" అని వరాహమిహిరుడు వ్రాసెను.

చంద్రపాతమునకు రాహు వని పేరు. ఇందువలన గ్రహణముతో రాహువునకు సంబంధ మేర్పడెను2.

అన్ని దేశములందును నేటికిని శాస్త్రముతో (Science) లోకశ్రుతికిని, పురాణాదులకును ఐక్యము నెగూర్చు యత్నము సాగుచునేయున్నది. వరాహమిహిరుడు మొదలుకొని భాస్కరునివరకు గల సిద్ధాంతకర్తలు శ్రుతిస్మృతిసంహితలతో ఖగోళవిజ్ఞానమున కేకవాక్యత కొరకు మిగుల పాటుపడిరి. భాస్కరుడు గ్రహణమునకు కారణము శంకించుకొని శిరోమణి వాసనచే— "సూర్యుని అచ్ఛాదకముకంటె చంద్రుని యాచ్ఛాదకము పెద్దది. ఎట్టులనగా అర్ధఖండితుడగు

---

పడుటవలన అది గలుగుచున్నది. సూర్యుడు మనుగుపడని కాలమందు వాని రశ్మిచేత నది లయమగుచున్న దగుటచే నప్పుడు మనకు దెలియకపోవుచున్నది. (ర) రెడ్ ప్రామినెన్సు-అనునది బయటకు విసరబడియుండు సెగ్గని జీరలు. వీనిలో గొన్ని సూర్యునిఁ జేరియుండునట్లును, గొన్ని చేరకయుండునట్లు నుండును. ఇవి వివిధపరిమాణ రూపములు గలవై కొండలవలెను, బట్టాకత్తులవలెను, గొలుకులవలెను గానబడును. వీనికిఁ గారణం బిద్ది యని యింక నెవ్వరుఁ గనిపట్టలేదు. తెలిసికొనుటకై జ్యోతిశ్శాస్త్రజ్ఞులు మిగుల గమనము గలవారై యున్నారు. ఇవి వట్టి కన్నులకుఁ దెలిసినను దెలియవచ్చును. గ్రహణకాలములందు సాధారణదూరదృష్టిముకురముల నుపయోగింపరాదు. ఉపయోగించినం గంట నిప్పుపడి కన్ను చెడిపోవును. మఱి వర్ణమిచ్చిన యద్దములఁ గొనియేని, పొగచూపిన యద్దములఁ గొనికాని, లేక గ్రహణకాలమునకని యాయత్తపఱచియుండు నాదర్శములచేతనైనను జూడవచ్చును.

2. ఐదు గ్రహములకు సమాగమము లేనిదే గ్రహణము పట్టదని వెనుకటివా రనుకొనెడివారు. ఇది మిథ్య. కొందరు—గ్రహణమునకు వెనుకటి అష్టమినాడు నీటిలో నూనెబొట్టు వైచెడివారు. అది ఏ దిక్కుగా ప్రసరించునో ఆ దిక్కున గ్రహణము పట్టు ననియు, ఏ దిక్కుగా ప్రసరింపదో ఆ దిక్కున మోక్షమగు ననియు అనుకొనెడువారు. ఇదియు మిథ్య అని వరాహమిహిరుడు. పై జనశ్రుతిని ప్రమాణముగా స్వీకరించినవాడు వృద్ధగర్గుడు. ఉత్పలుని టీక చూ.

చంద్రుని కొమ్ములు మొక్కవోయినవిగను, సూర్యుని కొమ్ములు తీక్ష్ణముగను కనిపించును. మరియు చంద్రగ్రహణపు స్థితికాలము దీర్ఘము. సూర్యగ్రహణపు స్థితికాలము అల్పము. ఈ రెండు కారణములచే సూర్యు నాచ్ఛాదించు రాహువు వేరు; చంద్రు నాచ్ఛాదించు రాహువు వేరు. సూర్యాచ్ఛాదకము లఘువు. కావుననే సూర్యుని, చంద్రుని ఆచ్ఛాదించువా డొక రాహువే కాడు. కారణ మేమనగా, ఒకనికి తూరుపున స్పర్శ. మరియొకనికి పడమట స్పర్శ. సూర్యగ్రహణ మొకప్పుడు కలుగును. ఒకప్పుడు కలుగదు. మరియు నొకానొకప్పుడు అమావాస్యచివర. మరి యొకానొకప్పుడు అమావాస్యకు మొదట. కావుననే గ్రహణము రాహుకృతము కాదు. అటుకాక, రాహువు లనేకు లందమా, ఊహూ. అసలు రాహువే లేడు. ఇటులు గణితము లోకవిద్యాభిమానులే పలుకుదురు.

కాని యీ మాట వేదబాహ్యము. పురాణబాహ్యము. సంహితాబాహ్యము. ఏలనగా సంహితలు రాహు వస్తుమగ్రహ మని చెప్పెను. పురాణము— 'సూర్యుడు రాహుగ్రస్తు డయినప్పుడు నీ రెల్లయు గంగ. ద్విజు లెల్లరు బ్రహ్మలు. దాన మెల్లయు భూదానము' అని చెప్పెను[3]. మరి సూక్తమందిన శ్రుతి— 'అసురుడగు రాహువు సూర్యుని చీకటిచే వేధించెను' అని వక్కాణించెను.[4]

అసలుసంగతి ఏమనగా, రాహుగతి అనియతము. అతడు తమోమయుడు. బ్రహ్మవరప్రదానముచే రాహువు భూచ్ఛాయలో జొచ్చి చంద్రుని ఆచ్ఛాదించును. చంద్రునిలో జొచ్చి సూర్యుని ఆచ్ఛాదించును. ఇటులు చెప్పినచో ఆగమము లన్నిటికిని విరోధము ఉండదు" అని వ్రాసెను. ఈ వ్యాఖ్యలో భాస్కరు డెంత తటపటాయించెనో అద్దములో కనబడినటులు కనబడుచున్నది. లోకప్రతీతిలో రాహువు ఛాయామాత్రుడు. సిద్ధాంతమునందు చంద్రపాతము. ఈ ఉభయార్థములను పురస్కరించుకొని రాహువుచుట్టును పురాణములు సుందరముగా భావనాభేద మొనరించెను.

## వివిధ గ్రహణములు

సవ్యము, అపసవ్యము, లేహము, గ్రసనము, నిరోధము, అవమర్దనము, ఆరోహము, ఆఘ్రాతము, మధ్యతమస్కము, తమోంత్యము అని గ్రహణములు పదివిధములు.

౧. సూర్యచంద్రులలో నెవరికేని దక్షిణమున గ్రహణ, మారంభమాయెనేని అది సవ్యగ్రాసము.

౨. వామభాగమున నారంభమాయెనేని అది అపసవ్యగ్రాసము.[5]

3. చంద్రబింబముగాని, సూర్యబింబముగాని నలుదెసలను చీకటిపడిరేం ముక్తమగుచో అది లేహన గ్రాసము.

౪. బింబములో సగపాలుగాని, మూడవపాలుగాని, నాలవపాలుగాని గ్రస్తమగుచో గ్రసనగ్రాసము.

౫. బింబమునకు ఒక వైపు నారంభమై పిదప బింబ మంతయు అచ్ఛన్నమై నడుమ నల్లని ముద్దవలె కనిపించినచో అది నిరోధగ్రాసము.

౬. బింబమంతయు సంపూర్ణముగా ఆచ్ఛాదితమై కొంచెము సేపటులే యున్నచో అది అవమర్దన గ్రాసము.

౭. మోక్షమగుపిదప మరల రాహు వాచ్ఛాదించునెడల అది ఆరోహణగ్రాసము.[6]

---

3. సర్వం గంగాసమం తోయం సర్వే బ్రహ్మసమా ద్విజాః
సర్వం భూమిసమం దానం రాహుగ్రస్తే దివాకరే.

4. స్వర్భానుర్హ వా ఆసురః సూర్యగ్ తమసా వివ్యాధ.

5. ఛాయ చంద్రుని అగ్నికోణమున ప్రవేశించినచో సవ్యము. ఈశానకోణమున ప్రవేశించినచో అపసవ్యము. ఇక సూర్యుని వాయుకోణమున ప్రవేశించుచో సవ్యము. నైరృతకోణమున ప్రవేశించుచో అపసవ్యమని ఉత్పలుడు.

6. ఇటులు పూర్వశాస్త్రముల ననుసరించి వరాహుడు చెప్పెనేకాని ఇట్టి గ్రాసము గణితగోళ యుక్తిచే సంభావ్యము కాదు. మరి యిది ఉత్పాతవిశేషము అని ఉత్పలుడు.

౮. నిశ్శ్వాసాంధమగు నద్దమువలె బింబమునందే కొంచెముప్రదేశమో కనబడినచో అది అఘ్రాత గ్రాసము.

౯. నడుమ చీకటియు, నలు పక్కల నైర్మల్య మును ఉన్నచో అది మధ్యతమోగ్రాసము.[7]

౧౦. పరిధిపర్యంతమున దట్టముగను, మధ్య భాగమున కొలది దట్టముగను చీకటి కానిపించుచో అది తమోహాన్త్య గ్రాసము.

## వి వి ధ మో క్ష ము లు

౧. చంద్రగ్రహణ మగ్నికోణమున విడుదల యగుచో దక్షిణహానుమోక్షము.

౨. ఈశానకోణమున విడుదల యగుచో వామ హాను మోక్షము.

౩. దక్షిణదిక్కున విడుదల యగుచో దక్షిణ కుక్షి.

౪. ఉత్తరదిక్కున నగుచో వామకుక్షి.

౫. నైరృతకోణమున నగుచో దక్షిణపాయువు.

౬. వాయువుకోణమున నగుచో వామపాయువు.

౭. తూరుపున మొదలుపెట్టి తూరుపుననే విడి చినచో సంఛర్దనము.

౮. తూర్పున పట్టి పడమట విడిచినచో జర ణము.

౯. మొదట బింబమధ్యము ప్రకాశము పొందిన యెడల మధ్యవిదరణము.

౧౦. నడుమ చీకటియు అంతభాగమున నైర్మల్యమును ఉన్నచో అంత్యదరణము.

ఇవి యన్నియు సూర్యునియెడలను చెల్లునుగాని ఎచటెచట పైని 'చంద్రునకు తూర్పున' అని కలదో అచటనచట 'సూర్యునకు పడమట' అనియు, ఎచట నెచట 'చంద్రునకు దక్షిణమున' అని కలదో అచట నచట 'సూర్యునకు ఉత్తరమున' ననియు ఈరీతిగ మిగిలిన అన్నిటిని విపరీతముగ మార్చుకొనవలయును.

సూర్యచంద్రులకువలెనే మిగిలిన గ్రహములకును గ్రహణము సంభవించును. 'రవితోగాని, చంద్రునితో గాని ఒకరాశిలోనుండి అచటినుండి విక్షిప్తము కానిచో గ్రాహకము ఆచ్ఛాదించుటచేసి ఆచ్ఛాదితమగు గ్రహమునుగూడ గ్రస్తమని చెప్పవచ్చును.' అని ఉత్పలు డనెను. ఈరీతిగా బుధునకును, అంగారకాదులకును గ్రాసము సంభవించును. చంద్రు డన్ని గ్రహములకున క్రింద నున్నాడు. ఇందువల్ల చంద్రుడు సూర్యుని గ్రసిం చినసందముగనే బుధాంగారకాదులనుగూడ గ్రసించును.

సూర్యునినుండి ఆరురాసుల దూరముగా భూచ్ఛాయ ఎల్లప్పుడును తిరుగుచుండును. కొన్ని అంశలుమాత్ర మెక్కువ యైనను, తక్కువ యైనను భూచ్ఛాయతోగాని, సూర్యునితోగాని చంద్రపాత మొక్క తావునకు వచ్చినయెడలనే గ్రహణము సంభవించు నని సూర్యసిద్ధాంతము. అమావాస్యాంతమునందు సూర్య చంద్రుల రాశి మొదలగునవి సమానము లగును. పూర్ణ మాస్యంతమునందు సూర్యచంద్రు లారురాసు లెడముగా నుందురు. కాని ఉభయుల అంశాదులును సమానము లగును. ఈ రెండు సమయములందును ఆచ్ఛాదింపబడు గ్రాహ్యమువ్యాసకళలును, ఆచ్ఛాదకమువ్యాసకళలును కలిపి వాని సగమునుండి చంద్రవిక్షేపమును తీసివేయగా మిగిలినది ఛన్నము. ఈ ప్రక్కఘటలోని ఛేద్యకము చూచునది.

భూచ్ఛాయ క్రాంతివృత్తమునందును, చంద్రుడు తాను తిరుగుమార్గమునందును, అనగా విమండలము నందును ఉన్నారు. చంద్రవిక్షేపము క్రాంతివృత్తము నుండి పరిమితముగానున్నది. ఈఛేద్యకమునందు చ భూ అనునది చంద్రవిక్షేపము. చంద్రబింబవ్యాసార్ధమును, భూచ్ఛాయావ్యాసార్ధమును కూడగా వచ్చిన ఫలము చంద్రబింబవ్యాసములో సమానమగుచో చంద్రచ్ఛాయ స్పృశించునేకాని తన్మధ్యమున ప్రవేశింపదని తెలియు

7. ఇట్టి గ్రహణము సూర్యునికే సంభవించును. ఏలన, సూర్యున కడ్డుతగులు చంద్రు డల్పుడు. చంద్ర గ్రహణమునందు ఛాద్యు డగు చంద్రు డల్పుడు. ఛాదకమగు భూచ్ఛాయ పెద్దది. కావున ఇటులు చంద్రగ్రహ ణము పొసగుటకు వీలు లేదని ఉత్పలుడు.

# కాలము - మృత్యువు

●

శ్రీ చల్లా పిచ్చయ్యశాస్త్రి

బుధునిఁగాఁ జూపు దొకపఱి, మూఢుఁ జేతు
ధీరు నొనరింతు వొకతూఱి దీనునట్లు
సుందరుఁ బొనర్తు వొకతఱి చూడరోఁత
వక్తమునిఁ జేతు వటు మూఁగ వక్తఁగాను
బంతి నొనరింతు మర్త్య, మను బంతిగాను
కుంటు నొనరింతు జాంఘాలికు నటు కుం
కాలమా! శారదాంబుదజాలమట్లు
మార్చుచుందువు జీవుల మఱుఁగు తెరను
కనుల కింపౌ 'ప్రపంచరంగ'స్థలమున
తప్ప ప్రోయని కర్మ'నాటక'మునందు
కొన్నిటి 'సుఖాంతముగ' మఱికొన్ని గఱకు
టమ్ముచందమ్మునను 'విషా'దాంతముగను
కదలు పాత్రలె నీకు లోగుదురు మాఱు[డు.
దురును, భగవంతుఁ డొక్కమాదిరియె యెపు

మృత్యువా! నీదు నడయును మెచ్చనగును
గాత్రరోధకవివిధరోగముల దండు
బంపె దీవు ముందుగాఁ బ్రాణివర్గమందు
నిందముఖమున వెడలింతు బొందిప్రాణ
ములను 'లుబ్ధుల' 'మూఢు'ల'ఖలు'ల'వంచ
కుల'ను 'ద్రోహు'ల'బరనిందకు'లను 'లాల
సులను' 'ధర్మ'విహీనులఁ దెలిసియేని
వారి చాయలకుం బోవ భయఁపడెదవు
'త్యాగు'లను 'యోగు'లను 'మహాభాగు
నిర్మలు'ల'దేవభక్తుల' 'ధర్మసత్య' [లఁ''వి
దీక్షిత'పరోపకారు'ల దేశములను
వెదకి గాలించి మ్రింగెదు 'వృద్ధు'లగుచు
చావు చా వనువారల సరసకేవు
సాగిపోలేవు కోర్కెల సందడులను
వృద్ధులను గోరు పిన్నల 'నింతలంత'
లయిన 'కూన'ల 'గుజ్జు'ల నలరువారి
సందుగొందుల గాలించి సంభ్రమించి
పెద్దపులివలెఁ బైఁబడి ముద్దయట్లు
మ్రింగెదవు సర్వకాలము సంగదోష
మాఁగిమణివలెఁ బొనరించి మన సెఱింగి
విశ్వరూపుని విశ్వాత్ము వేదవేద్యుఁ
దలఁచువారు మృకండుపుతనయురీతి
నిన్ జయింతురు తప్పక నిజము నిజము
లెక్కసేయరు వారికి మ్రొక్కులిడుము.

---

# విజయదశమి*

[ఏకాంకిక]

●

## శ్రీ బులుసు వేంకటేశ్వర్లు

### మొదటి రంగము

[ప్రవేశము: సుపార్శ్వమహర్షి యాశ్రమ ప్రాంతమున దపోనిష్ఠతో మహిషీరూపమున దితి.]

దితి: ఓ బ్రహ్మదేవా! నీ కింకను దయ లేదా! అబలనైనను నీదర్శనము కోరి పంచాగ్ని మధ్యమున నిలిచి తపించుచున్నానే! జాలి లేదా? చతురాననా! సన్నిధి నీయవా? దీనదయాళూ! రక్షింపవా? వాణీపతీ! కృప చూపవా? (ధ్యానించుచుండును)

సుపార్శ్వ: (ప్రవేశించి) ఏమిది! భార్గవవంశజుడ నగు నే నన్న నింతయు భయము లేక నా తపమునకు విఘ్న మొనరింపబూనిన యీ మహిషి యెవరు? ఆహా! పంచాగ్ని మధ్యమున నిలచియున్నదే! పశువుల కింత నియమనిష్ఠ యుండునా? ఎవరో యీ రూపమున దపస్సు చేయుచున్నట్లు తోచుచున్నది. తెలిసికొందును. (దివ్యదృష్టిని చూచి) ఓహో! తెలిసినది, తెలిసినది. ఇంద్రాదులగు సవతికొడుకులు తన కొడుకులను బాఱద్రోలి మహావైభవ మనుభవించుచుండగా జూడలేక దేవతలను జయించు పుత్రుని బడయగోరి బ్రహ్మదేవునిగుఱించి తపముచేయు దితి యీమె. ఈమె కోరిక సిద్ధించెనా జగత్ప్రళయమే రాగలదు. ఏమి చేయుదును? సరే. ఈమె తపమునకు విఘ్న మొనరింపబూనెదను. ఇదియు దేవహిత మగును. కావున దోషము లేదు. (సమీపించి) ఓ దితీ! నీ కిదేమి పని? కశ్యపప్రజాపతిభార్యవైన నీ కీ తపము లేల? చాలించి పొమ్ము. అబలలకు మహాదోషము తపము. పొమ్ము, పొమ్ము.

దితి: (వినిపించుకొనక మహాదీక్షతో నుండును)

సుపార్శ్వ: (కోపముతో) ఏమి! నన్ను జూచియు వందనమైన జేయకున్నదే! భార్గవవంశజు నింత చులకన చేసిన యీ దితి నిపు డూరక విడుతునా? (కమండలువులోని జలము చేతిలో పోసికొని) ఇదిగో! ఈ దితికి జనించు కొడుకు మహాభయంకరుడై ఈమెచేష్టకు దగినట్లు మహిషుడై యుండుగాక! (శాపజలము విడుచును)

దితి: మునీశ్వరా! నీ శాపము నాకు వరప్రసాద మగుగాక! ఎట్టికొడుకైనను వా డింద్రాదుల జయింపగలుగువా డగు నని వరమీయ వేడుదును.

సుపా: దితీ! నీ కదియును సిద్ధింపగలదు. నీ తపము జగత్త్రయసంక్షోభకరముగా నున్నది. త్వరలో బ్రహ్మ సన్నిధి నీయగలడు. వర మాత డొసగును.

(నిష్క్రమి)

దితి: ఓ కమలగర్భా! కరుణింపుము. సృష్టికర్తా! ప్రత్యక్షము కమ్ము. నీ వీనాడు నాకు దర్శన మీయనిచో నాశరీరమును ఈ హోమకుండమున విడుచుట తప్పదు. (ధ్యానించును)

బ్రహ్మ: (ప్రవేశించి) మానినీ! చాలింపుము, చాలింపుము. నీతపమునకు మెచ్చితిని. వరము వేడుకొనుము.

దితి: ఓహో! భగవానులా! (నమస్కరించి) మహాత్మా! నీ కెఱుగని దేమున్నది? అదితిపుత్రులం నాపుత్రులను నిర్జించి న న్నపుత్రవతి జేసిరైరి

---

* కథాభాగము మార్కండేయపురాణాంతర్గతము; కల్పనము సొంతము.

నారు. తాము దయయుంచి, యింద్రాదులను జయించి స్వర్గరాజ్యమును బాలింపగలుగు సమర్థుగు పుత్రు నను గ్రహింప బ్రార్థింతును. దేవా! సుపార్శ్వమహర్షి మహిషుడు నాకడుపున బుట్టుగా కని శపించి యున్నాడు.

బ్రహ్మ: దితీ! సరియే. మహిషముఖము గలిగి వను సగము శరీరము నరశరీరుడై నీవు కోరినట్టి పుత్రుడు నీకు గలుగ వరమిచ్చితిని.

దితి: ధన్యాత్మను దేవా, ధన్యాత్మను!

బ్రహ్మ: నీ విక దపము చాలించి పొమ్ము. (అంతర్ధానముగును)

దితి: ధన్యాత్మను దేవా, ధన్యాత్మను!

(నిష్క్రమి)

## రెండవ రంగము

[ప్రవేశము: విద్యున్మాలి, విప్రచిత్తి యను రాక్షసులు.]

విద్యు: వత్సా! వింటివా, మన యదృష్ట వార్త?

విప్ర: ఏ మది?

విద్యు: దితితపమునకు మెచ్చి బ్రహ్మదేవుడు ప్రత్యక్షమై యింద్రాదుల నోడింమ పుత్రుడు కలుగు నని వర మిచ్చియున్నాడుకదా!

విప్ర: ఔనౌను. తరువాత?

విద్యు: దితి గర్భము ధరించి పుత్రుని గన్నది. ఆతడు శుక్ల పక్షచంద్రునివలె వృద్ధిపొందుచున్నాడు.

విప్ర: సరే. మంచివార్త చెప్పితివి. మన కిదే యదను. మన సైన్యములను సిద్ధపఱచి యా మహిషాసురునికడ కరిగి యాతని యాధిపత్యమున స్వర్గముపై దండెత్తుదము.

విద్యు: వత్సా! బాగుగా గ్రహించితివి. నే ననబోవునదియు నదియే.

విప్ర: ఎన్నాళ్లనుండియో యెదురుచూచు చున్నాము. ఇక ఆలస్యము వలదు. మహిషునాధిపత్యమున మనకు మహావిజయము తప్పదు.

విద్యు: ఇంకను సందేహమా! మన దినములు పండినవి.

రాక్షసుడు: (ప్రవేశించి) ఎవరు వారు? విద్యున్మాలి విప్రచిత్తులా? మీ రింకను సిద్ధము కారేమి?

విద్యు: ఎందుకు?

రాక్ష: మీ రింకను వినలేదా? మన పెద్దలు మహిషాసురుని దగ్గఱ కేగి యాతని వీరత్వమును గొని యాడి 'వత్సా, స్వర్గరాజ్యము మనది. విష్ణుమూర్తి బలము నూతగా గొని దేవతలు మనవారిని జంపి మన రాజ్య మపహరించియున్నారు. ఇప్పుడు మనము వారిపై దండెత్తి మన రాజ్యము మనము జయింపవల యును. కావున, ఈ దానవానీకమునకు నీవే ప్రభు వవై యుద్ధమునకు సిద్ధము కమ్ము. నీభుజబలమున స్వర్గము మనవశమగును. నీవే ముల్లోకములకు రాజ వగుదు' వని హెచ్చరించిరి. మహిషుడు వెంటనే సింహనాదము చేసి మీమీ సైన్యముల గొనిరం డని మనకు వర్తమాన మంపినాడు. కావున, మీరును మీమీ సైన్యములతో వెనువెంటనే బయలుదేఱవలయును.

విద్యు: వత్సా! వింటివా? మనము వెదుక బోయిన తీవయే వేలికి దగిలిన ట్లైనది. రమ్ము. త్వరగా బోవుదము.

విప్ర: ఆహా! నా కుడికన్నదరుచున్నది. జయము మనదే.

రాక్ష: రండు. రండు. తక్షణమే పోవల యును.

(నిష్క్రమి)

## మూడవ రంగము

[ప్రవేశము: శివుడు, విష్ణువు.]

శివు: మధుసూదనా! వింటివికదా బ్రహ్మ దేవుడు దితి కిచ్చిన వరవిశేషము?

విష్ణు : పశుపతీ ! వింటిని, వింటిని. మహిషుడు జన్మించి పెరిగి పెద్దవాడై స్వర్గమును ముట్టడించుటకూడ వింటిని.

శివు : కొంతకాలము దేవతలకు మహిషుని బాధలు తప్పవు.

విష్ణు : ఔను. దేవతలకు గర్వభంగము కావలయును. అపుడు బుద్ధివచ్చి మనపాలికి వచ్చి మొఱలిడుదురు. అపుడు మహిషాసురవధకు మన ముపాయ మూహింతము.

శివు : ఔను. ఈపాటి కింద్రాదుల నాతడు మర్దించియే యుండును. స్వర్గరాజ్యము నాక్రమించి యా రక్కసుడు పాలించుచునేయుండును.

విష్ణు : సత్యమే.

(తెరలో కలకలము)

శివు : అదిగో ! ఈ సంక్షోభము దేవతలదే. వారికీపాటికి మంగళాష్టకములై కాందిశీకత ప్రాప్తించి యుండును.

విష్ణు : ఔనౌను. ఆ వచ్చువారు వారే. చూడుము. బృహస్పతిని బురస్కరించుకొని యింద్రాదు లిటే వచ్చుచున్నారు.

శివు : రానిమ్ము. మన మేమియు నెఱుగనట్లుందము.

[ప్రవేశము : బృహస్పతి, ఇంద్రుడు, దేవతలు]

బృహ : ఇంద్రా ! దేవతలారా ! ఇదిగో ! హరిహరు లిరువురు నిటనే యున్నారు. జయజయధ్వానములతో సమీపింతము.

అందఱు : జయము, జయము, త్రిలోకనాథులారా ! జయము, జయము. పరమేశ్వరా ! జయము, జయము. మధుసూదనా ! జయము. హరిహరులారా ! నమో నమః.

శివవిష్ణువులు : ఓహో ! బృహస్పతీ ! ఇంద్రాది దేవతలారా ! అభయము. అభయము. రండు. రండు.

బృహ : నిఖిలలోకాధినాథులారా ! మహిషాసురుడు సర్వసైన్యములతో దండెత్తి స్వర్గమును జయించి పరిపాలించుచున్నాడు. దేవాదిదేవులారా ! రణమున నోడి పరాభవ మంది పౌలోమిని గోలుపోయి మీ యుభయుల పాదపద్మముల నాశ్రయించి యభయహస్తమును గోరుచున్న యింద్రు డీతడు !

ఇంద్రు : హరిహరులారా ! రక్షింపుడు. రక్షింపుడు. నన్నా దురాత్ముడెన్నిపాట్లు పెట్టినాడో యా దైవమునకే యెఱుక. మహాత్ములారా ! ఎన్ని జన్మములకైనను నాకే క్రిమికీటకజన్మ మిచ్చినను బాధ లేదు కాని యీయింద్రపదముమాత్రము వలదు. రక్షింపుడు. రక్షింపుడు. (హరిహరుల పాదముల మ్రోలబడును)

శివు : ఇంద్రా ! అధైర్యపడకుము.

విష్ణు : త్రిదివాధిపా ! దుఃఖింపకుము. దుఃఖింపకుము.

బృహ : హరిహరులారా ! ఆ దుష్టరాక్షసుడు తేజమున సూర్యుడై, కాంతిని జంద్రుడై, ప్రతాపమున నగ్నియునై ముల్లోకముల సంహరింప విజృంభించుచున్నాడు.

దే: తలు : మహాదేవులారా ! మాపడ్డపాట్లేమని విన్నవింతుము ? మామాట లెక్క యేల? ఆ రాక్షసాధిపతి యముని దీనుని జేసి, వరుణుని బాధించి, వాయుదేవుని భీషించి, కుబేరు నవమానించి, ఈశాను నేడ్పించి, సిద్ధసాధ్యగంధర్వులను బానిసలుగను, విద్యాధరాదుల బంటులుగను పనులుగొనుచు గర్వించి యున్నాడు.

ఇంద్రు : దేవాదిదేవులారా ! ఇక వేయునేల ! ఆ మహిషాసురుని బాధలవలన స్వర్గవాసు లెల్లరును గాందిశీకులై పోయిరి. త్రిదివ మంతయు రాక్షసమయమైనది. ఇక మీరే యుపేక్షించినచో మా మానప్రాణములు మాకు దక్కవు. మీపాదముల శరణు చొచ్చితిమి. వెంటనే దైత్యనాశనమున కుపాయ మూహించి మమ్ము రక్షింపుడు.

శివు : దేవతలారా ! ఇక ఆ మహిషాసురుని దినములు దగ్గఱకు వచ్చినవి. మన తేజోంశములచే దేవి

మూర్తి నవతరింప జేయుదము. నేనును, విష్ణుమూర్తియు మామా ప్రధాన తేజోంశముల విడిచెదము. మీ రెల్లరును మీమీ తేజోంశముల బ్రజ్వరిల్ల జేయుడు.

విష్ణు: అట్లే. (ధ్యానించి మహాతేజస్వియై మహాతేజము ప్రజ్వరిల్ల జేయును.)

శివు: (మహాకోపముతో విజృంభించి తేజోంశ ప్రజ్వరిల్ల జేయును.)

దేవతలు: (ధ్యానించి తమతమ తేజోంశముల నిర్గమింపజేయుదురు.)

బృహ: ఓహోహో! ఏమిది! ఈ మహాపురుషుల తేజోంశములచే దేవీమూర్తి యవతరించుచున్నదే! ఆశ్చర్య మాశ్చర్యము. అదిగో! రుద్రతేజమున ముఖము, యమతేజమున కేశజాలము, విష్ణుతేజమున భుజములు, చంద్రతేజమున కుచములు, ఇంద్రతేజమున నడుము, వరుణతేజమున జంఘలు, భూమితేజమున జఘనము, విరించితేజమున చరణములు, సూర్యతేజమున పాదాంగుళులు, వసుతేజమున కరాంగుళులు—ఇట్లే యితరదేవతల తేజోంశముల నితరావయవములు కలుగ నిదే దేవి యవతరించి మహాతేజము విరజిమ్ముచున్నదే!

దేవి: (అవతరించి నిలచును)

అందఱు: జయము. జయము. దేవీ! జయము. జయము.

శివు: మహిషాసురమథనమున కవతరించిన యీదేవి కిదే నా త్రిశూలమునుండి పుట్టించిన త్రిశూలము నిచ్చుచున్నాను. (ఇచ్చును.)

విష్ణు: నే నిదే నా చక్రమునుండి కలిగిన చక్ర మిచ్చుచున్నాను. (ఇచ్చును.)

వరుణుడు: ఇదే నేను శంఖ మిచ్చుచున్నాను. (ఇచ్చును)

అగ్ని: నేను శక్తి నిచ్చుచున్నాను. (ఇచ్చును)

వాయువు: నే నిదే బాణాసనము, బాణములు నిచ్చెదను. (ఇచ్చును.)

ఇంద్రు: నే నిదే వజ్రాయుధ మిచ్చెదను. (ఇచ్చును)

యముడు: నేను కాలదండ మిచ్చుచున్నాను. (ఇచ్చును)

ఇతరులు: మే మిదే మామా యాయుధము లిచ్చుచున్నాము. (ఇచ్చెదరు)

క్షీరసాగరము: (సాకారమై వచ్చి) నేను దేవి కిదే వివిధాభరణములు, తెల్లపద్మము నిచ్చెదను. (ఇచ్చును)

హిమవంతుడు: (ప్రవేశించి) నే నిదే ఈమెకు సింహమును వాహనముగా నిచ్చుచున్నాను. (ఇచ్చును)

కుబేరుడు: నే నిదే మధుపూర్ణపాత్ర మిచ్చెదను. (ఇచ్చును)

శేషుడు: నేనిదే ఫణిహార మిచ్చెదను. (ఇచ్చును)

దేవి: (అన్నియు స్వీకరించి) హా! హా! హా! హా! హా! (సింహనాదము చేయును.)

బృహ: ఏమిది! దేవి సింహనాద మొనరించినంతనే భూమి గిరగిర దిరుగుచున్నది! పాతాళము ఘూర్ణిల్లినది; కులపర్వతములు సంచలించినవి! దిగ్గజములు చాపకట్టుగా గూలినవి! తారకలు రాలిపడినవి! బ్రహ్మాండము విడువక మ్రోగుచున్నది! సప్తసముద్రములు కలగిపోయినవి! ఓహోహో! అద్భుత మద్భుతము!

దేవతలు: దేవీ! జయము! జయము! దేవసంరక్షిణీ! జయము! జయము!

శివు: దేవతలారా! విలంబము వలదు. మీ రందఱీదేవిని బురస్కరించుకొని మీమీ యాయుధములు ధరించి మహిషునిమీది కురవడింపుడు.

విష్ణు: దేవతలారా! తక్షణమే బయలుదేఱుడు. మీకు జయమగుగాక!

ఇంద్రు: త్రిలోకపతులారా! ఇదే మీయాజ్ఞ గైకొని పోయి వచ్చెదము. దేవతలారా! హరిహరులకు దండప్రణామము లాచరించి దేవీపురస్సరముగా యుద్ధమునకు బయలుదేరుదము.

దేవతలు : అట్లే! (అందఱు అట్లొనర్తురు)

దేవి : (సింహనాదము చేయుచు నిష్క్రమించును.)

దేవతలు : (దేవిని అనుసరింతురు.)

## నాలుగవ రంగము

[ప్రవేశము : మహిషాసురుడు, సేనాపతులు రాక్షసులు.]

మహి : రాక్షసవీరులారా! స్వర్గభోగములను మీయిష్టము వచ్చినట్లుగా ననుభవించుచున్నారు గదా!

రాక్ష : మహారాజా! నీదయవలన మాకోరికలన్నియు సిద్ధించినవి. అందఱముకూడ ఇంద్రభోగమే యనుభవించుచున్నాము.

చక్షురాసురుడు : (ప్రవేశించి) మహారాజా! జయము. జయము. రాక్షసేశ్వరా! జయము. జయము.

మహి : ఓహో! చక్షురుడా? ఏమి విశేషము?

చక్షు : దేవా! మనచే నోడిపోయిన దేవతలెల్లగను తిరిగి మహారోషభీషణయైన యొక స్త్రీని ముందిడుకొని సింహనాదములు చేయుచు మనపై దండెత్తి వచ్చినారు. సర్వసైన్యములు నాయత్తపఱచి మనము వెంటనే వారి నెదుర్కొనవలయును.

మహి : ఛీ! ఛీ! సిగ్గులేని యా దేవతలోకము యాడుదానిని ముందిడుకొని వచ్చుచున్నారా? రానిమ్ము. ఈసారి వారి కందఱకు ప్రాయశ్చిత్తము కాగలదు.

చక్షు : దేవా! ఆలస్యము వలదు. అదిగో! రాక్షసుల హాహాకారములు వినవచ్చుటలేదా? వేగిరింపుడు. ప్రభూ! వేగిరింపుడు.

మహి : సేనాపతులారా! వెంటనే సర్వసైన్యములతో దేవసమూహముల నెదుర్కొనుడు. చక్షురా! నీసైన్యముతో ముందు నీ వరుగుము.

చక్షు : చిత్తము. దేవా! (నిష్క్రమించును.)

మహి : మహాహనుడా! నీసైన్యముతో నీవు వానిని ననుసరింపుము.

మహా : చిత్తము, దేవా! (నిష్క్రమించును.)

మహి : ఓయీ! అసిరోమా! ఏబదిలక్షల రథములతో నీవు నడువుము. ఉగ్రదర్శనా! కోటిస్యందనములతో నీవు బయలుదేఱుము. బిడాలా! ఏనూఱుకోట్ల తేరులతో నీవును సిద్ధము కమ్ము. మిగిలిన సేనాపతులెల్లరును మీమీబలములతో బయలుదేఱుడు. నేను నిదే సిద్ధపడుచున్నాను.

సేనాపతులు : చిత్తము, దేవా!

(నిష్క్రమింతురు)

మహి : ఏమిది! ఇంద్రవరుణయమకుబేరాది మహాయోధులే నా ధాటి కాగలేక పాఱిపోయిరికదా! ఇపుడు వారందఱొక్క స్త్రీని ముందిడుకొని యుద్ధమున కేతెంచుటలో నేదేని రహస్య మున్నదా? ఏమైన నేమి! ఈపరి సర్వదేవవినాశము తప్పదు. ఈ పాటికి రాక్షససైన్యములు, దేవసైన్యములు కలియబడి పోరు సాగించుచుండును. నేనును బోయి క్షణమాత్రములో శత్రుమారణ మొనరించెదను.

(నిష్క్రమించును)

## ఐదవ రంగము

[ప్రవేశము : ఇద్దఱు విద్యాధరులు]

మొదటివాడు : మిత్రమా! చిత్రాంగదా! మన మిట నిలచి యిరువురకు గనబడకుండ దేవదానవులకు జరుగుచున్న చిత్రయుద్ధము నరయుదము.

చిత్రా : ఔను. ఇచటనే నిలుచుట మంచిది. అప్రక్క నెందఱో నిలచి కనుగొనుచున్నారు.

మొదటి : అదిగో! మహిషసేనాపతు లెల్లరు తమతమ సేనలతో విజృంభించి దేవితో గలియబడినారు.

చిత్రా : చిత్రము, చిత్రము! దేవియాయుధములు క్షణమాత్రములో వారిని దునుమాడుచున్నవి. చూడు మదిగో! దేవి యింకను విజృంభించుచున్నది.

మొదటి : అదిగో! దేవీవాహనసింహము రాక్షసపాటవిని నాశముచేసి వేయుచున్నది.

చిత్రా : దేవివిజృంభణము గని దేవసైన్యములు జయజయధ్వానములతో మిన్నుముట్టుచున్నవి.

మొదటి : మిత్రమా ! ఆశ్చర్య మాశ్చర్యము ! త్రిశూలవిహారమున దానవుల జీర చీరి, గదాయుద్ధమున వారిని మోదిమోది, ఖడ్గవిద్యావిభవమున రాక్షసకోటిని నఱకి నఱకి, శరాసనకళానిపుణత నామె యొందఱినో కూల్చి వేయుచున్నదికదా !

చిత్రా : ఆహా ! ఏమి యీ రణరంగవైభవము ! దేవి చేయు సింహనాదములకే గుండె లవిసి కూలు వారును, ఆ మెగదాఘాతమున దలలు బ్రద్దలై పడు వారును, ఖడ్గప్రహారమున ఖండఖండములై పడిపోవు వారును—ఈరాక్షసు లిక నేమి చేయగలరు ?

మొదటి : అదిగో ! చక్షురాసురుడు మహా సేనాని—అతడు దేవి నెదుర్కొన్నాడు. అయ్యో ! దేవిని శరవర్షముచే గప్పివేసినాడే !

చిత్రా : చెలికాడా ! భయపడకుము. అదిగో! దేవికలన దనతేరు ముక్కలు కాగా, విల్లు పోడుము కాగా, అతడు శూలముతో దేవిని పొడుచుచున్నాడు.

మొదటి : చిత్రము. చిత్రము. దేవి వానిని ఖడ్గముతో ముక్కముక్కలు చేసివైచినది.

చిత్రా : అయ్యో ! బాష్కలుడు దేవివిల్లు త్రుంచివైచినాడు.

మొదటి : అదిగో ! మఱియొక విల్లు గైకొని యామె యొక్క బాణముతో వానిని గూలనేసినదే !

చిత్రా : మిత్రమా ! ఆమూల నది యేమి ! ఆ కోలాహల మేమి ?

మొదటి : అయ్యో! దేవతలే హాహాకారములతో బరుగులిడుచున్నారే ! ఏమది?

చిత్రా : ఓహో ! తెలిసినది, తెలిసినది. ప్రధాన సేనాపతులతో సైన్యములు నశించుట జూచి మహిషాసురుడు విజృంభించి దేవతలను జెల్లాచెదరు గావించుచున్నాడు.

మొదటి : అదిగో ! దేవిని సమీపించినాడా రాక్షసుడు !

చిత్రా : అయ్యో ! అయ్యో ! ఆ దుర్మార్గుడు మహిషరూపమే పూర్తిగా ధరించి దేవగణములను బహువిధముల హింసించుచున్నాడు.

మొదటి : చూడు. ఆరాక్షసేశుని యౌద్ధత్యము ! భూమ్యాకాశముల నంటుచున్నయాతని మహాకాయమున దారకలు రాలిపడుచున్నవి ! భూమి కదలిపోవుచున్నది. మహాపర్వతము లాతని దేహము దాకి ఛిన్నాభిన్నమగుచున్నవి. అతని వాలుపుచ్ఛమున వనధులు పిండలిసం డగుచున్నవి. అతని నిశ్వాసములచే కుల పర్వతములు చూర్ణములై పోవుచున్నవి ! జగము లల్లాడి పోవుచున్నవి !

చిత్రా : మిత్రమా ! దేవి యాతని సమీపించినది. ఇక భయము లేదు.

మొదటి : ఆశ్చర్య మాశ్చర్యము ! దేవి ఆమహిష రూపమున నున్న దానవుని ఖండింప నాతడు వెంటనే సింహరూపము ధరించి దేవిపై కురుకుచున్నాడు.

చిత్రా : ఏనది. ఆ సింహరూపము దేవిబాణమున జీలిపోగా నరరూపము ధరించినా డా రాక్షసుడు !

మొదటి : చిత్రము. చిత్రము! దేవి యారూపమును జెండాడినది.

చిత్రా : ఏ మేమి! ఆదుర్మార్గుడు మరల గజరూపమున దేవితో బోరుచున్నాడే ! (చూచి) ఆ రూపముకూడ దేవి నశింపజేయగా మరల మహిషాసురుడైనాడే !

మొదటి : అదిగో ! దేవి చిఱునవ్వుతో వాని బాణముల నుపేక్షించి మధుపానము చేయుచున్నది.

చిత్రా : ఆ దుర్మార్గు డిదే సమయ మని దేవిపై మహాపర్వతములు విసరుచున్నాడు. బాణవర్షము కురిపించుచున్నాడు.

మొదటి : ఏమైనను దేవి చలింపకున్నది. అది గదిగో ! దేవి విజృంభించుచున్నది !

చిత్రా : ఆశ్చర్య మాశ్చర్యము ! దేవి ఒక్కయెగు రెగిరి మహిషాసురుని కంఠము పట్టుకొన్నది. కాలిక్రిందకు జేర్చి త్రొక్కివేయుచున్నది !

మొదటి : ఇప్పుడుకూడ మహిషాసురుడు మొగ మెత్తి యింకను పెనగజొచ్చినాడే!

చిత్రా : ఇ కేమున్నది? ఏనది. దేవి వాని శిరము నొక్కుమ్మడి ద్రుంచివేసినది. అదిగో! దేవిపై దేవతలు పుష్పవర్షము జయజయధ్వనులతో గురియించుచున్నారు.

మొదటి : రమ్ము. రమ్ము. మనముకూడ దేవిని జేరి నమస్కరింతము. (నిష్క్రమింతురు)

## ఆఱవ రంగము

[ప్రవేశము : దేవి, ఇంద్రాదిదేవతలు, ఋషులు, గంధర్వులు, బృహస్పతి.]

ఇంద్రు : దేవీ! జయము, జయము! మహిషాసురమర్దనీ! జయము, జయము! దేవసంరక్షిణీ! జయము, జయము!

ఋషులు : దేవీ! సమస్తదేవతాంశలచే జనించి లోకసంరక్షణకై మహిషాసురుని రూపుమాపిన నీ కివే మా నమశ్శతములు. (మ్రొక్కుదురు.)

గంధర్వులు : దేవీ! జయము. దేవీ! జయము. (గానము చేయుదురు)

దేవతాస్త్రీలు : (పుష్పములు దేవిపై జల్లుదురు)

బృహ : దేవీ! త్రిమూర్తులే నీరూపము, బలము నిట్టి దని పేర్కొనలే రన్నచో నే నెట్లు నిన్ను వర్ణింతును? తల్లీ! దయామయివై నీ విట్లే లోకముల సంరక్షింతువుగాక!

ఇంద్రు : దేవీ! నీ రూప మచింత్యము. నీ మహత్త్వము రిపుక్షయకారి. నీ చరిత్ర మద్భుతము. నీ వలననే మేము బ్రదికితిమి.

ఋషులు : జగజ్జననీ! నీవే స్వాహాస్వధానాములు దేవతలను, పితరులను తృప్తి పొందింతువు. మోక్షార్థులగు మహామునులు ని న్నాత్మవిద్య యందురు. సమస్తవేదములకు నీవే నిధివి. తల్లీ! నీవే సర్వశాస్త్రసారమవు. అంబా! హరిభుజాంతరవాసినివైన లక్ష్మివి నీవే. శివుని సామేను గాంచిన పుణ్యాత్మవు నీవే! అమ్మా! జగములకు నీవే కారణమవు. త్రిగుణరూపము, మూలప్రకృతి యన్నియు నీవే! అట్టి నీ కివే మా పునర్నమస్క్రియలు. (నమస్కరింతురు)

బృహ : దుర్గా! ఉత్తమపుణ్యపురుషులయందు లక్ష్మివై, బుధజనులయందు బుద్ధివై, పవిత్రులయందు లజ్జవై, బ్రాహ్మణప్రవరులయందు శాంతివై వెలుగొందు నీ కివే నా వందనసహస్రములు. (మ్రొక్కును)

దేవతలు : దేవప్రాణప్రదాయినీ! కాళికా! నీ సమస్తాయుధములతో మాకు నిత్యము రక్షయొసగుము తల్లీ! నీపవిత్రరూపమును గైసేయనిమ్ము తల్లీ! నీ బిడ్డల మగు మ మ్మెప్పుడును గనికరింపుము.

(చందనము మున్నగు ననులేపములతో, ధూపదీపాదులతో, కుసుమపరంపరతో దేవిని పూజింతురు.)

దేవి : వత్సలారా! మీమీ భక్తిప్రపత్తుల కానందించితిని. మీ కేమి వరము కావలయునో కోరుకొనుడు.

ఇంద్రు : మహేశ్వరీ! భువనకంటకుడైన మహిషాసురుని మర్దించితివి. రాక్షసనర్వనాశన మొనరించితివి. అంతకన్న, దల్లీ, మాకు గావలసిన దేమున్నది? ఐనను, మాచే నీవు సంస్మరింపబడుచు మాయాపద లెల్ల బాపుచుండ బ్రార్థింతుము.

దేవి : అట్లే యగుగాక!

ఇంద్రు : అనుగ్రహించితివి. జననీ! సర్వలోకకంటకు డైన మహిషాసురమరణదిన మగు నేటి దశమితిథి 'విజయదశమి' యన త్రిలోకప్రజలకు మహోత్సవ దిన మగుగాక! ఏటేట నవరాత్రములు ని న్నుపాసించిన ప్రజలకు దశమదివసము సర్వవిజయము నొడగూర్చుగాక! ఈపర్వము త్రిలోకముల నాచంద్రార్కము వెలయుగాక!

దేవి : వత్సా! అట్లే యగుగాక!

బృహ : త్రిలోకజననీ! నీ భూతభవిష్యదవతారముల గురించి యొక్కింత తెలిపి మము ధన్యాత్ముల జేయ బ్రార్థించుచున్నాను.

దేవి : సురగురూ ! నీప్రశ్నమున కుత్తర మిచ్చెదను. సకలదేవగణములారా ! సావధానులరై నా యవతారవివరణము వినుడు.

అందఱు : మహేశ్వరీ ! సావధానులము. ఆనతీయ వేడెదము.

దేవి : వత్సలారా ! తొల్లి మధుకైటభులు కమలాసనుని జంప నుంకింప మహామాయనైన నే నవతరించి ప్రేరించినకారణమున విష్ణువు వారల జంపియుండెను. పిమ్మట శుంభనిశుంభు లను రాక్షసుల జంపుటకై సప్తమాతృకలతో నావిర్భవించి యాపని నెఱవేర్చితిని. ఇక ముందు దుష్టరాక్షసు లగు శుంభనిశుంభులే మరల నుద్భవించినపుడు వారిని జంపుటకు నందగోపకులమున యశోదాగర్భమున జనించి వింధ్యాచలమున వసించుచు నాపని యొనగూర్చుకొని 'వింధ్యవాసిని' అన బరగెదను. మఱియు 'రౌద్ర' నామమున నవతరించి విప్రచిత్తిసంతతిని సమయజేసెద. తరువాత రక్తములగు దంతముల మహారాక్షసుల భక్షింప 'రక్తదంతి' యనునామమున నావిర్భవించెద. ఆపిమ్మట శతవర్షావగ్రహమున మునులు తల్లడమంద 'శతాక్షి' నామమున నేను జనించి శతనేత్రముల మునిగణముల గాపాడుదును. తరువాత, త్రిలోకప్రజలను నాశరీర జనితశాకాహారముల బోషించి 'శాకంభరి' యనుపేర నొప్పారుదును. ఇంకొకమాఱు దుర్గము డను రాక్షసుని జంప 'దుర్గా' నామమున నవతరింతును. మఱి యింకొకమాఱు 'భీమ' నామమున జనించి రాక్షసుల నడచి సంయముల గాపాడుదును. ఇంకొకమాఱు లోకకంటకుడగు భ్రమరాసురుని సంహరింప 'భ్రామరీ' నామమున జనియింతును. ఇంతేకాక, ఏయుగమున నేసమయముల నాసురీసంపత్తి పెచ్చుపెరిగి లోకములకు బాధ కలుగునో అప్పుడప్పుడు తప్పక నే నవతరించుచు దుష్టశిక్షణము, శిష్టరక్షణము చేయుచుందును.

అన్నిటికన్న నా కధికప్రీతికర మైనది మహిషాసురమర్దనము. న న్నాయానామములతో నెవ రెప్పుడు స్మరించి కీర్తించినను వారివారికి సకలకామ్యములు సిద్ధింపజేయుదును. నన్ను నిరసించినవారికి నిరయమే ప్రాప్తింపజేయుదును. ఈ నాచరిత్రము విన్నవారికి, కన్నవారికి సకలశుభములు నొడగూడును. మీ కెల్లరకు శుభ మగుగాక ! నే నిదే పోయి వచ్చెద.

(అంతర్ధాన మగును)

ఇంద్రు : ఆహా ! దేవి యంతర్ధాన మైనదే !

బృహ : ఇంద్రా ! ని న్నీ శుభతరుణమున మరల నింద్రాధిపత్యమున కభిషేకింతును. సర్వశుభములతో నీవు వెలుగొందుదువుగాక ! (అభిషేకించును)

అందఱు : (హర్ష ధ్వను లొనరింతురు.)

ఇంద్రు : గురుదేవా ! నీయనుగ్రహమున సర్వసంపదలను మరల నందితిని.

బృహ : నీకు గావలసినవరము గోరుకొనుము.

ఇంద్రు : దేవా ! ఇంతకన్న గావలసిన దేమి ? ఐనను, గోబ్రాహ్మణులకు శుభపరంపర యగుగాక ! మనకు లభించిన యీ విజయదశమి పర్వము త్రిలోకముల కేటేట బహుపర్వదిన మగుగాక !

(అందఱు నిష్క్రమింతురు.)



# వేములవాడ చాళుక్యులు

(ఆగష్టుసంచికతరువాయి)

శ్రీ నేలటూరి వెంకటరమణయ్య

౬

## బద్దెగ : సోలదగండడు

మొదటి యరికేసరి యెంతవఱకు రాజ్యపరిపాలన మొనర్చెనో తెలియదు. ఇతని తరువాత నతని పెద్దకుమారుఁడగు మొదటి నరసింహదేవుడును, దరువాత నితని పుత్రుఁడగు రెండవ యుద్ధమల్లుడును రాజ్యము జేసిరి. వీరినిగురించి యేమియు దెలియదు; శాసనములందుగాని, విక్రమార్జునవిజయమునందుగాని వీరి విషయము, విశేషములు గానరాకపోవుటవల్ల వీరు సామాన్యులని యెంచవలసియున్నది.

రెండవ యుద్ధమల్లుని యనంతర మతని కుమారుడు బద్దెగడు రాజ్యాభిషిక్తుఁడాయెను. ఇతనికి సోలదగండ డను బిరుదు గలదు. నలుబదిరెండు సంగ్రామములలో నితడు విజయ మందెనట. ఇతనిచే బరాజితులైన శత్రువులలో ముఖ్యుడు భీముడు. ఇతడు శత్రుదుర్జయుడు; 'మొసలెయం పిడిసంతెరె నీరొళొత్తి భీమన నతిగర్వదిం పిడిదొ' అని పంపడును, 'భీమం భీమపరాక్రమైకనిలయం తం హేలయైవాగ్రహీ దుగ్రం గ్రాహ మివాన్తరంబుసమరే దోర్విక్రమా ద్బద్దెగః' అని పర్భణిశాసనగ్రంథకర్తయు బ్రశంసించియుండుటవలన బద్దెగ డతనిని కష్టపడి సాధించె నని చెప్పవలసియున్నది.

ఈ భీము డెవ్వడో గుర్తింపవలసియున్నది. మొదట బద్దెగడు వెలసిన కాలము నిశ్చయముగ దెలిసినగాని భీముని యానవాలుపట్టుటకు సాధ్యము గాదు. బద్దెగని శాసనములు లేవు. అతని కాలమును కచ్చితముగ దెలియజేయు నాధారములును గానరావు. కాని యతని పూర్వీకులయొక్కయు, సంతతివారియొక్కయు వృత్తాంతముల మూలమున నితడు మనిన కాల మిది యని యూహించుట కవకాశము గలదు. ఇతని ముత్తాతయగు మొదటి యరికేసరి నిరుపమదేవ ధ్రువునికి సమకాలికు డని పూర్వప్రకరణమున వ్రాసియున్నాను. మఱియు ధ్రువుడు క్రీ. శ. ౭౮౦ మొదలు ౭౯౩ వఱకును పృథ్వీపరిపాలన మొనర్చియుండుటచేతను, మొదటి యరికేసరి సోదరుడైన వీరగ్రహుడు పై ధ్రువుని కుమారుఁడగు ముమ్మడి గోవిందచక్రవర్తి కనుగుచెలికాఁడగుటచేతను[1] మొదటి యరికేసరి క్రీస్తుశకము ఎనిమిదవ శతాబ్దముయొక్క చతుర్థపాదమునందు, అనగా క్రీ. శ. ౭౭౫-౮౦౦ ల మధ్యకాలమున వర్ధిల్లె నని నిశ్చయింపవచ్చును. బద్దెగ డరికేసరికి నాలవతరమువాఁడగుటచేత చరిత్రపరిశోధకుల యంగీకారమును బొందిన పద్ధతిబడి తరమునకు ౨౫ సంవత్సరములచొప్పున పరిగణించిచూచిన నతడు క్రీ. శ. ౮౫౦ మొదలు ౮౭౫ పర్యంతమును రాజ్యము చేసియుండు నని చెప్పవలసియున్నది. మఱియొకవిధమున లెక్కవేసి చూచినను పై యూహయే సరియైన దని తేలుచున్నది. బద్దెగని మునిమనుమడు ఇమ్మడియరికేసరి. ఇతడు క్రీ. శ. ౯౩౦-౯౩౪ ల మధ్యరాజ్యము పాలించిన నాల్గవ గోవిందరాజునకు సమకాలికుడు. ఇమ్మడి యరికేసరితండ్రియు, బద్దెగని మనుమడును నైన ఇమ్మడి నరసింహుడు క్రీ. శ. ౯౧౪ నుండి ౯౩౦ వఱకును రాష్ట్రకూట సామ్రాజ్యమును పాలించిన ముమ్మడి ఇంద్రవల్లభుని సామంతుడు. కావున నత డించుమించు క్రీ. శ. ౯౦౫

1. కీ. శే. రావుబహదూరు సి. ఆర్. క. చార్లుగారి తెలింగాణశాసనములు. రాష్ట్రకూటగోవిందుని శాసనము. (అముద్రితము)

మొదలు ౯౩౦ వఱకును ప్రభుత్వము సల్పె ననుట యొప్పును. ఇమ్మడి నరసింహుని తండ్రియు, బద్దెగని పుత్రుడును నగు నిమ్మడి యుద్ధమల్లుడు క్రీ. శ. ౮౮౦-౯౦౫ ల మధ్య నుండె నని చెప్పవలసియున్నది. ఈ లెక్కప్రకారము చూచినను బద్దెగని కాలము క్రీ. శ. ౮౫౫ - ౮౮౦ అగుచున్నది. పై రెండు పరిగణనల ప్రకారము బద్దెగని కాలము క్రీ. శ. ౯ వ శతాబ్ది తృతీయపాదమని తేలుచున్నను నతడు కొంచెమించుమించుగ నీ శతాబ్దాంతమువఱకును జీవించియుండె నని తలచుట కవకాశము గలదు. క్రీ. శ. ౮౪౮ నుండి ౮౯౨ దాక వేంగిని పాలించిన పూర్వచాళుక్యగుణగ విజయాదిత్యు డొక బద్దెగని కభయ మిచ్చి రక్షించెనని పూర్వచాళుక్యశాసనములవలన దెలియవచ్చుచున్నది.

"అబ్ధా త్సంగ్రామరంగే నిఖిలసదసితా
మంగిరాజోత్తమాంగం
తుంగాద్రేః శృంగ ముర్వ్యా మశనిరివ ముదా
పాతయ త్కన్నరాజ్యమ్,
నిశ్శంకం సంకిలేన ప్రథితజనపదా
ద్దుర్గమా న్నిర్గమయ్య
ద్రాఘావం యః ప్రవేశ్యః ప్రభు రభయమనాః
ప్రత్యప ద్బద్దెగాఖ్యమ్ 1-a."

ఈ శ్లోకమునందు పేర్కొనబడిన బద్దెగడు సోలదగండబద్దెగడే యని గవర్నమెంటు శాసనపరిశోధకశాఖవారు తీర్మానించియున్నారు 2. ఈ వ్యక్తినిర్ణయము సరియైనదే యని చరిత్రపరిశోధకు లంగీకరించియున్నారు. పై జెప్పినరీతిని గుణగవిజయాదిత్యునిచే సోలదగండ డభయప్రదానమును బడసియుండినచో నతడు క్రీ. శ. ౮౮౮ తరువాతగూడ కొంతకాలము జీవించియుండె నని చెప్పవలసియున్నది; ఏలనగా, పై నుదాహరింపబడిన శ్లోకము గుణగునిచే బద్దెగడు పరాజయము నందినది గుణగుని రాజ్యకాలము నందలి చరమదశయందని సూచించుచున్నది. అందు మంగి మొదలగువారిపై విజయములు పూర్వాపరములను దప్పనీయక కాలక్రమము ననుసరించి వర్ణింపబడినవి. మొదట గుణగుడు మంగి నోడించెను; పిమ్మట కన్నరసంకిలులను; తరువాత బద్దెగని. వీరిలో మంగి నోలంబాధిపతి; కన్నరుడు రాష్ట్రకూటచక్రవర్తి; కృష్ణవల్లభు డను నది ఇతని సరియైన పేరు. రాష్ట్రకూటచక్రవర్తులందరి పేరింటివారిలో నితడు రెండవవా డగుటచే నితనిని చరిత్రకారు లిమ్మడి కృష్ణవల్లభు డందురు. సంకిలి హైహయవంశజు డగు చేదిరాజు; ఇమ్మడి కృష్ణవల్లభుని బావమఱది; పూర్వచాళుక్యులతోడి పోరాటమున ఇమ్మడి కృష్ణవల్లభునకు కుడిభుజము. బద్దెగడు రాష్ట్రకూటచక్రవర్తుల కాశ్రితుడగు సామంతుడగుటచే నతని పోరాటమియు కన్నర గుణగవిజయాదిత్యుల యుద్ధసందర్భముననే కలిగె నని తలచుట యొప్పు. ఇమ్మడి కృష్ణవల్లభుడు తన తండ్రియగు ప్రథమామోఘవర్షచక్రవర్తి మరణానంతరము క్రీ. శ. ౮౮౦ లో గద్దెనెక్కెను. తత్పూర్వ మతనికి గుణగవిజయాదిత్యునితో ఘర్షణ గలిగె నని తలచుటకు దగిన సాక్ష్య మెద్దియు లేదు. గుణగవిజయాదిత్యుడు క్రీ. శ. ౮౯౨ లో మృతినందియుండుటచేత కన్నరసంకిలిబద్దెగులపై నతని విజయములు తత్పూర్వమే సంప్రాప్తములై యుండవలయును. అనగా పై విజయములు క్రీ. శ. ౮౮౦-౮౯౨ లమధ్య గలిగినవని తేలుచున్నది. కావున బద్దెగడు ౮౮౦-౮౯౨ల మధ్య తన నుంగలము నేలుచుండె నని చెప్పవలసియున్నది.

అప్పటి రాజులలో భీమనామధేయు డొక్కడే కానవచ్చుచున్నాడు. అతడు వేంగిరాజ్యాధిపతియైన ప్రథమచాళుక్యభీముడు. ఇతడు క్రీ. శ. ౮౯౨ లో దన పెదతండ్రియైన గుణగవిజయాదిత్యు డస్తంగతుడైనపిమ్మట వేంగిసింహాసనము నధిష్ఠించెను. ఇతడు బద్దెగనిచే బట్టువడియుండిన నది యతడు రాజ్యాధిపత్యమును వహించిన తరువాతనై యుండవలయును. ఈ యూహ సమంజసమేని బద్దెగడు క్రీ. శ. ౮౯౨ వ సంవత్సరమునకు తరువాతగూడ కొంతకాలము జీవించియుండె నని యొప్పుకొనకతప్పదు.

---

1-a. Cp. no. 26 of 1937-38, JAHRS. XI. P. 80 F.

2. ARE 1918, part II, para 5

బద్దెగనికి ప్రథమచాళుక్యభీమునితో కలహము పొసగుటకు ముఖ్యకారణములు రెండు కానవచ్చుచున్నవి. అతడు రాష్ట్రకూటుల కాశ్రితుడైన మాండలిక ప్రభువని పైన నుడివియున్నాడను. రాష్ట్రకూటులకును, పూర్వచాళుక్యులకును తరతరములనుండియు పెరిగి వచ్చుచుండిన పగవలన గలుగుచుండిన యుద్ధములలో బద్దెగనికోవవారు రెండు రాజ్యముల నడిమి గడిభూముల కధిపతులై యుండిన కారణమువలన రాష్ట్రకూటచక్రవర్తుల పక్షమున పూర్వచాళుక్యులతో పోరాడవలసి వచ్చెను.

రాష్ట్రకూట ఇమ్మడి కృష్ణవల్లభుడు తన పూర్వుల పద్ధతి ననుసరించి పూర్వచాళుక్య రాజ్యముపై దండయాత్రలు సలుప నారంభించెను. కాని ఇతనికి విజయ మెప్పుడును చేకూర లేదు. మొదట గుణగవిజయాదిత్యునిచే సంపూర్ణపరాభవము నందెను. ఈ సందర్భముననే బద్దెగడు పరాజయ మందినదికూడ. గుణగుని మరణానంతరము తన యభీష్టము నెఱవేర్చుకొనదలంచి కృష్ణవల్లభుడు మరల వేంగిపై దండయాత్రల నారంభించెను. ఏలిన ప్రభువువెంట తన సేనతోగూడ బద్దెగడును నడవవలసినవాడాయె. మఱియు పూర్వచాళుక్యులపై తన తొంటి పగను దీర్చుకొనవలయు నను కోర్కె యొకటి యతని పురికొల్పియుండవచ్చును.

బద్దెగడు ప్రథమచాళుక్యభీము నెప్పుడె చ్చుట్టుకొనెనో నిశ్చయముగ జెప్పుటకు వీలులేదు. కాని, లభించిన శాసనాదిసాక్ష్యమునుబట్టి దీని నూహించి కనుగొనుటకు కొంత యవకాశము గలదు. 'ముసలియం పిడివంతొరె నీరొళ్ ఒత్తి భీమన సతిగర్వదం పిడియో, భీమం భీమపరాక్రమైకనిలయం తం హేలయా వాగ్రహీ దుగ్రం గ్రాహ మివాంతరంబుసమరే'యను విక్రమార్జున విజయ పద్యశాసనవాక్యములు భీముడు బద్దెగనిచే బట్టుపడినది యొక జలయుద్ధమున నని సూచించుచున్నవి. జలయుద్ధ మనగా నీటిమీద చేయు యుద్ధము. ఇట్టియుద్ధము సముద్రముమీద నావికాదళముల మూలమున జరుగుట సామాన్యము. కాని రాష్ట్రకూటరాజులకు గాని, పూర్వచాళుక్యప్రభువులకుగాని నావికాదళము లుండినట్లుకాని, వారు తన్మూలమున సముద్రముపై యుద్ధ మెప్పుడైన చేసినట్లుకాని తెలుపు సాక్ష్యము గానరాదు. నావలపై నిలచి నదులమీద చేయు యుద్ధమును, జలమయప్రదేశాంతర్గతదుర్గములపై జేయు యుద్ధమును జలయుద్ధ మనబడును. బద్దెగడు భీముని బట్టుకొనిన దిట్టిదంటి యుద్ధముననే యై యుండవలయును. ఇమ్మడి కృష్ణవల్లభ ప్రథమచాళుక్యభీముల మధ్య నడచిన యుద్ధములలో పై జెప్పినట్టి నీటిపోరాట మెచటనేని జరిగియుండుట కవకాశము గలదేమో మాతము.

మనకు నేటివఱ కుపలబ్ధమైన శాసనసామగ్రిని బట్టి చూడగా నిమ్మడికృష్ణవల్లభుడు ప్రథమచాళుక్యభీముని రాజ్యకాలమున వేంగిపై రెండు పర్యాయములు దండెత్తి వచ్చిన ట్లున్నది. మొదటి దండయాత్ర ముదిగొండచాళుక్యప్రభువగు కుసుమాయుధుని యనుచరుడగు నల్లమెఱయకొడుకు వ్రాయించిన కొఱవిశిలాశాసనమున వర్ణింపబడియున్నది.

"శ్రీవిక్రమాదిత్యనృపాగ్రతనయుండయ్యు చాలుక్యభీమునకు శౌచకర్దప్పణనకు వేంగీశ్వరునకు గనమద్దాన్వయకులతిలకుండయ్యు కుసుమాయుధుండా గన్నరబల్లహుని కస్త్రప్రాప్తంబయ్యు రనమర్దనకసీ(?)మ దన భుజబలపరాక్రమంబున దెచ్చి కణియం గట్టి పట్టంబుగట్టి ఖడ్గసహాయుండై నేల యెల్లం గావంబూని మంచి కొణ్డనాణ్డాదిగ వేంగిదేసము విష్ణువర్ధనుతో నర్ధరాజ్యంబు సేయుచున్న కుసుమాయుధు..."3.

ఈ దండయాత్ర ప్రథమచాళుక్యభీముని పట్టబంధమునకు ముందు నడచినది. గుణగవిజయాదిత్యుడు కాలగతి నందెనను వార్త చెవి సోకినంతటనె కృష్ణవల్లభుడు వేంగిపై నెత్తివచ్చిన ట్లున్నది. "కన్నరబల్లహుని కస్త్రప్రాప్తంబయ్యు రణమర్దనకసీమ"యని యుండుటచే వేంగిరాజ్యమందలి యుత్తరభాగము లతనికి స్వాధీనపడనట్లు తోచుచున్నది. రణమర్దకసీమ కృష్ణా

3. తెలిం. శాస. ఇతర. సం. ౧౨. కీ. శే. రావుబహదూరు సి. ఆర్. కె. చార్లుగారు ప్రతిబింబానుసారము సవరించిన శాసనగ్రంథమునుండి సంగ్రహింపబడినది.

జిల్లాలోని కొండపల్లినుంచి హైదరాబాదురాజ్యములోని వరంగలుమండలాంతర్గతమైన కొలనిపర్యంతము వ్యాపించియుండినది. మంచికొండనాడు దీనికి జెందినదే. ఈ రణమర్దకసీమయందు నావికాయుద్ధమును సేయుటకనుకూలమైన నదులుగాని, జలదుర్గములుగాని లేవు. కావున బద్దెగడు ప్రథమచాళుక్యభీముని బట్టుకొనిన 'యంబుసమర' మీదండయాత్రయందు నడచెనని చెప్పుటకు వలనుపడదు.

రెండవ దండయాత్ర:—మఱియొక పర్యాయము కృష్ణవల్లభుడు వేంగిపై నెత్తివచ్చినట్లు ప్రథమచాళుక్యభీముని మసులిపట్టణతామ్రపట్టికలవలన దెలియవచ్చుచున్నది. 4 రాష్ట్రకూటసైన్యములేకాక కర్ణాటలాటాది మిత్రబలముగూడ వేంగిని ధ్వంసము సేయ వచ్చినవి. వీని కధిపతి గుండ దండనాయకుడు. శత్రువులు రాజ్యమును జొచ్చి వేంగీపురప్రాంతమునకు వచ్చిరి. ఈ దండయాత్రయందు చాళుక్యభీముడును, నతని పుత్రుడైన ఇఱమర్తిగండడును శత్రులను మార్కొని హోరాహోరిగ బోరిరి.

"యస్స్వోప్వాసప్రముక్తై రిషుభి రభిహాత
ప్రష్టపృష్ఠస్యధావన్
కర్ణాటాదుర్ధరాటాగుటితపటునట
స్ఫోటకా లాటకాళ్చ."

అని చాళుక్యభీముడు తన ప్రతాపాతిశయమును సుగ్గడించుకొనినను, రాష్ట్రకూటు లంత సులభముగ విడిచిపోలేదు. రాష్ట్రసంరక్షణభారమంతయు నిఱమర్తిగండని భుజములపై బడినది. ఓడిపోయినను రాష్ట్రకూటబలములు తరతరముగ మార్కొనగడగినవి. సందడి కయ్యములు పెక్కు నడచినవి. చూడుడు, మచిలీపట్టణతామ్రశాసన మెట్లీ పోరాటమును వర్ణించుచున్నదో.

"మమ ప్రియాత్మజో షోడశవార్షికః, యస్తు
* * * *
నిరవద్యపురరణే కరితురగఘన
దుర్ధరోగ్రవల్లభదణ్డమ్
అరుహ్య గజపతిమ్మృగపతిరివ
హరిణా న్వికీర్య్య విహసన్నఘసత్॥
పెరువంగూరుగ్రామరణే
వల్లభదణ్డేన గుణ్డయాఖ్యం హత్వా
నిర్గ్లోట్యచ దాయాదా
నవని మశేషా న్నిరాకులా మ్మహ్యా మదాత్॥
సత్వాఽర్థిభ్యో ధనం కామ
మ్మహ్యాద్గత్రీం భయం ద్విసామ్,
నిత్యప్య నిత్య సత్కీర్తి
న్నాకలోక మగా దసౌ॥
కటాక్షేణాపి నాపశ్య ద్వేశ్చ పరయోషితః
అసు శీక్ష్ణయా నానం విరంసు రమరాంగనాః॥
తస్య దీనానాథబన్ధో ఋణ సుఙత్సలస్య
ఇతిమర్తిగణ్డాపరనామ్నః శ్రుభిథామ్నః పారలౌకికం కార్యం కృత్వా..."

పై నుదాహృతశాసనశ్లోకములందు నిరవద్యపురపెరువంగూరుగ్రామము లన రణక్షేత్రములు రెండు పేర్కొనబడియున్నవి. ఇందు మొదటిదానియందు కరితురగఘనుర్ధరసహితమైన వల్లభదళములను మృగరాజు హరిణసమూహమును బోలి చెల్లాచెదరు గావించెనట. రెండవదానియందు లాటులను దాయాదులను వల్లభదండముతోగూడ ధ్వంసముగావించి, వల్లభ దండాధిపుడైన గుండనను వధించి, నిరాకులమైన రాజ్యమును దన తండ్రి కిచ్చెను; కాని యత డాయుద్ధమునందే నిహతుడై వీరస్వర్గము నలంకరించెనట. ఇచట మొదట గమనింపదగిన దీయుద్ధములు జరిగిన దేశము. నిరవద్యపురము ఇప్పటి నిడదవోలునకు ప్రాచీననామము. ఇది యిప్పటి పశ్చిమగోదావరిమండలమునందలి యేలూరునకు బూర్వోత్తరదిగ్భాగమున రమారమి యేబదిమైళ్ల దూరమున మద్రాసుకలకత్తాయినుపదారిపై నున్నది. పెరువంగూ రెచట నుండెనో చెప్పుటకు వీలులేదు. అదియు బశ్చిమగోదావరీమండలాంతర్గత గ్రామమే. రెండు రణక్షేత్రములును కృష్ణాగోదావరీ నదుల డెల్టాల మధ్యప్రదేశమునం దనగా వేంగిరాష్ట్ర గర్భమున నున్నవి. రాష్ట్రకూటసైన్యములు వేంగిగడి

4. Cp 1 of 1913-14.

ప్రదేశములను దాటి రాష్ట్రమధ్యమునకు జొచ్చుకొని వచ్చినవి.

ఈ దండయాత్రయం దెచ్చుటనైన 'అంబుసమరము' జరుగుట కవకాశ ముండదేమో మాతము. పూర్వచాళుక్యుల ప్రధాననగరము వేంగి. అది యిప్పటి యేలూరున కేడెనిమిదిమైళ్ల దూరమున నుండెను. యుద్ధదృష్టి జూచిన నిది యంతటి బలిష్ఠమైన స్థలము గాదు; కాని దండయాత్రాదిఆపత్సమయములయందు వేంగి నేలు రాజులు దమ రాజధానిని వదలి సమీపమున నుండు కొల్లేరుసరస్సుమధ్యమందు జలదుర్గమున తలదాచుకొనెడివారు. కొల్లేటిదుర్గమును సాధింపజాలని శత్రువు వేంగిరాజ్యమును లొంగదీయ సమర్థుడుకాడు; ఈకారణమువలననే సముద్రగుప్తపులకేశ్యాదిరాజులకు పూర్వకాలమందు కొల్లేటియం దంబుసమర మవశ్యము కర్తవ్యమాయెను. అట్లే యిమ్మడి కృష్ణవల్లభుని దండయాత్రయందును నడచియుండును. వేంగికి సమీపమునకు ప్రబలమైన రాష్ట్రకూటసైన్య మెత్తివచ్చినప్పుడు ప్రథమచాళుక్యభీము డాత్మరక్షణకు కొల్లేటిదుర్గమునకు బోవుట సహజము. ఈదుర్గమునుముట్టడించి స్వాధీనపరచుకొనుట కిమ్మడి కృష్ణభూపాలుడు ప్రయత్నము సల్పుటయు సహజమే. కావున బద్దెగుడు మొసలిని నీటియందు పట్టిన స్థలంబుసంగరమున బట్టిన దీ దండయాత్రా సందర్భమున కొల్లేటికోటయం దైయుండవలయును.

## ౮

## ఇమ్మడి నరసింహుడు

సోలదగండబద్దెగని యనంతర మతని కుమారు డిమ్మడి యుద్ధమల్లుడు ప్రభుత్వమునకు వచ్చెను. ఇత డంతటి విఖ్యాతుడు గాడు. ఇతని చరిత్రనుగూర్చి చెప్పదగిన విశేషాంశము లెవ్వియు లేవు.

ఇమ్మడి యుద్ధమల్లుని పిమ్మట నతని పుత్రు డిమ్మడి నరసింహుడు మండలాధిపత్యమును వహించెను. ఇతడు సుప్రసిద్ధవీరుడు. ఇతని పరాక్రమకృత్యములు పెక్కు విక్రమార్జునవిజయమందును, వేములవాడశిలాశాసనమునను వర్ణింపబడియున్నవి. ఈ రెండు ఆధారగ్రంథములయందును జెప్పియుండు నంశములను క్రోడీకరించి చూచిన నితని ముఖ్యకార్యముల నత్యంతసంగ్రహముగ నిట్లు పేర్కొనవచ్చును: (౧) లాటులను జయించెను; (౨) సప్తమాళవములను దగ్ధము గావించి వాని ప్రభువుల నోడించి వారియొద్ద కప్పము గొనెను; (౩) గూర్జరపతియగు మహీపాలు నోడించి తఱిమి గొట్టి గూర్జరరాజ్యమును జయించెను; (౪) గంగాతీరమున గూర్జరరాజు నోడించి తన గుఱ్ఱములను గంగాజలముల గానమాడించి కాళప్రియమున దన యసిలతను, శిలాశాసనములతోడి విజయస్తంభమును స్థాపించెను.

విక్రమార్జునవిజయమునందును, వేములవాడశాసనమందును ఇమ్మడి నరసింహుడు పైపేర్కొనిన శత్రులతోడ నేకాకియై పోరి జయమును బొంది వారికడ కప్పము గొనినట్లు కలదు. ఇదియంతయు సత్యము గాదు. ఇమ్మడి నరసింహుడు స్వతంత్రుడైన రాజు కాడు. రాష్ట్రకూటచక్రవర్తి కాశ్రితుడైన మాండలిక ప్రభువు. సుప్రసిద్ధకర్ణాటకవిత్రయపరిశోధకులగు శ్రీయుత్. గోవిందపాయిగారు విక్రమార్జునవిజయము ప్ర. ఆ. లోని యిమ్మడి యరికేసరిప్రశంసయందలి-

"దంద్రాం సాధపరీతము
హీంద్రదరగానిన్నరీనరేంద్రం సాక్షి
దింద్రం తెసనె సరెనగ
ర్ద్రేంద్రేంద్రన తోళె తొట్టిలాగిరె బళెదం"[1]

అను కందపద్యము నాధారముజేసికొని యిమ్మడి యరికేసరి రాష్ట్రకూటచక్రవర్తి ముమ్మడి యింద్రవల్లభునికి మేనల్లు డని వ్రాసియున్నారు. ఈ యభిప్రాయమును దృఢపఱచుటకు దగిన యాధార మింకను లభ్యపడలేదు. కాని యది కేవల మసంగత మని త్రోసిపుచ్చుటకు వీలులేదు. ఏలనగా, 'నింద్రేంద్రన తోళె తొట్టిలాగిరె బళెదం' అను వాక్యమువలన నింద్రు డరికేసరి నెత్తి పెంచినా డని తెల్లమగుచున్నది. మఱియు-

"దేవీం రేవకనిర్మ్మడి క్షితిపతే
రింద్రస్య పుత్రీ న్నుతాం
పౌలోమీ మివ వాసవ శ్రియ మివ
శ్రీమన్నరఘ్వంసకః

1. విక్ర. అ. ౧: ౪౪.

స్త్రీరత్నం పరిణీయ యేన నితరం
తస్యా స్సపత్నీకృతా
నూనాం సప్తసముద్రముద్రితమహీ
మ్మన్నోన్న తే నాగనా". 2

అను, వేములవాడశాసనశ్లోకమువలన నింద్రవల్లభుడితనికి దన కుమారితెయగు రేవకనిమ్మడిదేవి నిచ్చి వివాహముగావించెనని తెలియుచున్నది. మఱియు పర్భణి తామ్రశాసనమందలి—

"రాష్ట్రకూటకులేఖ్యాతే జాతా లోకాంబికా సతీ
శీరశ్రీ రివ శీరస్య్యాతస్యాసీ త్సుదతీ ప్రియా." 3

అను శ్లోకము ఇతనికి రాష్ట్రకూటుల యాడపడుచు లోకాంబిక యను మఱియొక భార్య యుండెనని తెల్పుచున్నది. పై శాసనశ్లోకములు గోవిందరాయుగారి యుక్తిప్రాయమునకు దోహదమిచ్చుచున్నవి. ఇది సత్యమేని యిమ్మడియరికేసరితల్లియు, నిమ్మడి నరసింహుని భార్యయు నగు జాకవ్వ రాష్ట్రకూట చక్రవర్తి యిమ్మడి యింద్రవల్లభుని సోదరి యగుచున్నది.

మఱియు నిమ్మడి నరసింహుని యుద్ధములన్నియు నతడు దన బావమఱదియు, ప్రభువు నైన యిమ్మడి యింద్రవల్లభుని పక్షమున నతని శత్రులతో జేసినవేకాని, స్వతంత్రముగ దనకొఱకు జేసినవి కావు. ఇమ్మడి నరసింహకృతములని పై జెప్పబడిన సాహసకార్యముల నెక్కింటిని ముమ్మడి యింద్రరాజు చేసినట్లు నాల్గవ గోవిందరాజు క్యాంబేపట్టికలందు చెప్పియున్నది.

"యన్మాద్యద్ద్విపదన్తఘాతవిషమం
కాలప్రియప్రాఙ్గణమ్
తీర్ణా యత్తురగై రగాధయమునా
సిన్ధుప్రతిస్పర్ధినీ,
యేనేదం,హి మహోదయారినగరం
నిర్మూల మున్మీలితం
నామ్నా ఽద్యాపి జనైః కుశస్థల మితి
ఖ్యాతిం పరాం నీయతే"4

ఇందువలన ముమ్మడి ఇంద్రవల్లభుని మహోదయవిధ్వంసమును, నిమ్మడి నరసింహుని గూర్జరాది విజయములును నొక్క దండయాత్రకు సంబంధించినవే యని తెలియుచున్నది 5. ఈ దండయాత్రయందలి యంశముల నింతవఱకెవ్వరును విపులముగ జర్చించి యుండలేదు. ఈ కారణమువలన విషయము నిచట

---

2. తెలింగాణాశాసనములు : ఇతర.

3. జైన సాహిత్య ఔర్ ఇతిహాస్.

4. ఎ. ఇండి. సం. ౭, పుం. ౬, శ్లో. ౧౯.

5. క్యాంబేపట్టిక ననుసరించి ముమ్మడి యింద్రవల్లభుడు—

౧. కాలప్రియప్రాఙ్గణమును దన యుద్ధపుటేనుగుల దంతఘాతములతో విషమము గావించెను.

౨. యమునను దాటెను.

౩. శత్రునగరమైన మహోదయమును ధ్వంసము జేసెను.

విక్రమార్జునవిజయప్రకార మిమ్మడి నరసింహుడు

౧. లాటులను జయించెను.

౨. ఏడు మాళవములను జయించి మాళవరాజుల కప్పము గొనెను.

౩. గూర్జర రాజు నోడించి యతని యేనుగుల బట్టుకొనెను. గూర్జరరాజు మహీపాలుడు పాఱిపోయెను.

౪. గంగాజలముల దన తురంగముల దానమాడించె. కాళప్రియమున దన యసిలతను స్థాపించెను.

వేములవాడశిలాశాసనమునబడి యిమ్మడి నరసింహుడు—

౧. ఏడు మాళవములను జయించి యచటి రాజులచే గప్పము గొనెను.

౨. ఎదురు వచ్చిన గూర్జరరాజసేనను నిర్జించి కాళప్రియమునందు దన శౌర్యమును బ్రకటించు శిలాశాసనమును నిలిపెను.

క్యాంబేపట్టికలకును, విక్రమార్జునవిజయ వేములవాడశిలాశాసనములకును కాళప్రియకదనము సామాన్యము. క్యాంబేపట్టికలలో నింద్రుడు యమునను దాటిపోయి శత్రునగరమైన మహోదయమును ధ్వంసము జేసినట్లున్నది. మహోదయ మే శత్రుని పట్టణమో

ఇంచుక విస్తరించి వ్రాయుట యుచితమని తోచుచున్నది.

ఈ దండయాత్రకు ప్రధానకారణము రాష్ట్రకూటగూర్జరప్రతీహారులకు దరతరములుగ జెరిగివచ్చుచుండు వైరమే. గూర్జరప్రతీహారులు మొదట దక్షిణ రాజపుత్రస్థానమునం దుండిరి; క్రీ. శ. ౭-వ శతాబ్ద పూర్వార్థమున ప్రథమనాగభటుని కాలమున వీరు మాళవమును జయించి యచట పాదుకొనిరి. మాల ఖేడురాష్ట్రకూటసామ్రాజ్యస్థాపకుడగు దంతిదుర్గుడు, దేవరాజనునతడు సహాయము చేయగా మాళవముపై నెత్తి పోయి నాగభటు నోడించి గూర్జరప్రతీహారులను దన కరిగాపులుగ జేసికొనె నని పూర్వప్రకరణమున వ్రాసియున్నాడను. ఇదియే రాష్ట్రకూట ప్రతీహారరాజుల దీర్ఘ ద్వంద్వయుద్ధమున కంకురార్పణ.

దంతిదుర్గుని మరణానంతరము రాష్ట్రకూట సామ్రాజ్యమున నొక గొప్ప విప్లవము జరిగినది. చాళుక్యులు మరల విజృంభించిరి. వీరి నాయకుడగు రాహప్ప గతించిన చాళుక్యుల యధికారమును పునరుద్ధరించుటకై తన యావచ్ఛక్తిని వినియోగించి పోరాడదొడగెను. దంతిదుర్గునికి సంతు లేదు. కావున నతని వెనుక రాజ్యాభిషిక్తుడైన యతని పినతండ్రి మొదటి యకాలవర్ష కృష్ణవల్లభుడు తన యాధిపత్యమును నిలుపుకొనుటకై యేడెనిమి దేండ్లు రాహప్పతో హోరాహోరిగ యుద్ధము సేయవలసివచ్చెను[6]. ఈ యుద్ధమున నితడు నిమగ్నుడైయుండగా దంతిదుర్గునిచే జయింపబడిన యుత్తరదేశపు రాజులు రాష్ట్రకూటులను నిరాకరించి స్వతంత్రులైరి. కాని యతడు రాష్ట్రకూటుల యధికారము నుత్తరాపథమున నెలకొలుప మరల ప్రయత్నము సేయలేదు.

ప్రథమాకాలవర్ష కృష్ణవల్లభుని యనంతర మతని పుత్రుడు సువర్ణవర్ష ఇమ్మడిగోవిందవల్లభుడు రాజ్యాభిషిక్తుడాయెను. ఇతడు గంగాయమునల మధ్య రాష్ట్రమును పరిపాలించుచుండిన ఇంద్రాయుధను రాజును నిర్జించినట్లు రామేశ్వరశిలాస్తంభశాసనములోని—

"తస్మాద్దధూ త్సాను రుదారకీర్తిః
ప్రభూతవర్షో భువ మాససాద;

యందు చెప్పియుండలేదు; కాని యా కాలమున మహోదయము గూర్జరప్రతీహారులకు రాజధాని యగుటచేత నింద్రుని శత్రువు గూర్జరప్రతీహారరాజని నిశ్చయముగ జెప్పవచ్చును. వేములవాడశాసనమున నిమ్మడి నరసింహుని ప్రతిఘటించుటకు గూర్జరరాజు సైన్యసమేతుడై వచ్చి కాళప్రియముకడ యుద్ధమున పారిపోయినట్లు చెప్పియున్నది. ఇతడు మహోదయాధిపతి గాని యన్యుడు గాడు; ఇట్లు నరసింహునిచే యుద్ధమున నోడి పరారియైన గూర్జరరాజు పేరు మహీపాలు డని విక్రమార్జునవిజయమువలన దెలియుచున్నది. కావున క్యాంబేవేములవాడశాసనములందును, విక్రమార్జునవిజయమునందును వర్ణింపబడిన దండయాత్ర యొక్కటియే యని నిశ్చయించవచ్చును. గూర్జరవిజయమునకు పూర్వము ఇమ్మడి నరసింహుడు సప్తమాళవములను సాధించె నని వేములవాడశాసనమందును, సప్తమాళవములకు పూర్వము లాటదేశమునుగూడ జయించినట్లు విక్రమార్జునవిజయమందును గలదు. లాటసప్తమాళవ ప్రస్తావము క్యాంబేపట్టికలందు గానరాదు. అందుచే వానికి గూర్జరదండయాత్రతో సంబంధము లేదని యెంచగూడదు. అన్నియు గూర్జరదండయాత్రకు సంబంధించినవే. విక్రమార్జునవిజయకర్తయు, వేములవాడ క్యాంబేశాసనరచయితలును పై దండయాత్రను వర్ణించినప్పుడు ఎవ్వరికి ముఖ్యము లని తోచిన యంశములను వా రూదిచెప్పి తక్కినవానిని విడిచిపెట్టిరి. వీని యందు గాన్పించు భేదముల కిదియే కారణము.

6. మొదటి యకాలవర్ష కృష్ణవల్లభుని ప్రథమ శాసనము భోపఖులుదానశాసనము. దీనినే భారత ఇతిహాససంశోధకమండలిపట్టిక లందురు. ఇది క్రీ. శ. ౭౫౮ అక్టోబరు ౭వ తేది పై గ్రామము దానముసేయబడె నని తెల్పుచున్నది. (భార. ఇతి. సం. పత్రిక, సం. ౯, పుట. ౧౬౫) ఇందు రాహప్పనుగురించిన ప్రస్తావన లేదు. ఇతని రెండవ శాసనము క్రీ. శ. ౭౬౮ నాటి తలెగాం శాసనము. (ఎపి. ఇండి. సం. ౧౩.

యత్సేనయా౽హీంద్రముదావమర్ద్దా
గ్గ్గాపయో యామునవ ద్విభాతి[7] ".

పుటలు ౨౪౫-౨౮౭). క్రీ. శ. ౭౫౮-౭౬౮ సంవత్సరములవఱ్ఱ ఇతని శాసన మొక్కటియైనను గానరాదు. తలెగాఁవ్ పట్టికలయందును రాహప్పనుగూర్చి యేమియు గానరాదు; కాని యిందు శాసనోక్తదానము మణ్ణె నగరమున గంగులపై దండయాత్ర నడపుచు స్కంధావారమునం దియ్యబడిన ట్లుండుటచే (గంగానా ముపరి విజయస్కన్ధావారే మణ్ణెనగరే) నప్పటి కతడు రాహప్పను జయించియుండు నని తోచుచున్నది. వేంగి విజయానంతర మియ్యబడిన క్రీ. శ. ౭౬౯ నాటి యువరాజ గోవిందుని యాలాస్ తామ్రశాసనము (ఎపి. ఇండి., సం. ౬, పుట ౨౧౦) ఈ యభిప్రాయమును దృఢపఱుచుచున్నది. రాహప్ప పేరు చెప్పకున్నను క్రీ. శ. ౭౭౨ వ సంవత్సరము నాటి భండక్ పట్టికలందు (ఎపి. ఇండి. సం. ౧౪, పుట ౧౨౧-౩౦)—

"ఉల్లంఘితమర్యాదే
కలిజలధా వ్యాకులా నిమజ్జన్తీ
యేనోద్ధృతా ధరిత్రీ
శ్రీప్రలయమహావరాహేణ"

అను శ్లోకమున హద్దుమీఱి పొరలివచ్చిన కలిజలధి యందు మునిగియుండిన భూమిని శ్రీప్రలయవరాహుడు, అనగా ప్రథమాకాలవర్ష కృష్ణవల్లభు డుద్ధరించినట్లు చెప్పియున్నది. కృష్ణుడు జయించి సామ్రాజ్యమును గొనినది రాహప్పకడనుండి యని క్రీ. శ. ౭౩౫ నాటి ధారావర్ష ధ్రువుని సింపారిపట్టికలలోని (ఎ. ఇండి., సం. ౯, పుటలు ౮౧-౮౯)—

"రాహప్ప మాత్మభుజజాతబలావలేప
మాజౌ విజిత్య నిశితాసిలతాప్రహారైః,
పాలిధ్వజావలిశుభా మచిరేణ యో హి
రాజాధిరాజపరమేశ్వరతాం తతాన"

అను శ్లోకమువలన స్పష్టపడుచున్నది. కావున ప్రథమాకాలవర్షుడు క్రీ. శ. ౭౫౮-౬౮ ల మధ్య రాహప్పతోడ ముమ్మరముగ బోరుచుండె నని నిశ్చయముగ జెప్పవచ్చును.

7. SII. IX. I. 68.

8. Pro. Ind. Hist. Congress 1945, 986.

అను శ్లోకమువలన దెలియవచ్చుచున్నది. ఇందు పేర్కొనబడిన ఇంద్రుడు కాన్యకుబ్జాధిపతి. ఇంద్రాయుధు డని ఇతని సంపూర్ణ నామధేయము. ఇతడు శకాబ్దము ౭౦౫ (క్రీ. శ. ౭౮౩) ప్రాంతమున కన్యాకుబ్జమును పాలించుచుండినట్లు. జినసేనకృతహరివంశమునందు చెప్పియున్నది[8]. ఇమ్మడి గోవిందవల్లభుడు కన్యాకుబ్జముపై నేల దండయాత్ర సాగింపవలసివచ్చెనో తెలియదు. ఒకవేళ రాష్ట్రకూటుల యధికారము నుత్తరాపథమున మరల నెలకొల్పుట కతడు ప్రయత్నము సల్పియుండవచ్చును; లేక తనతో ప్రతిఘటించి సింహాసనము నాక్రమించుటకు బోరుచుండిన తన తమ్ముడగు ధారావర్ష ధ్రువుని కింద్రుడు సహాయము సేయగా నింద్రుని శిక్షించుటకేనియు గావచ్చును.

ఇమ్మడిగోవిందుని దొలగద్రోసి ధారావర్ష ధ్రువుడు సింహాసనము నాక్రమించుకొనియెను. ఇతని రాజ్యారంభమున కన్యాకుబ్జరాజ్యమున నొక విప్లవము జరిగినది. ఇమ్మడి గోవిందుని కాలమున నచట రాజ్య మొనర్చుచుండిన ఇంద్రరాజును బాఱదోలి గూర్జరప్రతీహార వంశజుడైన ద్వితీయ నాగభటుడు కన్యాకుబ్జము నాక్రమించి గంగాయమునాంతర్వేదిని వశపఱచుకొని యుత్తరాపథమున కధిపతి యాయెను. మాన్యఖేడు రాష్ట్రకూటులకును గూర్జరప్రతీహారులకును నంతట ద్వంద్వయుద్ధము ప్రారంభమాయెను. దంతిదుర్గుని కాలమందువలె నుత్తరాపథమును దమచేతిక్రింద నుంచుకొనవలయు నని రాష్ట్రకూటుల సంకల్పము. దాక్షిణాత్యులను వింధ్యమును దాటి రానీయక వెనుకకు గొట్టవలయునని గూర్జరప్రతీహారుల దృఢనిశ్చయము. ధ్రువముమ్మడిగోవిందుల కాలమున రాష్ట్రకూటప్రతాపము మహోగ్రముగ ప్రజ్వరిల్లినది. అశేష భారతదేశమును వారి వెలిగొడుగునీడచే సంఛాదితమగు నను శంక పొడమినది. వారికి మాఱొడ్డి నిలిచిన రాజు లేడు; పరాజయము నందని సేన లేదు. గూర్జరప్రతీహారరాజులు దమ రాజ్యమును జాఱవిడిచి మరుదేశమున తల దాచుకొనిరి. కాని మొదటి యమోఘవర్షచక్రవర్తి కాలమున పరిస్థితులు మారిపోయి

నవి. రాష్ట్రకూటుల శౌర్యము సన్నగిలజొచ్చినది. ఉత్తరాపథమువైపు వారికి దృష్టి ద్రిప్పుట కవకాశము లేకపోయెను. గూర్జరప్రతీహారులు విజృంభించిరి. అమోఘవర్ష దస్తంగతుడు గాకపూర్వమే మిహిరభోజుడు మాళవము నాక్రమించుకొనెను; లాటదేశముపై నెత్తివచ్చి ఖేటకపురమును వశపఱచుకొనెను. కాని, తండ్రియనంతరము మాన్యఖేటసింహాసనము నధిష్ఠించిన ఇమ్మడి కృష్ణవల్లభుడు దళములను గూర్చుకొని పోయి మిహిరభోజుని దఱుమగొట్టుటయే కాక గంగానదీపర్యంతముగల శత్రురాష్ట్రమును ద్రొక్కివచ్చెను. అటుతరువాత నల్పకాలములో మిహిరభోజుడు దివంగతుడు కాగా నతని కుమారుడు మహేంద్రపాలుడు రాజ్యాభిషిక్తు డాయెను. ఇతడు తండ్రియంతటి పరాక్రమశాలి గాడు; రాష్ట్రకూటులతో దన పూర్వులవలె నితడు పోరాడిన ట్లగపడదు. క్రీ. శ. ౯౧౦ వ సంవత్సరమువఱ కితడు ప్రజాపాలన మొనర్చిన ట్లున్నది. ఇతడు కాలధర్మము నందినపిమ్మట నితని జ్యేష్ఠపుత్రుడగు ద్వితీయభోజుడు రాజ్యాధిపత్యమును వహించి నాలుగేండ్లకాలము పుడమి నేలెను; కాని యితని యభ్యుదయమును సహింపక నితని యనుజుడు మహీపాలు డితని తొలగద్రోసి క్రీ. శ. ౯౧౪ లో సింహాసనము నాక్రమించుకొనియెను.

మహీపాలుడు శౌర్యవంతుడు. రాష్ట్రకూటులపై గసి తీర్చుకొన నిచ్ఛయు, రాజ్యమును వెంపొందించు కోరికయు నతనిని యుద్ధమునకు బురికొల్పినవి. రాజశేఖరకవియొక్క బాలభారతము లేక ప్రచండపాండవ మను నాటకప్రస్తావనయం దతని విజయము లిట్లు వర్ణింపబడియున్నవి :

"సమితమురలమౌళిః పాకలో మేఖలానామ్
రణకలితకలిఙ్గః కేలితక్కేరలేన్దోః,
అజనిజితకులూతః కున్తలానాం కుఠారః
హఠహృతరమఠశ్రీః శ్రీమహీపాలదేవః".

అనగా మహీపాలదేవుడు మురళులను, మేఖలలను, కళింగులను, కేరళులను, కులూతులను, కున్తలులను, రమఠులను జయించె నని యందలి భావము.

ఇందు పేర్కొనబడిన జనపదములందు మురళులు, కేరళులు, కున్తలులును దాక్షిణాత్యులు—కున్తలదేశము రాష్ట్రకూటసామ్రాజ్యమునకు హృదయమువంటిది. బళ్లారి, రాయచూరు, ధార్వాడ, బిజాపుర ఉత్తరకన్నడమండలములు ప్రాచీనకున్తలదేశమునకు జెందినవి. మహీపాలదేవుడు కున్తలులకు కుఠారమువంటివాడనగా రాష్ట్రకూటుల కతడు గర్భశత్రు వనియు, వారి నతడు జయించె ననియు మన మర్థముచేసికొనవలసియున్నది.

మఱియు మహీపాలదేవునిగూర్చి పై శ్లోకముపై వ్యాఖ్యానమునం దిట్లు వ్రాసియున్నది:

"ఆదిష్టోఽస్మి మహీపాలదేవేన, య స్యేమాం పురావిదః ప్రశస్తిగాథా ముదాహరన్తి :

"యః సంశ్రిత్య ప్రకృతిగహనా
మార్యచాణక్యనీతిం
జిత్వా నన్దా న్కుసుమనగరం
చన్ద్రగుప్తో జిగాయ ;
కర్ణాటత్వం ధ్రువ ముపగతా
నద్య తా నేవ హన్తుం
దోర్దర్పాఢ్యః స పున రభవ
చ్ఛ్రీమహీపాలదేవః.

ఇతి చణ్డకౌశికే ఆర్య క్షేమీశ్వరః. స ఏవా య మపి మహీపాలదేవ ఇతి తు న నిశ్చయః."

ఈ రెండవ శ్లోకముపై వ్యాఖ్యయు గమనింపదగినది :

"గాథా మాహ—య ఇతి: యః చన్ద్రగుప్తః తదాఖ్యః మౌర్యభూపతిః, ప్రకృత్యా స్వభావేన గహనాం దుష్ప్రవేశాం దుర్బోధా మిత్యర్థః, ఆర్యస్య కులీనస్య సద్వంశజాతస్య ఇత్యర్థః......చాణక్యస్య కౌటిల్యస్య నీతిం నయం నీతిశాస్త్ర మిత్యర్థః, సంశ్రిత్య అవలంబ్య, నన్దాన్ యోగానన్దప్రభృతీన్ నన్దవంశీయాన్, జిత్వా పరిభూయ, కుసుమనగరం పుష్పపురాఖ్యం పాటలీపుత్రస్థం నన్దనగరం, జిగాయ జితవాన్ అధీనీచకారేత్యర్థః, అద్య ఇదానీం, దోర్దర్పాఢ్యః బాహుబలదర్పితః, సః చన్ద్రగుప్తః, కర్ణాటోఽస్య

నివాసః కర్ణాటః...తస్య భావః తత్త్వం, కర్ణాటత్త్వం కర్ణాట దేశాధిపత్య మిత్యర్థః, ఉపగతవాన్ ప్రాప్తవాన్, ఇదానీం కర్ణాటదేశలబ్ధరాజపదాన్ ఇత్యర్థః. తాన్ దేహాన్తరధారణేన పున ర్జాతాన్ పూర్వనిహతాన్ నన్దాన్ ఇత్యర్థః, నన్దవంశీయాన్ కతిచిత్ రాజ్ఞః ఇతి యావత్, హన్తుమేవ నాశయితుమేవ, ధ్రువం నిశ్చితం, పునః భూయోపి, శ్రీమహీపాలదేవః తదాఖ్యనృపతివిశేషః, అభవత్ ; నన్దా శ్చన్ద్రగుప్తేన శ్రీమహీపాలాఖ్యయా జాతేన పునర్నిహతా ఇతి ప్రాక్తనీ ప్రసిద్ధి రితి భావః"9.

పూర్వము కౌటిల్యుని రాజనీతి నాధారపఱచుకొని చంద్రగుప్తమౌర్యుడు పాటలీపుత్రమును పాలించుచుండిన నందవంశజులను జయించెను ; ఇప్పుడు ఆ మౌర్యచంద్రగుప్తుడే మహీపాలదేవుడై యవతరించి కర్ణాటదేశరాజులై మరల జన్మమెత్తిన ఆ నందుల నోడించి కర్ణాటాధిపత్యమును బొందె నని పై శాసనము యొక్కయు, వ్యాఖ్యయొక్కయు సారాంశము. ఇందువలన గూర్జరప్రతీహారమహీపాలదేవుడు సమకాలిక కర్ణాటసామ్రాజ్యాధీశ్వరుడైన రాష్ట్రకూటచక్రవర్తి నోడించి కొంత రాష్ట్రమును వశపఱచుకొనె నని తెలియవచ్చుచున్నది. మహీపాలుని బాఱదోలి యతడాక్రమించుకొనిన దేశమును స్వాధీనపఱచుకొనుటకొఱకును, రాష్ట్రకూటుల ప్రతాపమును మరల గంగాయమునల మధ్యభూమియందు ప్రకటించుటకొఱకును ముమ్మడి ఇంద్రవల్లభుడు దండెత్తెను. ఈ దండయాత్రా సందర్భముననే వేములవాడ చాళుక్య ద్వితీయ నరసింహుడు మహీపాలుని దారసిల్లి యోడించినది.

ఈ దండయాత్ర ముమ్మడి ఇంద్రవల్లభుని రాజ్యాభిషేకమున కించుక పూర్వమే ప్రారంభమైనట్లు తోచుచున్నది ; ఏలనగా, క్రీ. శ. ౯౧౫ ఫిబ్రవరియం దతడు వ్రాయించిన బుగుమ్రా తామ్రపట్టికలం దతడు మేరువు నున్మూలించె ననియు, గోవర్ధనము నుద్ధరించిన యుపేంద్రుని జయించె ననియు జెప్పియున్నది10.

ఇంద్రుడు నాశమొనర్చిన 'మేరవు' కనౌజియై యుండవచ్చు నని డాక్టరు కీల్‌హారనుగా రూహించుచున్నారు11. అత డున్మూలించిన రాజు మహీపాలుడు గావచ్చు నని యభిప్రాయపడుచున్నారు12. కాని, డాక్టరు ఆల్టెకారుగారు పై యభిప్రాయములతో నేకీభవింపక, "ఇంద్రవల్లభునిచే నిర్జితుడైన యుపేంద్రుడు పరమారప్రభువగు కృష్ణరాజని తోచుచున్నది ; ఇతని కుపేంద్రు డను నామాంతరము గలదని యుదయపూరుప్రశస్తివలన దెలియుచున్నది...ఇతడు క్రీ. శ. ౯౦౦-౯౩౫ ల మధ్య రాజ్య మొనర్చెను. పరమారులు మొట్టమొదట గూర్జరప్రతీహారులకు సామంతులుగ నుండిరి ; వారిచే బురికొల్పబడి యుపేంద్రు డింద్రవల్లభుని రాజ్యారంభకాలమున నాసికమండలములోని గోవర్ధనముపై నెత్తివచ్చిన ట్లున్నది".13 ఆల్టెకారుగారి యభిప్రాయ మంగీకార్యమే. పరమారులుగూడ ప్రతీహారులవలె గూర్జరజాతికి జెందినవారే. వారును ప్రతీ

---

9. చణ్డకౌశికమ్—కలకత్తాప్రచురణ. పుట ౫౬. వ్యాఖ్యాత జీవానందవిద్యాసాగరుడు.

10. EI. IX pp 24-41 Verse 22.

"కృతగోవర్ధనోద్ధారం హేలోన్మీలితమేరుణా
ఉపేన్ద్రి మిన్ద్రిరాజేన జిత్వా యేన న విస్మితమ్"

ఇందు పేర్కొనబడిన గోవర్ధనమును పారిజాతుడనువాడు ముట్టడించియుండగా నిమ్మడి గోవిందచక్రవర్తి వాని బాఱదోలి దాని నుద్ధరించె నని దౌలతాబాదు పట్టికలందు కలదు (EI. IX no. 26 V. 10).

"తత్సూను రాహవరుచిః ప్రథితో బభూవ
శ్రీపారిజాతవిభవాహరణప్రతీతః
గోవర్ధనోద్ధరణలక్షితబాహువీర్యో
గోవిందరాజనృపతిర్హరిణా సమానః"

ఈ గోవర్ధనదుర్గము నాశికజిల్లాయం దున్న దని డాక్టరు ఆల్టెకారుగారు గుర్తించియున్నారు.

11. EI. VII. App. P. 16 n. 2.

12. EI. VII PP. 38 f.

13. రాష్ట్రకూటులు: వారి యుగము. పుటలు ౧౦౦-౧౦౧.

హారులతోగూడ మాళవమునకు వచ్చి యచ్చట స్థిర వసతు లేర్పఱచుకొనిరి. డాక్టరు ఆల్టెకారుగారి వ్యక్తినిరూపణ సమంజస మగునేని యింద్రవల్లభుడు గూర్జరప్రతీహారులతో బోరాడుటకు దన రాజ్యాభిషేక మునకు ముందే ప్రారంభించె నని తేలుచున్నది. వేములవాడ చాళుక్యనరసింహుడు జయించిన సప్తమాళవాధిపతులలో నీ యుపేంద్రు డొక్క డని చెప్పవచ్చును.

మహోదయదండయాత్రయందు జరిగిన యుద్ధాంశములన్నియు విపులముగ దెలియనచ్చుటలేదు; కాని పంపకృతవిక్రమార్జునవిజయపీఠికయందును, వేములవాడ శిలాశాసనప్రశస్తియందును నందలి ప్రధానఘట్టములు విశదముగ వర్ణింపబడియున్నవి.

మొదట లాటవిజయము: లాటదేశము పశ్చిమ సముద్రతీరమునం దుండెను. దీనికి నర్మదాతపతుల మధ్య నుండు రాజపిప్లాసంస్థానములలోని కొండల యందు బుట్టి క్యాంబేయఖాతములోనికి బ్రవహించెడి కీమునది యుత్తరపుటెల్ల. సూరతుఠాణా మండలములను వేర్పఱచు దమణగంగానది దక్షిణపు సరిహద్దు. తూర్పున సహ్యాద్రియును, బశ్చిమమున సముద్రమును మేరలు. మఱియు నీ లాటదేశము సప్తకొంకణములయం దొక్కటి 14. దీని రాజధాని ఖేటకము. ఇప్పుడు దీనిని గయారా యందురు.

గూర్జరప్రతీహారమిహిరభోజుని బాఱదోలియిమ్మడి కృష్ణవల్లభుడు లాటదేశమును స్వాధీనపఱచుకొనె నని పైన వ్రాసియున్నాడను. ముమ్మడి యింద్రవల్లభుని పక్షమున చాళుక్యయిమ్మడినరసింహు డీ దేశమును మరల జయించవలసివచ్చినట్లయిన, కృష్ణవల్లభుడు మరల నీ రాష్ట్రమును గోల్పోయె ననుట నిక్కము. నరసింహు డెవ్వరిని జయించి లాటమును స్వాధీనపఱచుకొనెనో తెలియదు; కాని గూర్జరప్రతీహార మహీపాలుడు మరళకు నలకర్ణాటకేరళదేశములను జయించియుండుట చేతను, లాటవిజయముతో నారంభమైన చాళుక్య నరసింహుని దండయాత్ర ప్రతీహారమహీపాలుని పరాజయముతోడను, మహోదయవినాశముతోడను ముగియుటచేతను లాటమున నోడిపోయిన ప్రతిపక్షి యాతడే యని విస్పష్ట మగుచున్నది.

లాటవిజయానంతరము మాళవ దండయాత్ర. ఈకాలమున మాళవ మేడు భాగములుగ విభజింపబడియుండెను. 14-a ఒక్క రాజు నాధిపత్యముక్రింద నుండక బహునాయకమై యుండెను. చాళుక్య యిమ్మడి నరసింహుడు దుస్సాహతరులగు నేడ్గురు మాళవ నృపులను జయించి వారియొద్ద కప్పము గొనె నని వేములవాడశిలాశాసనమున జెప్పియున్నది. ఈ యేడ్గురు రాజు లెవ్వరో, వారు పాలించుచుండిన ప్రదేశము లెవ్వియో తెలియదు. బుగూమ్రాతామ్ర శాసనమున నింద్రవల్లభునిచే బరాజితు డాయె నని చెప్పియుండు నుపేంద్రుడును, పరమారవంశజుడును, వాక్పతిరాజముంజుని పితామహుడును నైన యుపేంద్రుడును డాక్టరు ఆల్టెకారుగారు చెప్పిన ట్లొక్కరే యగుదురేని, చాళుక్యనరసింహుని కోడిన యేడ్గురు మాళవరాజులలో పరమారప్రభువగు నుపేంద్రు డొక్క డనియు, నత డోటమందినది పరమారుల కునికిపట్టయిన ధారప్రాంతమునం దై యుండు ననియు మన మూహించ వచ్చును. మాళవవిజయమును గూర్చి యింతకంటె విశేషించి మనకు దెలియవచ్చు నంశము లెవ్వియు

---

14. డినాస్టీస్ ఆఫ్ ది కానరీస్ డిస్ట్రిక్ట్సు, పుట 300.

14-a. ఇట్లే కొంకణదేశమును కళింగము నేడు భాగములుగ విభజింపబడియుండె నని సప్తకొంకణ సప్తకళింగశబ్దములవలన విదిత మగుచున్నది. మఱియు గళింగమున సప్తమాడియము లను నొక దేశవిభాగ ముండి నట్లు 'సప్తమాడియరాయచంద్రబింబాననా చికురవల్లరులపై జిన్నిపువ్వు'అను శ్రీనాథుని వాక్యమువలన దెలియుచున్నది. కృష్ణరాయలు 'మాడెములు' గాల్చె నని పెద్దన చెప్పుచున్నాడు. 'మాడె, మాడియ'ములు 'మాళియ'శబ్దమునకు రూపాంతరములు. 'మాళియ'ము 'మాళవ'మునుయొక్క భ్రష్టరూప మని కొందఱి మతము. అగునేని సప్తమాళవములకును, సప్తమాడియములకును జరిత్ర కందని గూఢమైన సంబంధ ముండియుండ వలయును.

లేవు. కాని యీ యుద్ధమునకు బ్రతిఫలముగ మాళవ దేశము సర్వమును రాష్ట్రకూటులకు గైవసమాయె నని దృఢముగ జెప్పవచ్చును.

## కాళప్రియప్రాఙ్గణము

లాటమాళవదేశములు రెండును రాష్ట్రకూటులకు స్వాధీనపడెను; కాని యంతటితో నింద్రవల్లభుడు తృప్తిపొందలేదు. కర్ణాటసామ్రాజ్యముపై నెత్తివచ్చి యం దశేషభాగమును గెలిచి స్వాధీనపఱచుకొన్నందుకు గూర్జరప్రతీహారమహీపాలునికి దగిన శాస్తి చేయవలసిన యావశ్యకత యొకటియు, రాష్ట్రకూటపాలిధ్వజమును మరల గంగాయమునాంతర్వేదియందు నెలకొలుపవలయు నను దృఢసంకల్పమొకటియు నతని ముందంజవేయ బురికొల్పినవి. కావున నతడు సైన్యములను గదల్చుకొని గూర్జరప్రతీహారసామ్రాజ్యలక్ష్మీ కిరవైన మహోదయమువంక నడవవలసిన దని చాళుక్యనరసింహుని కాజ్ఞ యొసగెను.

మహీపాలుడు పొరలివచ్చు సేనాసాగరము నాపుటకు దగు ప్రయత్నము సలుపక నప్రమత్తుడైయుండ లేదు. అతడును దళములను గూర్చుకొని రాష్ట్రకూటులను యమునానదిని దాటనీయక దిరుగగొట్టుటకై వచ్చి యా నదీతటమున విడిసెను. ఇచట విచారించవలసియున్నది. బుగూమ్రాపట్టికలలో నింద్రవల్లభుడు కాల్ప్రియప్రాంగణమును దన యేనుగుల దంతఘాతముల వలన విషమతలము గావించి యమునను గుఱ్ఱపుదళములతో దాటె నని చెప్పియున్నది. మఱియు వేములవాడ శిలాశాసనమున జాళుక్యనరసింహుడు ఎదురువచ్చిన గూర్జరరాజ్యసైన్యముల నోడించి కాళప్రియమున దన శౌర్యమును శిలాస్తంభమున బ్రకటించె నని యున్నది. ఈ కాళప్రియ మెచ్చటిది?ఇంతవఱకీ విషయమునుగూర్చి వ్రాసిన పరిశోధకులందఱును కాల్ప్రియ ముజ్జయినియని నిర్ణయించిరి. దీనికి గారణము కాళప్రియుడు మహాకాళుడే యను వీరి అభిప్రాయము. సుప్రసిద్ధమహాకాళదేవాలయము ఉజ్జయినియం దుండు కారణమున కాల్ప్రియ ముజ్జయినియే యని వీరు తీర్మానించిరి. డాక్టరు ఆల్టెకారుగారుమాత్రము పూర్వపరిశోధకుల యభిప్రాయము ననుసరించి కాల్ప్రియ ముజ్జయినియే యని చెప్పినను నొకవేళ నవి రెండును భిన్నప్రదేశములు కావచ్చు నను శంకను వెలిబుచ్చిరి. ఇట్టి సందేహము వీరికి గలుగుటకు మూడు కారణములను వీరు చూపిరి: (౧) బుగూమ్రాశాసనమున నింద్రవల్లభుడు దన మదదంతిదంతఘాతలచే కాల్ప్రియప్రాంగణమున విషమము గావించి వెంటనే యశ్వదళములతోగూడ నగాధమైన యమునాతరంగిణిని దాటినట్లు చెప్పియుండుట. ఇందువలన గాల్ప్రియము యమునాతటమున నుండె నను నూహ గలుగుచున్నది. (౨) మాళ్ఖేడునుండి కనోజికి బోవు మార్గమునం దుజ్జయిని లేకపోవుట. (౩) మఱియు యమునకు దక్షిణపుటొడ్డున కాల్పి యను స్థల ముండుట. 'కాల్పి' యను నది 'కాల్ప్రియ'కు భ్రష్టరూపము. ఇచ్చట నిప్పటికిని కాల్ప్రియాలయము గలదు. మఱియు నిది మాళ్ఖేడు కన్యాకుబ్జముల మార్గమం దున్నది. ఆల్టెకారుగారు చూపిన కారణములలో రెండవది యంతటి సత్త్ర కలది గాదు. ఏలనగా, మహోదయదండయాత్రను నడపిన చాళుక్యఇమ్మడినరసింహుడు మొదట సప్తమాళవములను జయించి యటుపిమ్మట కాళప్రియమున దన కీర్తిస్తంభమును స్థాపించినట్లు వేములవాడ శిలాశాసనమునను, విక్రమార్జునవిజయపీఠికయందును జెప్పియుండుటచేత రాష్ట్రకూటసైన్యములు మహోదయమునకు బోవుటకు ముం దుజ్జయినికి బోవుటయం దసంగత మేమియు లేదు. కాని మహాకాళునకు గాళప్రియు డను నామాంతర ముండెననుట కాధారము లెవ్వియు గానరావు. కావున కాళప్రియుడు మహాకాలుడు గాజాలడు; కాళప్రియ ముజ్జయిని కాదు. అది యమునాతటమందలి కాల్పియే 15.

---

15. వేములవాడశిలాశాసనమున జాళుక్యనరసింహుడు దన్నెదిరింపవచ్చిన గూర్జరరాజసైన్యములను జయించి కాల్ప్రియమున దన కీర్తిస్తంభమును నెలకొల్పె నని చెప్పియున్నను (తెలిం. శా. ఇతర. సం. ౨౧, శ్లో. ౯) సమకాలికరచనయైన పంపభారత

ఇంద్రవల్లభుడు కాలప్రియప్రాంగణమును దన మదదంతిదంతఘాతలచే విషయముజేసెనని చెప్పియుండుటచే నతడు దన యుద్ధపు టేనుగులను డీకొలిపి యా స్థలమును స్వాధీనపఱచుకొనెనని తెలియుచున్నది. దీనికి గారణము వేములవాడశిలాశాసనమునందు విశద పఱచియున్నది. గూర్జరరాజు మహీపాలుడు రాష్ట్రకూటసైన్యముల నడ్డుపెట్ట నెదురునడచివచ్చి కాలప్రియ ప్రాంగణము నాక్రమించుకొనియెను. ప్రాంగణ మనగా ముంగిలి. దేవాలయము ప్రాకారసంరక్షితమగుటచే దానిని గూర్జరరాజు దన సైన్యమునకు వీడుగావించుకొనియెను. ప్రాచీనకాలమున దేవాలయప్రాకారములు కోటగోడలవలె బలితములుగ గట్టబడెడివి. ఈ కారణమున బ్రాకారములను దేవాలయపు గోట లని పిలచెడివారు. కాలప్రియప్రాంగణమునుండి గూర్జరరాజును లేవదీయుట కింద్రవల్లభు డా దేవాయతనము నరికట్టి దాని కోటగోడలపై దన యుద్ధపు టేనుగులను బురికొల్పవలసినవా డాయె. ఇరు పక్షములకు రణము సాగెను. మహీపాలుడు కర్ణాటకుల నెదిరించి నిలువజాలక పాఱిపోయెను.

అతని వెన్నంటి తఱుముచు చాళుక్య నరసింహుడు కన్యాకుబ్జమువఱకు బోయెను. మహీపాలుడు ఒకచోటనైన నిలిచి రాష్ట్రకూటసైన్యముల నెదుర్కొనుటకు శక్తి చాలదాయెను. కావున నతడు పంప డన్న 'ట్లుమ్మలించుచు గుడిచినచో గుడువజాలక, పడుకొనినయెడ బడుకొనలేక, నిలిచిన పట్టున నిలువలేక' బలాయితు డాయెను. రాష్ట్రకూటసైన్యములు నిరాతంకముగ గన్యాకుబ్జముపై నడచి యా పట్టణమును ధ్వంసముగావించెను. ఈ యంశము మహోదయము నింద్రవల్లభుడు కుశస్థలము గావించె నను బుగూమ్రా శాసనవాక్యమువలన దెల్లమగుచున్నది.

ఇమ్మడి నరసింహుడు మహోదయదండయాత్ర నుండి వెనుదిరిగివచ్చిన పిమ్మట నేమి చేసెనో, యెంత కాలము జీవించియుండెనో తెలియదు. ఇతని పుత్రుడగు నిమ్మడి యరికేసరి క్రీ. శ. ౯౩౦ ప్రాంతమున నిజమండలమున కధిపతి యైనట్లు తెలియుచుండుటచేత నితని పాలన యంతదనుక సాగె నని మన మూహింపవచ్చును. ఇమ్మడి నరసింహుడు వేములవాడచాళుక్యులయం దెల్ల మేటి జోదు. ముమ్మడి యింద్రవల్లభుని యుద్ధములన్నియు నితని యాధిపత్యముక్రిందనే నడచెను. లాటమాళవగూర్జరప్రతిహారుల యోటమి యితని పరాక్రమాతిశయమును, సైన్యనిర్వాహణకౌశల్యమును వెల్లడిసేయుచున్నది. ఇంతటి సేనాధిపతి మఱియొకడు భరతఖండమునం దా శతాబ్దమున లే డని చెప్పుట యతిశయోక్తి గాదు. [సశేషము]

---

మున నతడు విజయారంభపురస్సరముగ విజయగజములనుబట్టి గూర్జరరాజధ్వజిని నోడించె ననియు, మహీపాలుడు నిలిచిన తావున నిలువక పాఱిపోయె ననియు, గంగావార్ధియందు దన తురంగమమును మెఱయించి సుప్రసిద్ధమైన కాళప్రియమున దన భుజగర్వము పెంపున దన యసిలతను స్థాపించె ననియు జెప్పియున్నది (పంప. విక్ర. విజ. ౧: ౩౬-౩౭). దీనిని బట్టి చూడగా కాలప్రియ మనునది గంగాతీరమున నుండెనా యను సంశయము గల్గుచున్నది. బుగూమ్రాశాసనమున నింద్రవల్లభుడు మహోదయమును (కనోజిని) నాశముజేసినట్లు చెప్పియుండుటచేత రాష్ట్రకూటసైన్యములు గంగానదివఱకు దాడి చేసె నని నిశ్చయముగ జెప్పవచ్చును. వేములవాడశిలాశాసనమునకును, విక్రమార్జునవిజయమునకును భేదమేల కలిగెనో చెప్పుటకు వీలులేదు. దీనికి వాస్తవకారణ మేమైనను కాలప్రియము గంగాతీరమందలిది కాదు.

# విధురభూమిక

శ్రీ ముదివర్తి కొండమాచార్యులు

జిలుగుంబంగరుచాయ లల్లుకొన ప్రాచీదిఙ్నభోవీథులన్
తలసూపన్, చరమాశ గ్రుంకు బిసినీనాథుండు తొల్లింటియ
ట్టులు;— అల్లే తరితీపు వెన్నెలల గండూషించుచున్ కల్వనె
చ్చెలి జోకొట్టు ననంతజీవజగతీసీమన్ నిశావేళలన్.

తొలుసంజన్ మలుసంజ విచ్చు కుసుమస్తోమంపు టామోదముల్
వొలయన్, నిర్ఝరిణీహృదంతరమునన్ పొంగెత్తు శైత్యమ్ము చి
ప్పిలగా పుణ్యసమీరణమ్ము సతమున్ వీచున్ ప్రసాదైకమం
జులగీతామృతనిస్వనమ్ముల నభస్సున్ మారుమ్రోయించుచున్.

సరసక్షీరము ధర్మదేవతలు గోసాధ్వుల్ ప్రవర్షించు; ని
ర్ఝరిణుల్ పూతజలప్రపూర్ణములు; సస్యశ్యామలంబై వసుం
ధర నేత్రోత్సవముం బొనర్చెదు; సముద్రస్వామి కావింపడే
ధరణీరంగతలమ్ముపై విలయనృత్య మ్మిప్డు దుప్పొంగుచున్.

తరువుల్ లేఁతచివుళ్ళతో, విరులతో దైవారు మాంగల్యమా
ధురి గైసేయుచు చైత్రమందు: పికసందోహమ్ము మాధ్వీమనో
హరకంఠమ్ముల నెత్తి పాడెడు; స్వకీయంబైన ధర్మైకసం
సరణ మ్మిందెగదోయి! షడృతువులున్ సంచారమున్ సల్పెడిన్.

హిమవంతమ్మును వింధ్యమున్ చటులవహ్నిజ్వాలలం గ్రక్కి స
ర్వము నిర్దగ్ధమొనర్పఁబోవుగద: విశ్వక్షోణి భేదిల్లి చి
త్రముగా స్థావరజంగమప్రతతి లిప్తన్ స్వీయగర్భాంధకా
రమహాగహ్వరముం దణంచుకొననా? రాగిల్లి తా నీమెదన్.

ఒకనాఁడున్ శిఖ గోలుపోవదుర నైజోష్ణమ్ము సుంతైన; నిం
తకు నేమారుపు జెంద దొక్కయణువైనన్ పంచభూతాత్మక
ప్రకృతిన్; కాని, ప్రసన్నతామధువు నాస్వాదింప వీ లేది? గొం
తుక కుచ్చుల్ బిగియించి వింత గనుగొంచున్ నిల్చె నేదో యిటన్.

అనుగుందల్లి సుధాన్నభిక్ష నిడగా, అయ్యయ్యో! యేదో తటా
లున తా తన్నుకపోయె నీ యనదమూల్గున్ సుంత లెక్కింపకే;
మను టెట్లో యిఁకమీఁద? నా అమృతధామమ్మున్ దహింపంగ వ
చ్చిన దేదో పెదపెద్ద అంగ లిడుచున్ జిహ్వాల్ వెసం జాచుచున్.

కథానిక

# రిక్షావాలా

శ్రీ 'కరుణకుమార్'

ఆ దినం పెద్ద పండగ. కలిమి కలిగిన మహా రాజుల యిళ్లన్నీ కళకళలాడుతున్నవి. పచ్చతోరణాలు, రంగుముగ్గులు, క్రొత్త గుడ్డలు, పిండివంటలు, మృష్టాన్నభోజనా — ఓ! సృష్టి యావత్తూ శోభాయమానంగా వెలిగిపోతోంది.

ఏయింటా దట్టిగా పండగశోభ అనేక రూపాలతో అవతరించి నృత్యం చేస్తోంది. ఇంట్లో ఆడా మొగా, పిన్నా పెద్దా కోడికూతకు ముందుగా లేచి క్షణం తీరిక లేక అదోవిధమైన నూతనచైతన్యంతో తిరుగాడుతున్నారు. ఆరోజు చేసుకోవలసిన పిండివంటలు, వంటకాల విషయంలో గత రాత్రినుండీ బయల్దేరిన తర్కాలు, చర్చలు అనుకొన్నంత సూక్ష్మంగా తీర్మానాలు కావటం లేదు. ఒకరికి లడ్డూ లిష్టమైతే, మరొకరికి మైసూరుపాకుమీద మనస్సు మళ్లుతోంది. ఒకరికి పెరుగువడ లిష్టమైతే, మరొకరికి మెదువువడలు రుచి. ఒకరు పులిహోర ప్రతిపాదిస్తే, మరొకరు దధ్యోదనం ఉపపాదిస్తున్నారు. పెద్దల్లుడికి బొబ్బట్లమీద భ్రాంతి అయితే చిన్నల్లుడికి అతిరసాలమీద ఆశ. ఇంతపండగ జరుగుతూంటే ఒక్క పస్తు ఉండక తప్పదు గదా? కనీసం రెండు కూరలు, ఒక వేపుడు, మూడు పచ్చళ్లు, ధప్పళం, కట్టుచారు, పిండి వడియాలు, అప్పడాలు, పెరుగు — ఇంత మాత్రమైనా ఉండకపోతే ఎట్లాగ? ఇక క్షీరాన్నం లేకుండా పండుగఘడియలు గడిచి బయటపడటం ఎట్లా?

తెల్లవారేసరికి విరగబడి పోతున్నారు జనం — సంచీలు పట్టుకొని మార్కెట్టుమీదకి. తెల్లవారకుండానే పొరుగూళ్లనుండి పాలు, పెరుగు తెచ్చే అమ్మలక్కలను కాళ్లకడ్డం తగిలి దారిలోనే బేరమైనా చేయకుండా ఎగరేసుకొని పోతున్నారు దధి క్షీరాలు. ఆరోజు సగానికి అఫీసులకు, కచేరీలకు, కోర్టులకు సెలవు. కాలేజీలకు, పాఠశాలలకు సెలవు.

ప్రపంచం యావత్తూ ఇంతటి శోభతో వెలిగిపోతూంటే, ఆ రిక్షావాలా చేసుకొన్న పాపకర్మమేమిటి. ఏమిటి వాడి అవతారం! ఇక వాడు తలకు నీళ్లు పోసుకొని కొత్తగుడ్డ ధరించేదెన్నడు! కన్నుకప్పే చీకటిలో వాడు రిక్షా లాగలేక లాగలేక ఈడ్చుకొంటూ దిక్కులుచూస్తూ వచ్చి బంగళా కాంపౌండు

గోడమీదినుండి బయటికి వంగిన పచ్చగన్నేరు చెట్టుక్రింద వీథిలో వొరిగి పోతున్నాడు. కొత్తగుడ్డలు ధరించి, బయట తిరిగే ప్రతీ సంపన్న గృహస్థుకీ లేచి నిలబడి దండాలు పెట్టుతున్నాడు. కాని, ఆనాడు వాడెవడి ముఖం చూచి బయలుదేరాడో, ఒక్కరూ చెప్పరు రిక్షా కావాలని.

సూర్యోదయం అయి ఎండబడుతోంది. వడ్డీసీల్లు తాగే గడియలు. కాని యింటికాడ వాని భార్య గతరెండురోజులుగా పనిచెడి లేవడం లేదు.

కడచినరోజుకూడా వాడికి పాపిష్టిరోజే. ఆరోజు పొద్దస్తమానూ వాడు రిక్షా లాగి సాయంకాలానికి సంపాదించుకొన్న ఒక్క రూపాయిడబ్బులలోనూ, తన రిక్షాకు లాంతరు దీపం లేకుండా లాగుతున్నందుకు ఛార్జీ చేస్తానని బెదిరించిన పోలీసుజవానుకు తాగుడుక్రింద పన్నెండు అణాలు లంచం పెట్టి, మిగిలిన నాలుగణాలూ రిక్షాఖామందుకు బాడుగక్రింద జమకట్టి, దణ్ణాలు పెట్టుకొన్నాడు. ఇక ఆరాత్రి వాడికి గుడిసెలో మసకకుడుముల్తో కుక్కినిండి, పిల్లవాళ్లూ, తనూ, తనభార్యా కడుపులో కాళ్లు ముడుచుకొని కాలంగడిపేరు.

కాని, పిల్లవాడినా వాడికి మంచి గడియలు వచ్చినట్లు లేదు. వడ్డీసీల్లు తాగే వేళకు కడుపులో మంట లేచి సిరసించి, ఆకలి తీర్చుకొను ఇన్ని ఉప్పు శనగలు కొనుక్కోనూ వానిచేత దమ్మిడీ కనిపించని దరిద్రమయిపోయింది ఆ మాయదారి పాడుగదినం. కాయకష్టం చేసి జీవనం గడుపుకొనే అతగాడికి దేహీ అని చెయ్యి చాపి ఒక్క కానీడబ్బు ముష్టిఅడుక్కోను నోరు రావడంలేదు. బొడ్డున ఉన్న పొగాకు కాడ ఒకటి త్రుంచి, నోట పెట్టుకొని దాని రసంతో తన నీరసం పోగొట్టుకోవడానికి ఉవ్విళ్లూరుతున్నాడు రిక్షావాలా!

ఎండబడి పదిగంటలు పొద్దెక్కింది. పదకొండు అయింది. పన్నెండు కూడా అయింది. వొట్టు పెట్టినట్టు ఆరోజు రిక్షావాలాకు బాడుగ దొరికితే వొట్టు! ఎండ ముదిరి చిటచిటలాడుతోంది. మండే శరీరాన్ని గన్నేరుచెట్టునీడనే సేద తీర్చుకొంటున్నాడు. వచ్చే పోయే సంపన్నులను 'రిక్షా సామీ' అని అడిగిఅడిగి వాడికి ప్రాణం విసిగిపోయింది. ప్రాణం సొమ్మసిల్లి రిక్షాలోనే వొరిగి కళ్ళు మూసుకొన్నాడు రిక్షావాలా.

ఎంతకాల మావిధంగా పడివుండినాడో, కాంపౌండుగోడమీదుగా విసరిన పుల్లాకుల విస్తళ్ల దొంతర దభీమని తన రిక్షాసమీపాన్నే క్రింద సైడుకాలువలో పడేవరకూ. వానికి మెలకువ వచ్చి కళ్లు తెరచి చూచేసరికి — ఎక్కడ కనిపెట్టుకొని ఉండినవో నూరు కాకులు వచ్చినట్లు వచ్చి ఆ పుల్లాకుల్ని ముక్కులతో, కాళ్ళతో ఈడ్చి చింపి లాగేస్తున్నవి. కాకులను తరముతూ నాలుగు పందులు ఆకుల్లో మూతులు పెట్టి గతకడం మొదలుపెట్టినవి. రెండు కుక్కలు వాయువేగంతో వచ్చి పందులపై బడి పుల్లాకులన్నిటినీ బీభత్సం చేసిపారేసినవి.

ఆ పుల్లాకుల్లోనుండి కొట్టిన కమ్మని వంటకాల వాసనకు రిక్షావాలానోరు ఊట లూరి, కడుపులో ప్రేగులు గుర్రుమని కొట్టుకోసాగినవి. అది వాని కొక అనను

భూతమైన అనుభవం. ఏనాడూ ఎరగని వాని ఆభిజాత్యం అడ్డు తగిలి సైడుకాలవల్లో పడిన పుల్లాకులమీద రోత నే పుట్టించింది. అందులో పందులు మూతిబెట్టిన వస్తువు తాను తాకడం ఎట్లా?

మిటమిటమంటూ సూర్యరశ్మి వేడెక్కిన కొద్దీ వాని శరీరం భగభగమండి పోతోంది. రెండుచెవుల్లోను శోషవల్ల హోరుమని శబ్దం బయలుదేరింది. ఆనాడు కూడా సాయంత్రంవరకూ వాడికి చిన్న డబ్బు సంపాదన లేకపోయినట్టయితే యిక బ్రతకడం ఎట్లా? అతని కేమీ పాలుపోలేదు. తోటి రిక్షావాణ్ణి ఒక్క పావులా డబ్బులు అప్పు అడిగాడు. 'పండగపూటా బదులేమి' టని ఈసడించి ఊరుకున్నాడతగాడు.

ఇంతలో కాంపౌండుగేటు తెరచుకొని ఒక పెద్దమనిషి బయటకు వచ్చి 'రిక్షా' అని పలకరించాడు.

ముఖమంతా కండ్లు చేసుకొని, కొండంత ఆశతో 'స్వామీ' అని రిక్షావాలా లేచి నిలబడి దణ్ణం పెట్టాడు.

“ఊళ్లోకి ఏమి తీసుకొంటావు?”

“నీ దయ వచ్చినంత ఇవ్వు సామీ”

“తర్వాత తగువులాడితే నేను ఒప్పుకోను. మూడణాలకంటె ఎక్కువ నేనెన్నడూ ఇవ్వలేదు.”

“చిత్తం.” అని అంటూ, మూసిన గూడు ముందుకు విప్పి, తన వాహనం రోడ్డుమీదికి లాగి, దిండుమీది ధూళి దులిపి— “రా, స్వామీ” అన్నాడు రిక్షావాలా.

చేతిలోని తమలపాకులకు సున్నం రాచి పంటినందున కొరికి, “గోవింద, గోవింద” అంటూ రిక్షా అధిరోహించాడు ఆ పెద్దమనిషి.

ఆయ నొక స్థూలకాయుడు. నడిమి వయస్సువాడు. ముఖాన ఉన్న గంధం, అక్షతలూ అతను బ్రాహ్మణుడనే తెలియజేస్తున్నవి. కాని కట్టిన దోవతివల్లా, వేసుకొన్న కోటువల్లా అతడొక ప్లీడరో, సర్కారుఉద్యోగో అనిగూడా అనుకోవలసి ఉంటోంది. అతని బరువుకు రిక్షా రవంత జవజవలాడిపోయిందిగాని క్రింద కమానులుమాత్రం విరగలేదు.

రిక్షాకు దణ్ణం పెట్టి కళ్ల కద్దుకొని, పరమాత్మా అంటూ కాడి పై కెత్తుకొన్నాడు రిక్షావాలా. ఆ ఊపుకు బ్రాహ్మడి కడుపులోని నీళ్లు కొబ్బరిబొండంలా గళగళ కొట్టుకున్నవి.

పాడురోడ్డు! మునిసిపల్ పరిపాలనంకటి అధ్వాన్నపు ప్రభుత్వం మరొకటి ఉండబోదు. అడుగడుక్కీ రోడ్డు చెడిపోయి గుంతలు పడి ఎగుడూ దిగుడూను! ఎన్నన్ని వేలు వసూలయినా ఈ మాయదారి మునిసిపల్ బడ్జెట్టులో బొక్కపడడం, చివరికి రోడ్డు మరామ్మత్తుకి డబ్బు కొరతబడిపోవడమూను. ఆ పాపిష్టి రోడ్డుమీద పోతుంటే — పాపం, భక్తాయాసమయినా తీరకుండ బయలుదేరాడేమో — ఆ బ్రాహ్మడికి ప్రాణాంతికంగా ఉన్నది ఆ కుదుపు. రోడ్డుకి తగినట్టుగానే ఉన్నది రిక్షా కూడా. అదొక పాత బొచ్చె. కమానులన్నీ కదలిపోయి లొటలొటలాడుతూ రవంత

వల్లదప్పితే విరుచుకొని క్రిందపడిపోయేటట్టు ఉన్నది ఆ గనపటం. క్రింద దండువి నల్లులే ఉన్నాయో ఏమో, పుటుకుపుటుకు మంటూ మనిషికి స్థిమితం లేకుండా పోతోంది. మిట్టమధ్యాహ్నపు ఎండేమో, బ్రాహ్మడికి ముఖంమీదా, మెడక్రిందా చిరుచెమ్మటలు పోసి శరీరం పేలినట్టు చిటచిటలాడిపోతోంది. 'ఎందుకెక్కితినా ఈ రిక్షా' అని ఆయన దిగులుపడుతూ కూచున్నాడు గాని, "రిక్షా నిలుపు" అనే మాత్రం ఆయన నోటి వెంట రావడంలేదు.

రిక్షావాడి బాధ ఆ పరమాత్మునికే తెలియాలి. లోపలి మనిషిభారం తనకి మించిన భారంలా బరువెక్కిపోయింది. ఆ పాడురోడ్డుమీద ఆ రిక్షా లాగాలంటే అతగాడికి తన ప్రాణం తోకకి వస్తోంది. అందులో రెండు పూటలుగా అన్నరసం లోపలికి పోనటువంటి గడియలేమో, వాడికి అడుగడుక్కీ ఒక గండమైపోయింది. ఎంతెంత దమ్ము పట్టి హుంకరించినా, గుండెదడా, ఆయాసమూ, నోరెండిపోవడమూ మాత్రమే కాని రవంతకూడా రిక్షా కదులుతున్నట్లు అతగాడికి కనిపించడంలేదు. "రిక్షా లాగలేను స్వామీ" అని వదలుకొంటే ఆరోజుకా మూడణాలుకూడా దక్కకుండా పోతవేమోనని అతగాడి దిగులు. ఆ మూడణాలూ మూడు వందల రూపాయలుగా అతనిహృదయంలో వెలిగిపోతున్నవి. అది ఆరణాలు తీసుకోవలసిన ప్రయాణమైనా తాను నోరువిప్పి బేరంచేస్తే అసలుకు మోసం రాగలదేమో అనే భయంచేత బ్రాహ్మడు మూడణాలంటే తానున్నూ మాబాగన్నాడు.

ప్రయాణంకుదుపునకు బ్రాహ్మడికి నిండు కడుపు బరువెక్కి డొక్కలో సన్నని నొప్పి కూడా బయలుదేరుతోంది. పండగ భోజనంలో ఏమేమి పదార్థాలు, పిండివంటలు పడ్డాయో ఆయన కుక్షిలో—ఆ ఎండలో, ఆ రిక్షామీద, ఆ రోడ్డుమీద—బ్రాహ్మడికి ఆయాసం, వగర్పుకూడా పుట్టుకొని వచ్చినవి. భోజనానంతరం సేవించిన తాంబూలంవల్ల భుక్తాయాసం రవంత సర్దుకోవలసినదే నిజానికి; కాని ఆ ఉక్కుమాలిన ప్రయాణంలో తాంబూలసేవన కూడా ఆయనకు వెగటుపుట్టి వికారంవల్ల థూ అని ఉమ్మివేసి ఊరుకున్నాడు. ఆ బాధపడలేక రిక్షా దిగి యింటికి పోవాలనుకొన్నాడు బ్రాహ్మడు. కాని సగం దూరం వచ్చినతర్వాత దిగిపోతే పూర్తిగా మూడణాలూ తీసుకోకుండా విడిచిపెట్టుతాడా రిక్షావాడు? ఆరణాలు ఇచ్చుకోవలసిన ప్రయాణం తనకి మూడణాలకే దొరికింది. ఎట్లా పోగొట్టుకోవడం? పోగొట్టుకొని దిగితే, తిరిగి యింటికి పోవడం ఎట్లా? తాను నడిచి వెళ్లే స్థితిలో లేడే! మరణవేదనలో ఇస్సురని నిట్టూర్చి, "గోవింద, గోవింద" అని భగవన్నామం స్మరించాడు బ్రాహ్మణుడు.

"నారాయణమూర్తీ!" అని ఉస్సురంటున్నాడు రిక్షావాలా. 'కరువులో అధికమాసం' అన్నట్టు అక్కడ ఎత్తయిన బ్రిడ్జి ఒకటి దాపురమైంది. రిక్షావాడు హుం అని హుంకరించి బ్రిడ్జిమీదకి లాగుతూంటే శరీరం యావత్తూ ముచ్చెమటలు పోసి, గొంతులో వేడినిట్టూర్పువల్ల తడి ఎండిపోయి, ఒక్కొక్కతడవ తను ముందుకు లాగే రిక్షా అంత బరువుతోనూ తటాలున

వెనక్కి కూడా జరిగిపోతోంది. రిక్షా చెయ్యి జారితే ఏం ప్రమాదం సంభవిస్తుందోనని బ్రాహ్మడు భగవంతుడిమీద భారం వేసి, "భద్రం, భద్రం" అని పైనుండి క్రిందివాడికి హెచ్చరిక చేస్తున్నాడు.

బ్రిడ్జి ఎక్కేసరికి తిరపతికొండ ఎక్కినంత పని అయి, రిక్షావాడు తలక్రిందులై పోతున్నాడు కాని, బ్రాహ్మడు మాత్రం బ్రతుకు జీవుడా అని ఒక్క నిట్టూర్పు విడిచాడు.

కాని, కష్టసుఖాలు కావడికుండలు. బ్రిడ్జి ఎక్కి దిగుడులో క్రిందికి తిరిగేవరకు కొండమీదినుండి దొర్లించిన పుచ్చకాయలా జర్రున జారిపోతోంది రిక్షా. ఈసారి రిక్షా బలవంతాన లాగవలసిన ప్రమేయం వాడికి లేకపోయినప్పటికీ ఆ దూకుడులో రిక్షాతో సమానంగా పరుగుపెట్టవలసివచ్చింది— రిక్షావాడికి. రిక్షాదూకుడుకు, ఆ గులక రాతిరోడ్డుమీద బ్రాహ్మడి శరీరం హూనం అయిపోయినట్టయి కడుపులో వెర్రిబాధ బయల్దేరి, రిక్షా పూర్తిగా క్రిందికి దిగే పర్యంతమయినా ఆ బాధకి తట్టుకోలేక—

"ఇస్సు, అబ్బా! నిలపరా నీయమ్మ కడుపు కాలా!" అని బ్రాహ్మడు వెర్రికేక పెట్టాడు.

ఆ కేకతో బేజా రెత్తి, బలవంతాన రిక్షా రోడ్డు పక్కకి లాగి నెమ్మదిగా కిందకి దింపేడు రిక్షావాలా.

ఆ బ్రాహ్మడికి అదేమి బాధో పాపం, రిక్షాలోనుండి క్రిందకి దిగడాని కయినా నందులేకుండా రిక్షాలో కూర్చునే బయట రోడ్డుమీదికి ఓక్కు ఓక్కుమని డోక్కుంటూంటే, కడుపులోని హోళిగ ముక్కలు, ఆవడలు, క్షీరాన్నం, కూర ముక్కలు, సాపుఘీనా కడిగివేసినట్టు బొళబొళమంటూ బయటపడిపోయి ఆ బ్రాహ్మడికి ప్రాణం కడంటిపోయింది.

ఆ ప్రయాణపు దెబ్బకి మలమల మాడే కడుపులో చెయ్యిపెట్టి కలచినట్టయి రిక్షావాడికి వికారం పుట్టి వాళ్లు తిరిగి ప్రక్కనే రోడ్డుమీద కూర్చుని చిన్నప్పుడు తిన్న దొండకుపసరంతా కక్కుకుంటూంటే దోవన బోయే ఒక మోటారు అక్కడ నిలిచి—

"అయ్యో, పెద్దమనిషి కెంత ఆపద వచ్చిం" దంటూ బ్రాహ్మణ్ణి ఎక్కించుకొని యింటిదగ్గర దిగబెట్టింది.



# రష్యన్ కథకుడు ఆంటన్ చెకోవ్

●

**'చతుర్వేది'**

ఏ పత్రిక చేతికి దొరికినా నేటి చదువరి అందులో కథ లున్నాయా, లేవా అని ముందుగా చూస్తాడు. ఒక్క తెలుగుసాహిత్యంలోనే కాదు. ప్రపంచసారస్వతంలోనే కథానిక ఈనాడు ఏక అద్వితీయమైన స్థానాన్ని సంపాదించుకున్నది. ఇప్పుడు నవలకాని, నాటకంకాని, కావ్యంకాని, వ్యాసం కాని కథానికతో పోటీచేసి నెగ్గలేవు.

దీనికి చాలా కారణా లున్నాయ్. కాని ముఖ్య కారణం ఇద్దరు వ్యక్తులు—రష్యన్ కథకుడు ఆంటన్ చెకోవ్, ఫ్రెంచికథకుడు గైడీమాపసా. కథకులుగా వీ రిద్దరూ అద్భుతమైన ప్రతిభను ప్రదర్శించారు. వీరి మూలాన్నే కథానికకి ఈనాడు విశ్వసాహిత్యంలో ఇంత అపూర్వమైన ఆదరణ లభించింది.

అందుకే ఒక విమర్శకుడు "కథానికారచనలో రెండు విశిష్టమైన, విభిన్నమైన పద్ధతు లున్నాయ్. ఒకటి చెకోవ్ పద్ధతి; మరొకటి మాపసాంపద్ధతి. ఎంత స్వతంత్రుడైన కథకుడైనా తనకి తెలియకుండానే వీరిద్దరిలో ఒకరిని తప్పకుండా అనుసరించి తీరాలి" అన్నాడు. కథకులుగా వీరు తొక్కని దారి లేదు. వీరు చూపని శిల్పవిన్యాసం లేదు.

ఆంటన్ చెకోవ్ కథలు నాటకధోరణిలో నడుస్తయ్. మాపసా కథలు కావ్యశైలిని అనుసరిస్తయ్. తను ఎడంగా నిలబడి తన పాత్రలకి ప్రాణంపోసి వాటి మాటల్లోనూ, చేతల్లోనూ చెప్పదలచినదంతా ఇమిడ్చి చెకోవ్ కథని చకచకా నడిపిస్తాడు. తన పాత్రల్లో లీనమైపోయి, పాత్రలని ఛాయామాత్రులుగా వుంచి మాపసా తనేకథంతా చెబుతాడు. మాపసా తన కథల్లో అడుగడుగునా వ్యాఖ్యాతరూపంలో కనబడుతూ వుంటాడు. చెకోవ్ షేక్స్పియర్‌లాగా సజీవమైన పాత్రల్ని సృష్టించి వాటి ప్రవర్తనలోనూ, సంభాషణల్లోనూ తను చెప్పదలచుకున్నదంతా వినిపిస్తాడు. తను దూరంగా నిలబడి తన పాత్రలచేతనే కథ నడిపిస్తాడు. అనవసరమైన వర్ణనలూ, అప్రస్తుతమైన వ్యాఖ్యానాలూ చెకోవ్ కథల్లో కనిపించవు.

కథలద్వారా లోకాన్ని మరమ్మత్తు చెయ్యాలనే ఉద్దేశం చెకోవ్‌కి ఏకోశానా లేదు. హితోపదేశాలు చెయ్యటం, నీతిబోధలకి పూనుకోవటం తన పని కాదని చెకోవ్ స్పష్టంగా చెప్పాడు. "దొంగతనం చెయ్యటం నేరం అన్న సంగతి అందరికీ తెలుసు. దొంగతనం చెయ్యటం ఎటువంటిదో చిత్రించటమే కథకుడి కర్తవ్యం. ఇది తప్పు, ఇది ఎవరూ చెయ్యరాదు అని బోధించటం నాపని కాదు" అన్నాడు చెకోవ్.

"కథల ఆదర్శం సత్యాన్ని చిత్రించటం" అని చెకోవ్ ఉద్దేశం. ఈ ఆదర్శాన్నే తన సాహిత్యంలోనూ, తనజీవితంలోనూ సాధించటానికి చెకోవ్ ఎంతో పాటుపడ్డాడు. అసాధారణమైన పాత్రలకీ, అసహజమైన సంభాషణలకీ, అతిశయోక్తితో కూడిన వర్ణనలకీ చెకోవ్ కథలలో స్థానం లేదు. అంతటా సహజత్వమే గోచరిస్తుంది. ఒకపాత్ర చెయ్యి కదిపినా, భుజాలు ఎగరేసినా, ఏపని చేసినా పాత్రోచితంగా వుంటుంది. సజీవమైన పాత్రలని సహజంగా చిత్రించటంలో చెకోవ్ అందెవేసిన చెయ్యి.

చెకోవ్‌కి శాస్త్రజ్ఞానంమీద చాలా అభిమానం. శాస్త్రీయదృక్పథం ప్రతికళాకారుడూ సాధ్యమైనంతగా అలవరుచుకోవాలని అతని అభిప్రాయం. శాస్త్రీయదృక్పథం లేని కళాకారుడు సత్యాన్ని యథాతథంగా చిత్రించలేడని చెకోవ్ ఉద్దేశం. "నేను రచయితగా జీవితం ఆరంభించకముందే డాక్టరు డిగ్రీకోసం చదవటం మొదలుపెట్టాను. వైద్యంలో నేను సంపాదించిన విజ్ఞానం వృథాపోలేదు. ఆ చదువు నా రచనలకి ఎంతో తోడ్పడింది. ఆ చదువువల్ల నా పరిశీలనాశక్తి చాలా పెంపొందింది" అంటాడు చెకోవ్. డాక్టరు రోగిని పరీక్షించి వ్యాధిని నిర్ధారణ చేసినట్లుగానే చెకోవ్ తన పాత్రలని నిశితంగా పరిశీలించి, వాటి స్వభావాలలోని వెలుగునీడలని మన కళ్లకి కట్టేటట్లు వర్ణిస్తాడు. ఆ పరిశీలనలోనూ, వర్ణనలోనూ లేశమైనా అతిశయోక్తి కనిపించదు. చెకోవ్ కథల్లో కూడా డాక్టరుగానే కనబడతాడు.

ఆంటన్ చెకోవ్ ౧౮౬౦వ సంవత్సరంలో పేదకుటుంబంలో పుట్టాడు. అతని తండ్రి ఏదో చిన్న దుకాణం పెట్టుకుని కాలం వెళ్లదీసేవాడు. ఎంతో

కష్టంమీద చిన్న తరగతులన్నీ దాటి డాక్టరు చదువులో చేరాడు. కాని డబ్బులేదు. చదువుకోవాలనే ఆసక్తి ఎక్కువగా వుంది. డాక్టరు చదువుకి సరిపడ డబ్బు సంపాదించుకోవలసిన అగత్యం ఏర్పడింది. అందుకోసమే మొదట చెకోవ్ కలం చేతబట్టి రాయటం మొదలుపెట్టాడు. ఈ మొదటిదశకి సంబంధించిన రచనలన్నీ హాస్యప్రధానమైనవి. చెకోవ్ హాస్యంలో మొదట మోటుతనం వుండేది. కాని పోనుపోను చెకోవ్ అత్యుత్తమమైన హాస్యాన్ని సృష్టించగలిగాడు. చెకోవ్ నవ్వుతుంటే వానవెలిసిన వెంటనే వెన్నెల వచ్చినంత హాయిగా వుంటుంది. ఆ నవ్వు జీవితంలోని మారుమూలల్లో దాగిన కారుచీకటి నంతనీ పటాపంచలు చేస్తుంది. ఇంకొకళ్లయితే గుండెలు బాదుకుని ఏడ్చే పరిస్థితుల్లో చెకోవ్ చిరునవ్వులు వెదజల్లగలిగాడు. ఈహాస్యం చెకోవ్ జీవితంలోనూ, రచనల్లోనూ వెల్లివిరిసే ప్రధానలక్షణం. పేదరికంవల్లా, క్షయవ్యాధివల్లా ఎన్ని బాధలుపడ్డా చెకోవ్ కుంగిపోలేదు. జీవితంలోని సుడిగుండాలలో చిక్కుకోకుండా హాస్యమే చెకోవ్‌ని కాపాడింది. ఈ హాస్యమే జీవితంలోని అన్నిదుఃఖాలనీ, అన్నిబాధలనీ ఓడించిన అద్భుతశక్తి.

కాని, జీవితంలోని కన్నీటితో పరిచయమున్నవాడే ఉత్తమమైన హాస్యాన్ని సృష్టించగలుగుతాడు. మెరిసే చిరునవ్వుమాటున తొణికే కన్నీరుకూడా కనబడాలి. అల్లరులనూ, దరహాసాలనూ మేళవించగలిగిన రచయితే ప్రసాదమైన, మధురమైన హాస్యరసాన్ని చదువరులకి అందించగలడు. ఇటువంటి హాస్యం చెకోవ్ కథల్లోనూ, నవలల్లోనూ, నాటకాల్లోనూ అంతర్వాహినిగా ప్రవహిస్తూవుంటుంది.

చెకోవ్ రష్యన్ సారస్వతంలో ఒక విశిష్టమైన శక్తి. అంతే కాదు; ఒక అసాధారణమైన వ్యక్తి. రష్యాదేశమంతా విప్లవోద్రేకంతో రణదుందుభులు మోగించిన సమయంలో తనకి హింసాత్మకమైన విప్లవంమీద విశ్వాసం లేదని వెల్లడించాడు చెకోవ్. తన అభిప్రాయాన్ని నిర్భయంగా ప్రకటించి దేశీయుల నిరసనలకి, నిందలకి చలించకుండా నిలబడిన సాహసి చెకోవ్. అటువంటి సమరోత్సాహంలో జాతి అంతా మునిగితేలుతున్నప్పుడు ఆ వెల్లువలో పడి కొట్టుకుపోకుండా దూరంగా నిలబడగలగటం సాధారణమైన వ్యక్తులకి సాధ్యంకాని పని.

కాని విప్లవవ్యతిరేకి అన్నంతమాత్రాన చెకోవ్‌ని చిన్నచూపు చూసేవారుండొచ్చు. అతనికి ప్రజల ఉద్యమాలమీద అభిమానం లేదనీ, ప్రజల అభ్యుదయంలో ఆసక్తి లేదనీ కొందరు భావించవచ్చును. నిజంగా ఆలోచిస్తే చెకోవ్ జీవితంలో వెల్లివిరిసే ప్రజాహితకాంక్ష, అతనిరచనల్లో నిండి తొణికే జీవకారుణ్యం విప్లవావేశంతో పత్రికలు వేసేవారిలో ఎందరిలో కనిపిస్తయ్? అతను రాజకీయాల్లో జొరబడలేదు. అయినప్పటికి అనుక్షణమూ తోడిమానవుల శ్రేయస్సుకోసమే పరితపించేవాడు. ఇతడు నెరపినంతటి ప్రజాసేవ సంఘసంస్కర్తలమనీ, విప్లవకారులమనీ గొప్పలు చెప్పుకొనేవారిలో ఎందరు చేసివుంటారో చెప్పటం కష్టం. చెకోవ్ జీవితంలోని ఒక్క సంఘటన చాలు. చెకోవ్ ౧౮౯౦ లో, అంటే సైబీరియన్ రైలుదారి పడకముందు ఒంటరిగా సైబీరియాగుండా ఆసియాలో వున్న సాఘలియన్ ద్వీపానికి వెళ్ళి అక్కడి ఖైదీల పరిస్థితులని పరిశీలించి వచ్చాడు. ఇది మానవమాత్రులకి సాధ్యంకాని ప్రయాణం. చెకోవ్ దారిలో పడ్డ ప్రయాసవల్లా, కష్టాలవల్లా భయంకరమైన క్షయవ్యాధికి గురికావలసివచ్చింది. అయినా చెకోవ్ వెనకాడలేదు.

డాక్టరు డిగ్రీవల్ల చెకోవ్ దమ్మిడీకూడా సంపాదించలేకపోయాడు. కాని ఆర్తులను రక్షించటానికి ఈ వృత్తి బాగా పనికివచ్చింది. ౧౮౯౨ లో నిజ్నీనోవ్‌గ్రాడ్‌లో కలరా విలయతాండవం ప్రారంభించింది. ముందువెనకలు చూడకుండా అక్కడికి దుమికి చెకోవ్ క్షణంకూడా విరామం లేకుండా రోగులకి వైద్యసహాయం చేశాడు. అప్పుడు చెకోవ్ గర్భదరిద్రుడు. అతనిచేతిలో కలం ఆడితేనే నోట్లోకి ముద్ద. అతనే కుటుంబాని కంతటికి ఆధారం. కాని రోగుల సేవలో క్షణంకూడా రాసుకునే తీరిక లేదు. అటువంటి క్లిష్టపరిస్థితిలో చెకోవ్‌కి కృతజ్ఞతాపూర్వకంగా రష్యన్ ప్రభుత్వం కొంత వేతనాన్ని ఇస్తామన్నారు. ఇంకొకళ్లయితే ఆ స్థితిలో ఎగిరి గంతేసి పుచ్చుకునేవాళ్లు. కాని చెకోవ్ ఆ వేతనాన్ని తిరిగి పంపేశాడు. తను దారిద్ర్యంతో క్రుంగిపోయినాసరే, తన వ్యక్తిస్వాతంత్ర్యాన్ని ప్రభుత్వవేతనానికి బలిచేసి బానిస కాకూడదని చెకోవ్ స్థిరవిశ్వాసం. సొంత లాభం కొంతమాత్రమేకాదు, అంతా మానవుని పోగుచేసుకునేవారికి తోడుపడిన చెకోవ్ నిజంగా అసాధారణమైన వ్యక్తే. అందుకే ప్రఖ్యాతవిమర్శకుడు

మిడిల్టన్ మర్రీ చెకోవ్‌ని మహాత్ముల శ్రేణిలో చేర్చాడు.

వర్గపక్షపాతం చెకోవ్ రచనల్లో ఎక్కడా కనబడదు. దుర్గుణాలన్నీ ధనికులలోనూ, సద్గుణాలన్నీ బీదలలోనూ వుంటయ్యని చెకోవ్ చెప్పడు. మూర్ఖత్వం, క్రూరత్వం అన్ని తరగతులవారిలోనూ, అన్ని తరహాల వారిలోనూ వుంటయ్యని చెకోవ్ వుద్దేశం. అందుచేత కేవలం బీదవాళ్లమీదనే సానుభూతి చూపాలనే సంకుచితవాదం చెకోవ్‌కి గిట్టదు. మనిషి తన వర్గ భేదాన్ని మరిచిపోయి, జగత్ కుటుంబంలో తానొక డుగా మెలుగుతూ, తోటిమనిషిని తనలాగా చూసుకోవాలని చెకోవ్ విశ్వాసం. అన్ని భేదాలకీ అతీతమైన మానవవ్యక్తిత్వానికే అగ్రపీఠం ఇవ్వాలని చెకోవ్ అభిప్రాయం.

ఈ హృదయవైశాల్యం చెకోవ్ రచనలన్నిటిలోనూ శరత్కాలపు వెన్నెలలాగా చల్లగా చదువరి మనసుని మంత్రించివేస్తుంది. అతని ఉత్తమకథానికలైన 'డార్లింగ్', 'కిస్', 'మై లైఫ్', అతని విశ్వవిఖ్యాతి పొందిన నాటకం 'చెర్రి ఆర్చర్డు' ఈ విశాల దృక్పథాన్నే ప్రదర్శిస్తయ్.

కొన్ని విషయాల్లో టాల్‌స్టాయ్‌కీ, చెకోవ్‌కీ పోలిక వుంది. ఇద్దరికీ ప్రేమ, స్వాతంత్ర్యం, సంపూర్ణమైన స్వేచ్ఛా అభ్యుదయవాదాలు. ఇద్దరికీ అసత్యంమీదా, హింసమీదా ప్రబలవిరోధం.

టాల్‌స్టాయ్‌మీద చెకోవ్‌కి ఎంతో భక్తి. సాహిత్యప్రపంచంలో టాల్‌స్టాయ్ ఎవరెస్టు శిఖరమని చెకోవ్ విశ్వాసం. "ఇంతగా నేను ఎవరినీ ప్రేమించలేదు. టాల్‌స్టాయ్ లేకపోతే నా జీవితంలో తీరని కొరత ఏర్పడుతుంది" అన్నాడు చెకోవ్. కాని టాల్‌స్టాయ్ వైరాగ్యం చెకోవ్‌కి మింగలేని చేదు మాత్రగా గొంతుకి అడ్డంపడింది. జీవితంలోని రమణీయమైన వస్తువులన్నిటికీ దూరంగా తొలగిపోయి ముసలివేదాంతాలతో పొద్దుపుచ్చటం చెకోవ్‌కి చేతకాని పని. స్త్రీల అందమంటే టాల్‌స్టాయ్‌కి రోత, భీతి; చెకోవ్‌కి జోత, ప్రీతి.

సాహిత్యంలో చెకోవ్ ఆధునికుడు. శిల్పంలో అధునాతనుడు. కొన్నికథలు కేవలం రేఖాచిత్రాలుగా వుంటయ్. కథలో తను ఎంత చెబుతాడో అంతకి రెండింతలు చదువరిఊహకి వొదిలేస్తాడు. కొన్నికథల్లో ఒకొక్కక్క సన్నివేశం ఒకొక్కక్క సమగ్రచిత్రంగా వుంటుంది. మొత్తంమీద కథ కొన్ని చిత్రాలతో మాల గుచ్చినట్లుగా వుంటుంది. శిల్పంలో చెకోవ్ సిద్ధహస్తుడు, అద్వితీయుడు.

కాని ఆధునికుల లోపాన్ని ఇంత నిశితంగా మరే రచయితా విమర్శించలేదు. పూర్వయుగాల సాహిత్యానికీ, ఆధునికసాహిత్యానికీ వున్న భేదాన్ని స్పష్టంగా కనిపెట్టాడు. "మనలో ఏదో తీరని కొరత వుంది. మన కవితల జిలుగుతెరలని తొలగించి చూస్తే కనిపించే దేమిటి? శూన్యం శూన్యం!" అన్నాడు. ఎందువల్ల? దీనికి చెకోవ్ చెప్పే జవాబు: "పూర్వపు రచయితలకి ఒక నిర్దిష్టలక్ష్యం వుంది. వారి రచనలు చదువరిని ఒక స్పష్టమైన గమ్యానికి తోడ్కొని పోగలవు. కాని, మన రచనలకి ఆ శక్తి లేదు. మనకి మతంమీదగాని, ఆత్మమీదగాని, స్వర్గంమీదగాని, నరకంమీదగాని లేశమైనా విశ్వాసం లేదు. మనకి దేనిమీదా విశ్వాసం లేదు. మనకి భీతి లేదు. ఆశ లేదు. మన ఆశయాలకి గమ్యం లేదు. మన హృదయాల్లో గమ్యం చేరాలనే సందడికూడా లేదు. మన ఆత్మలు శూన్యంగా ఘోషించే అఖాతాలు. ఇటువంటి శూన్యంలోంచి నిజమైన కళ జనించదు". నిజంగా ఈ విమర్శ అద్భుతమైనది. శల్యపరీక్షచేసిన వైద్యుడు రోగాన్ని నిర్ధారణ చేసేటంత నేర్పుతో చెకోవ్ ఆధునికరచయితల మనస్తత్వంలోని లోపాన్ని కనిపెట్టగలిగాడు. ఆధునికుడే ఆధునికులను గురించి ఇటువంటి విమర్శ చేయటం అసాధారణమైన విషయం. దీన్నిబట్టి చెకోవ్‌కి సత్యంమీద ఎంత ప్రీతి వుందో మనం తెలుసుకోగలం.

మూడువందల పుస్తకాలని ప్రచురించి, ప్రపంచ సారస్వతంలో భద్రమైన స్థానాన్ని సంపాదించుకుని చెకోవ్ క్షయవ్యాధిమూలంగా ౧౯౦౪ లో మరణించాడు.

కాని పోయేముందు ఒక మిత్రుడికి ఉత్తరం రాస్తూ అందులో ఒక అమూల్యమైన తత్వాన్ని ఉపదేశించాడు. ఇది జీవితంలో తరించి ఇతరులకి చెకోవ్ ఉపదేశించిన తారకమంత్రం. దీన్ని ఒక్క మాటలో చెప్పాలంటే 'నిర్లక్ష్యం'. "ఏదీ మనసుకి పట్టించుకోకు. తామరాకుమీది నీటిబొట్టులాగా జారిపోతూ వుండాలి. లేకపోతే బతకటమే దుర్ఘటం" అంటాడు చెకోవ్. ఈ నిర్లక్ష్యం, ఈ నిర్లిప్తతా మానవుడి ఆధ్యాత్మికజీవనానికి పునాదులు. ఎందుకంటే— జీవితం మనిషిని లెక్కచేయకుండా పోతూవుంటుంది. మనిషికూడా జీవితాన్ని లెక్కచెయ్యకుండా నిర్లక్ష్యంగా కాలం గడపటం నేర్చుకోవాలి అని చెకోవ్ సిద్ధాంతం. ఇదే చెకోవ్ రచనలద్వారా లోకానికి అందించిన సందేశం.

# ప్రాచ్యశిల్పము - దాని ఆదర్శాలు

●

శ్రీ వేలూరి రాధాకృష్ణ

పాశ్చాత్యదేశాల్లో ఎక్కువగా రూపానికే, అనయన విశిష్టత్వానికే శిల్పంలో ప్రాముఖ్యం ఇచ్చి, దివ్యత్వాన్ని స్ఫురింపజేయలేకపోయారు. ఎక్కువగా ఇది గ్రీకుశిల్పంలో కనుపిస్తుంది. మంచి అంగసౌష్ఠవమూ, నగ్నాకారమూ — ఈ పద్ధతి ఐరోపా దేశంలో న్యాయశాస్త్రసంబద్ధమైనది. ఇది అతి పురాతనకాలంనుంచీ అనుస్యూతంగా వస్తూఉన్నది. దీనిని మొదట హెల్లాస్ అవలంబించాడు. తరువాత ఇటలీలో కళాభ్యుదయప్రచారపు సంపర్కంవల్ల పాశ్చాత్యులు కేవలదైహికమైన చిత్రాలనే ముఖ్యంగా శిల్పించి కృషిచేశారు. మన ప్రాచ్యశిల్పాల్లోని విశిష్టత ఏమంటే, వారు రూపించిన శిల్పాలు అంగసౌష్ఠవమంత ప్రాముఖ్యంగా లేక, మనకు ఒక గాఢమైన ఆధ్యాత్మికదృష్టిని కలుగజేసినవి. క్రీస్తుకు పూర్వం ఆరవ శతాబ్దంలో, ఐహికభావాలను కలిగించే శిల్పాలను రూపించటం ఫిడియస్ స్కోపాస్‌తో ప్రారంభమై ఇరవయ్యో శతాబ్దంలో అగస్టేరోడాన్ వరకు కొనసాగింపబడి, మనకు వారి అతిమేధస్సును తెలియజేస చక్కని సంతుష్టిచెందిన మనస్సుతో మనల్ని శాంతిపరుస్తుంది. కాబట్టి ఈ శిల్పనిరూపణవిధానం అతిప్రాచీనం కానీ, మాధ్యమికం కానీ, నవీనం కానీ వారి మేధస్సునే తెలియజేస్తుంది. కాని మన ప్రాచ్యశిల్పులు, పాశ్చాత్యుల మేధాయుతవిశిష్టత్వాన్ని పొందామనుకున్నప్పటికీ, వారి కేవలమేధస్సును ప్రదర్శించుకోవటంకోసం గురి పెట్టుకోలేదు. వారి దృక్పథం అంతకన్న అతీతమైన, భావోద్రేకమైన దివ్యత్వాన్ని ఆదర్శించింది. ఆ శిల్పప్రదర్శనంవల్ల మనిషి కేవల శిల్పచాతుర్యంచేతనే తృప్తిపొందడు. దాని నిగూఢమైన భావాన్ని తెలిసికోయత్నిస్తాడు.

కాని పాశ్చాత్యదేశంలో అది కాదు. ప్రతివాడూ తన మనోభావాన్ని కల్పించుకొని, నిత్యభోజనానికి అనువైన శ్రమ చేస్తాడు. ఆ శ్రమ చేసినతరువాత మనస్సుకు ఆహ్లాదకరమైన పరికరం ఒకటి కావాలి. ఆ పరికరం ఐహికానందాన్నివ్వాలి. అందువల్ల అక్కడి శిల్పులు దృష్టిలో పెట్టుకుంది అదే: శ్రమజీవికి ఆనందాన్నిచ్చే అంగసౌష్ఠవం కల శిల్పాలని తయారుచేసి, వాటి కాహ్లాదాన్ని కలిగించటం. ఆ పద్ధతి, నిత్యమూ ముందుకురికే దేశంలో వారి విశ్రాంతిసమయంలో జనసత్వాల నిచ్చేదీ అట్టి అంగసౌష్ఠవమూ, దైహికప్రాముఖ్యమూ గల శిల్పాలే. మన మనోవృత్తి దానికి పూర్తిగా వ్యతిరేకం. మనం ఎండలో పని చేసిచేసి ఉంటటంవల్ల మనకు ఈ దేహాంబంధమైన సుఖానందముల కాలక్షేపం కాదు. దివ్యమైన భావోద్రేకంవల్ల, నిస్త్రాణ పొందిన మనస్సుకి కొంత శాంతం వస్తుంది. మన శిల్పంయొక్క విశిష్టత అది.

అందువల్ల పవిత్రభావాలు కల మా మూలు ప్రాముఖ్యానికి పాశ్చాత్యశిల్పంలో అర్థం కనుపించదు. అలాగే పాశ్చాత్యులకికూడా మన శిల్పం, బహుళమైన హస్తపాదములతో ఉండటంవల్ల ఆకర్షణ కలుగకపోగా అర్థరహితంగా గోచరిస్తుంది. శిల్పపు భావోద్రేకప్రబోధము మనలను సరసం చేస్తుంది. అది మన జీవితానికి ఆటపట్టు. అది లేకపోతే మన జీవితమే లేదు. గ్రీకు శిల్పంలోని విశ్వసార్థకమైన ఆ నగ్నవిగ్రహాలు — వీనస్, అపోలో — అర్థరహితమైన అసభ్యప్రదర్శనంగా మనకు తోస్తుంది. మనకు వాటివల్ల ఆధ్యాత్మికమైన చింత కలుగకపోగా ఏహ్యభావం కలుగుతుంది. బౌద్ధులు అనుకున్నట్లు సౌందర్యం, నగ్నత్వం ఇవన్నీ

నరకలోకానికి దారి అని మనవాళ్ల భావన. ఈ రెండింటికీ మానవానీకంయొక్క అత్యద్భుత శిల్పపు ఆదర్శాలను అత్యంతవ్యతిరేకమైనా, ఎప్పటికీ సామరస్యం కుదరకుండా పోయింది. గ్రీకులకు, ఎంత కాదన్నా బాహ్యసౌందర్యమే ముఖ్యాదర్శం. అందువల్ల వారి శిల్పదేవాలయాల్లో ఆ ఆదర్శాన్నే ప్రధానంగా ఆరాధన చేశారు. కాని మనకు భావోద్రేకం కల ఆధ్యాత్మిక చింత జీవితపరమావధి. దానికి ప్రతినిధిగా ఏవిధమైన విగ్రహారాధనకుకూడా ఒకప్పుడు లెక్క చేయలేదు. కాబట్టి, ఉభయుల గమ్యములు వేరు. ఆదర్శములు వేరు. ఇవి ఎప్పటికీ ఏకీభవించవు. సామరస్యాన్ని పొందని పంథాలలో నడుస్తున్నాయి. పాశ్చాత్యశిల్పి ప్రాచ్యుల భావాలని అనుకరిస్తున్నాననడు. మన ప్రాచ్య శిల్పి ఏ గ్రీకుశిల్పినీ తన ఆచార్యుడుగా తలపలేడు. కాని వారి శిల్పానుకరణ కాని, ఈ రెండూ వ్యతిరేక భావాల కలయిక గాని అరుదుగా జరిగినా, అది కేవలఅసభ్యంగానూ, వికృతంగానూ తయారయింది. పాశ్చాత్యశిల్పసంపర్కంవల్ల శిల్పాంతం అయోబదులు అర్థవిహీనమైంది. దీనికి తార్కాణములు గాంధారశిల్పములు, ముఘల్, [illegible] మిశ్రమమైన చిత్రాలూ రవివర్మచిత్రాలూ ఇంకా వున్నాయి.

* * *

తథాగతుడైన బుద్ధునిచేత చెప్పబడిన ప్రాచీన బౌద్ధమతము విగ్రహారాధన మనవసగ మని. నిజానికి బుద్ధునివంటి మహామహుడు ఇంతవరకూ అవతరించ లేదు—ఒక్క ఏసుక్రీస్తు తప్ప. ఆయనకూడా బుద్ధునివలె జీవితంలో చివరివరకూ నిష్కామదివ్యజీవితాన్ని గడిపాడు. బుద్ధుడూ, క్రీస్తూకూడా ఒకరికన్నా ఒకరు, దేవుడు రూపం లేనివాడనీ, దానికోసం వృథా ప్రయత్నాలు వద్దనీ, అవి నిరుపయోగమైనవే ననీ బోధించారు. కొంతమంది దివ్యసందర్శనంకోసం పాటుపడుతున్న బ్రాహ్మణులతో సగుణనిర్గుణబ్రహ్మలయొక్క నైజాన్ని విశదీకరిస్తూ, అంధులు చీకటిగదిలో నల్లపిల్లి కోసం వెదకడంమాదిరి దా ప్రయత్నమని మందలించారు. కాబట్టి ప్రథమంలో బౌద్ధమతంలో విగ్రహారాధన లేదు. కాని కర్మవశాత్తూ, బుద్ధనిర్వాణానంతరం ఆయనమతస్థులు విగ్రహారాధన చేయటం ప్రారంభించారు. ఆయనతరువాత శిష్యులచేత ఆయనే దైవవిగ్రహంగా చేయబడి ఆరాధింపబడ్డాడు. ఆ కారణంవల్ల వారు అనేకశాఖలైపోయినప్పటికీ జన్మస్థలంలోనే బౌద్ధమతాన్ని రూపుమాపారు. ఈ బౌద్ధమతాంతర్ధానానికి ముఖ్యకారకులు కనిష్కుని తరువాతి మహాయానులు; వారి కుపకారులు గాంధారశిల్పులు. మనం ఇంతకుపూర్వం ముచ్చటించుకున్నట్లు వారి శిల్పం అధోగతికి తీసికొని వెళ్ళే పద్ధతి. అది వారు మన సార్నాథ్‌ని, బోరోబుదూర్‌ని, అనూరాధపురమును, దక్షిణదేశపు నటరాజుని, జావాలో నాందీచాంకి సింగసారి, ప్రజ్ఞాపారమిత్రులని మన కిచ్చిన ప్రాచ్యశిల్ప శాస్త్రమును అనుసరించేబదులు టోకియోలో, అటు నారెంబర్గులోనూ అవలంబించిన విగ్రహశాస్త్రరీతిని అవలంబించారు.

* * *

బుద్ధుని అనుయాయులలో ప్రాచీనులు, అంటే హీనయానాన్ని అనుగమించినవారు, వారి గురుదేవుని రక్తమాంసములలో నిరూపించటానికి భయపడ్డారు. సార్నాథ్ మృగదావంలో, ప్రప్రథమమున బోధిస్తూ మహాసంబుద్ధిని పొందినట్లుగాని, కుసినగరంలో రెండు సాలవృక్షములక్రింద మహానిర్వాణాన్ని పొందినట్లుగాని, కపిలవాస్తునుంచి మహాభినిష్క్రమణం చేసినట్లుగాని ప్రతిమలలో, ఆయనజీవితంలోని దృశ్యాలని నిరూపించటంకన్న అశ్వత్థవృక్షంక్రింద కాని, శిరీష వృక్షం క్రింద కాని వట్టి సింహాసనాన్నిగాని, ధర్మచక్రప్రవర్తనానిరూపణ గాని, స్తూపం గాని, ఒక వట్టి గుజ్జంపైన రాజఛత్రం కాని నిరూపించితే అంతకన్న దివ్యత్వాన్నీ, భక్తినీ కలిగించవచ్చని వారి అభిప్రాయం. నిజంగా ప్రాచీనబౌద్ధులు బుద్ధగయవద్దా, బార్హుత్‌వద్దా అద్భుతమైన గ్రాఘులను నెలకొల్పి, సార్నాథ్, సాంచీలవద్దా అద్భుతమైన స్తూపాలని నిర్మించి, బాగ్ పితల్‌ఖోరా, కార్లీ గుహాలలో చైత్యాలను తొలిచి, ఇదివరలో ఎనభై నాలుగుపాళ్లు బుద్ధుడు శరీరాన్ని వీడిన విధంగా, ఈ నశ్వర శరీరాన్ని నిరూపించటం ఉపయోగం లేని పని అని

ఊహించి, ఆ మర్త్యశరీరంలో బుద్ధుణ్ణి రూపించటం మహాపాప మని నిశ్చయించి ఉండటంవల్లనే సర్వవ్యాప్తిని చెందే భావం, ఆయనబోధనలలోని శాశ్వతసత్యములే వారికి కావలసింది కాని ఈ నశ్వరశరీరం కాదు. కాని బుద్ధుని ప్రబోధాలలోని సత్యాన్ని నమ్మిన భారతీయులు, ముఖ్యంగా నాగులు రాళ్లనీ, గప్పలనీ కొలిచే ప్రాథమికపద్ధతినుంచి మారలేకపోవటంచేత, వారికి సరిపోవునట్లు చేయటం కోసం, కాబావద్ద చాలాకాలం కొలిచిన కోగెల్, ఇస్లాంజాతుల సమన్వయంకోసం, ప్రాచీనకాలిఫాలు, ఇస్లాంకతినావలంబనలను తగ్గించవలసివచ్చినట్లుగా మన పెద్దలు మతభాగంగా కొంత కళకి ఒప్పుకోవలసివచ్చినది. అందువల్లే ఈ ప్రాచీనబౌద్ధస్మారకశిల్పాలూ ఆయనజీవితంలో ముఖ్యసంఘటనల నిరూపణలు మాత్రం గాని మరీ ఎక్కువగా కాకే, ఆయన పవిత్ర పాదముల చిహ్నానిరూపణ, అంతే. అంతకు మించి పోలేదు.

పైన నిరూపించిన మహామహాశిల్పాలను నిర్మించిన ప్రాచీనబౌద్ధులు బుద్ధుని మానిషి రూపంలో చిత్రించటం పాపం అనుకొని, ఆ భావనానే ఖండించారు. వారికి మహాసంబుద్ధుని తెలిపే ఏకసింహాసనాన్ని ఒక వృక్షంక్రింద నూపించటం ముఖ్య చిహ్నంగా యెంచారు. అట్లా అనేకరకాల వృక్షాల క్రింద సింహాసనాలని చూపించటంవల్ల, చివరి అవతారమైన గౌతమబోధిసత్త్వునికి పూర్వపు జన్మలకి చిహ్నం అని వారి భావన.

అవిధంగా, అశ్వత్థవృక్షం మాయాశుద్ధోదనులకు జన్మించిన గౌతమబుద్ధునికి చిహ్నం. శిరీషవృక్షము కాకసుందునకు చిహ్నము. న్యగ్రోధవృక్షము కశ్యపునకు చిహ్నము. ఉదుంబరవృక్షము కనకమునికి చిహ్నము. అల్లాగే సార్నాథ్ మృగవనంవద్ద గౌతమబుద్ధుని బోధనలకి చిహ్నంగా 'ధర్మచక్రపరివర్తనం' నిరూపించారు. రౌతులేని గుఱ్ఱంపై రాజఛత్రం కపిలవాస్తును పూర్తిగా విడిచివచ్చుటకు (బుద్ధుడు నిగ్రద్ధుడు కాకమునుపు) చిహ్నం. స్తూపము మహాపరినిర్వాణమునకు చిహ్నము. ఇంకా ప్రాచీనప్రాచ్యశిల్పాలు బుద్ధుని ప్రతిమ లేకుండా, ఆయనజీవితంలోని కొన్ని సన్నివేశాలని మహాచిత్రంగా చిత్రించారు. ఆ విధంగానే బుద్ధుడై, కపిలవాస్తునగరానికి వచ్చి, తండ్రి శుద్ధోదనుణ్ణి దర్శించినప్పుడు, శుద్ధోదనుడు బుద్ధునికి న్యగ్రోధవనాన్ని కానుకగా చదివించే సన్నివేశంలో, బుద్ధుని ప్రతిమ లేకుండా ఒక న్యగ్రోధవృక్షంతో ఆయన ఉన్నట్లు నిరూపించారు. కాబట్టి వీటన్నిటిని బట్టి, ప్రాచీనబౌద్ధులకు బుద్ధుని విగ్రహంగా ఆరాధించటం ఎంత భయమో, ఎంత హేయమో కూడా విశద మవుతుంది. కాని తరువాత తరువాత ఈ భావం లోని పవిత్రత పోయింది. ఎందువల్లనంటే, సంఘంలోని ప్రాచ్యశిష్టాచారసంపన్నులనీ, ఇంకా అనార్యజాతుల్ని నాగులూ, దస్యులూ, యక్షులూ మొదలైన వారిని కలుపుకోటంతో ఈ పవిత్రభావానికి ముప్పు వాటిల్లింది.

అట్టి మానవసంబద్ధమైన బౌద్ధమతము క్రమక్రమేణ మారి సమస్తజనసామాన్యానికీ కావలసివచ్చే మతంగా మారింది. ఈ మతాన్ని అందరికీ తెలియజేయటం కోసం బుద్ధుని జాతకకథలు కావలసివచ్చినవి. వాటి కేవలవర్ణనమే కాకుండా, వాటిని పూర్తిగా చిత్రించి, ఆ చిత్రాలద్వారాకూడా ప్రబోధమూ, ప్రచారమూ బయలుదేరింది. ఈవిధంగా కళద్వారా బౌద్ధమతం ప్రచారం కావటం ప్రారంభించింది. దీనిని ప్రారంభించింది కనిష్కుడు. ఇతని రాజ్యము ఇప్పటి పెషావర్, కాశ్మీర్, ఆఫ్ఘనిస్థాన్ దేశాలు కలిపి. క్రైస్తవమతానికి (కాన్‌స్టాంటైన్) సెయింట్ పాల్ ఎట్లాగో కనిష్కునికి 'అశోకప్రియదర్శి' అలాగ ఆదర్శం. ఈ మత ప్రచారంలో అతను రెండవ అశోకు డయ్యాడు. వసుమిత్రుని అధ్వర్యాన, అతని రాజమాన్యంక్రింద ఒక బౌద్ధమహాసభ జరిగింది. ఇది జరిగినతరువాత, దేశదేశాలకి మతప్రచారకుల్ని పంప నిశ్చయించారు. ఈ ప్రబోధానికి తోడుగా శిల్పం, చిత్రకళాకూడా సహాయంగా తీసికొన్నారు. అప్పటికి బాగా ఆరితేరిన మంచి మంచి శిల్పులనూ, చిత్రకారులనూ వెంట తీసికొని వెళ్ళారు. వెళ్ళిన చోటల్లా బుద్ధునీ, ఆయనజీవితసన్ని

వేశాలనీ లోటులేకుండా చిత్రించారు. కొండ గుహల్లోనూ, మహారణ్యమధ్యంలోనూ, ఇక్కడ వెనక, అక్కడ వెనక ఎక్కడ పడితే అక్కడే చిత్ర వాఙ్మయం తయారుచేశారు. ఆ శిల్పాలే, ఆ చిత్రాలే ఇప్పుడు మనకు మహాసంపద అయింది. ఈ చిత్రాలనే 'గాంధారచిత్రలేఖన' మన్నారు.

బుద్ధుడు మహాపురుషచక్రవర్తి కొట్టి, ఆయన యందు ముప్పయిరెండు మహాపురుషలక్షణాలు ఉన్నయ్యన్నారు. ఆ శరీరము పూర్తిగా పురుషలక్షణమైనదీ కాదు. పూర్తిగా స్త్రీలక్షణమైనదీ కాదు—రెండింటినీ సమన్వయించుకున్న శరీరము. స్త్రీకున్న సౌందర్యమూ, పురుషున కున్న బలధైర్యస్థైర్యములతో మిళితమైనది. ఆయనఛాయ బంగారమూ, దంతమూ కలిపితే వచ్చు ఛాయ. శిరీషపుష్పదళమువలె సుకుమారమైనది. ముఖము పద్మమువంటిది. శుక్లపక్షమునందు ఉన్న చంద్రుని తీరు కలది. కళ్లు అరవిరిసిన పద్మములవంటివి. ఆజానుబాహువు. పాదములు పద్మమువలె ఎఱ్ఱనైనవి. ముక్కుమీద నిత్యానందాంకుని శీలి కలవాడు. గిరజాలు తిరిగిన కేశములు కలిగి తల కిరీట సోపాన్నిస్తుంది.

క్రమక్రమంగా శిల్పకళకూడా మతంతోపాటు పాకింది. కాని ఆ మతప్రచారంలోని శక్తి పూర్తిగా నశించింది. దాని పూర్తి నిబంధనలు సడలిపోయినయ్. ఆయన జీవితకథలని ఏ లోహంలో చిత్రించనీ, ఏ చెక్కమీద చిత్రించనీ చివరికి అర్థవిహీనమైంది. గ్రీకులు వారి సౌందర్యవాదర్శాలను మన ప్రాచ్యభావ యావాదర్శాలతో మిళితంచేశారు. కొంతకాలం ఇలా చిత్రించడానికి తంటాలు పడినతరువాత, వారి కిక చేతకాక, వారికి కిది చేతకాని అసాధ్యమైన పని యనుకొని మానేశారు. వారు అట్లా ప్రయత్నించి, మన కిచ్చిన శిల్పాలు బుద్ధులు, బోధిసత్వులు, ఇంద్రుడు, బ్రహ్మ, కుబేరుడు మొదలైన దేవతలు. చక్కగా కండరాలు తిరిగి ఇంత లావుగా అసహ్యంగా కనిపిస్తాయ్. వాటి వస్త్రధారణం మళ్లా మన ప్రాచ్య రీతిన! ఈవిధంగా, చైతన్యం లేని కండరములు కల గ్రీకుబుద్ధశిల్పంతో అసలు శిల్పకళకే అపార్థం వాటిల్లినది.



# ద్రవ్యోల్బణ సమస్య - దాని పరిష్కారము

శ్రీ చావలి వెంకటహనుమంతరావు

మన దేశములో ద్రవ్యోల్బణ సమస్య కొంత కాలమునుండి ప్రభుత్వమును, ప్రజలనుకూడ ఎక్కువ కలవరపెట్టుచున్నది. ప్రజాసామాన్యము యొక్క జీవితఖర్చు అపరిమితముగ పెరుగుటవలన వారి జీవితభారము హెచ్చుచున్నది. ౧౯౩౯-౪౦ లో నున్న వస్తువులధరలతో ఈ రెండుమూడు సంవత్సరములలోని వస్తువులధరలు పోల్చిచూచిన, ౩ రెట్లు నుంచి ౪ రెట్లవరకు ఈ ధరలు పెరిగినట్లు తెలియగలదు. వస్తువుల ధరలు పెరుగుట యనగా డబ్బుయొక్క విలువ తగ్గుట యన్నమాట. ఇదివరకు ఒక కుటుంబమునకు ౩౦, లేక ౪౦ రూపాయలు ఖర్చగుచున్న ఆ కుటుంబమునకే ఇప్పుడు ౧౦౦ లేక ౧౧౦ రూపాయల ఆదాయ మున్నకాని ఇదివరలో జరిగినట్లు సంసారము జరుగుట కష్టమన్నమాట. అన్ని కుటుంబములలోను సరిగా ఇట్లే, ఇన్ని రెట్లే ఖర్చు పెరిగినదని కాదు; కాని సగటున దాని ఫలిత మిది. కొన్ని కుటుంబములలో ఇదివరలోకన్న కొన్ని ఖర్చులు తగ్గింపబడవచ్చును; లేక ఇతరవిధముల వారి జీవిత ఏర్పాట్లు మార్పుచెందియుండవచ్చును. ఈ విధముగ వస్తువులధర, జీవితఖర్చు పెరుగుటవలన ప్రజాసామాన్యములో ఆర్థికదుస్థితి రోజురోజుకు పెరిగిపోవుచున్నదని మాత్రము గ్రహించవలెను. ఈ పెరుగుదలకు అనేక కారణము లుండవచ్చును, ఉన్నవి; కాని ద్రవ్యోల్బణము దాని కొక ప్రధానకారణమని ఖండితముగ చెప్పవచ్చును.

## ఆశ — నిరాశ

యుద్ధానంతరము ఆర్థికపరిస్థితులు మరల చక్కబడి యుద్ధపూర్వపు పరిస్థితులు క్రమేణ ఏర్పడునని చాలమంది ఆశించియుండిరి; కాని ఆ ఆశలు ఫలించలేదు. యుద్ధానంతరము ఇంకను ఏ దేశముకూడ తన పూర్వస్థితికి రాలేదు. పరిశ్రమలు పునరుద్ధరింపబడి, వస్తువుల ఉత్పత్తి ఎక్కువగ పెరిగియుండలేదు. కాని యుద్ధసమయములోను, యుద్ధానంతరము ఈ రెండుమూడు సంవత్సరములలోను కొంతమందిదగ్గ డబ్బు ఎక్కువ కూడుటయు, వర్తకులకు, సేద్యగాండ్రకు, మిల్లులు ఫ్యాక్టరీలలో పనిచేయువారికి ఎక్కువ ఆదాయము పెరుగుటయు జరుగుచున్న విషయము. ఈరాబడి ఎక్కువవలన, కొనదగు వస్తువులు తక్కువగ నుండుటవలన వస్తువులధరలు హెచ్చిపోవుటయు, డబ్బున్నవారు వస్తువులను హెచ్చుధరలకైనను కొనుటకు సిద్ధముగ నుండుటయుకూడ జరుగుచున్న విషయమే. ఈ విధముగ ద్రవ్యోల్బణసమస్య మన దేశములోనేకాక ఇతర దేశములలోకూడ ప్రభుత్వములను, ప్రజలను కలవరపెట్టు సమస్యగా నున్నది.

## పెద్దల శ్రద్ధ, సలహాలు

ఈ సమస్య తీవ్రరూపము దాల్చి, దేశములో ఆందోళన హెచ్చయినతరువాత ప్రభుత్వమువారు, ఆర్థికశాస్త్రవేత్తలు, రాజకీయపక్షములవారు అందరును కూడ దీనిని గురించి శ్రద్ధ వహించుట మొదలుపెట్టిరి.

దాని పరిష్కారమునకై వివిధపార్టీలవారు చేసిన సలహాలను తరచిచూచిన, వారి సూచనలలో కొన్నింటిపై సర్వాంగీకార మున్నట్లు తెలియును. ఈ విధముగ అందరు అంగీకరించిన పరిష్కారపద్ధతులలో ఇవి ముఖ్యమైనవి: పరిశ్రమల ఉత్పత్తి నెక్కువచేయుట; ప్రజలకు ముఖ్యావసరములగు వస్తువులపై కంట్రోళ్లను తిరిగి ఏర్పాటుచేయుట; రాష్ట్రప్రభుత్వములు మద్యపాననిషేధకార్యక్రమమును ఆపుచేయుట; కేంద్ర రాష్ట్రప్రభుత్వములు అనవసరఖర్చులను తగ్గించుట; ప్రజల చేతులలో తిరుగుచున్న అదనపుడబ్బును తగ్గించుట; విదేశములనుండి అవసరమగు వస్తువుల దిగుమతికి ప్రభుత్వము ఏర్పాట్లు చేయుట.

పై కార్యక్రమము అన్ని పక్షములవారును సూచించినదై యుండగా, పరిశ్రమాధికారులు, ఆర్థికవేత్తలు, సోషలిస్టుపార్టీవారు మరికొందరు ప్రత్యేక సూచనలను ప్రభుత్వమునకు నివేదించియుండిరి. ఆర్థికశాస్త్రవేత్తలు చేసిన సూచనలలో ప్రత్యేకముగ గమనింపదగినవి కొన్ని కలవు. వ్యాపారలాభములపై పన్ను హెచ్చుచేయవలెననియు, పారిశ్రామికలాభములను ఇంతకంటె ఎక్కువ యుండకూడదని నిర్ణయించవలెననియు వీరు సూచించియుండిరి. కాని పారిశ్రామికాధికారులు చేసిన సూచనలలో పరిశ్రమలపైనను, లాభములపైనను పన్నుల భారము తగ్గినగాని ఎక్కువ వస్తూత్పత్తికి పరిశ్రమలలో పెట్టుబడిపెట్టుటకు తమకు ఉత్సాహము కలుగదనియు, కార్మికులు ఎక్కువ కాలము పనిచేయుట కంగీకరించవలెననియు, ప్రభుత్వమువారు నిర్ణయముచేసిన ౧౦ సంవత్సరముల పారిశ్రామికప్రణాళికలో మార్పులు చేయబడవలెననియు మరికొన్ని సూచనలను చేసియుండిరి. ఈ వివిధసూచనలు చేసినవారు వారివారి ప్రత్యేకసంస్థల అభిప్రాయములను వ్యక్తీకరించిరేకాని పూర్తిగ ప్రజాక్షేమమును మనస్సునందుంచుకొని నివారణోపాయములనుసూచించిరని చెప్పుటకు వీలులేకున్నది. వీటి నన్నింటిని సమన్వయించి, ప్రజలకందరకును బాధ్యులగు ప్రభుత్వము వారు ఒక స్థిరమైనట్టియు, దేశక్షేమదాయకమైనట్టియు ప్రణాళికను తయారుచేసి అమలునందుంచుట అతి ముఖ్యము.

## మరవరాని విషయము

ఇవన్నియు అటుంచి ప్రస్తుతసమస్యకు సంబంధించిన కొన్ని ప్రధానవిషయములు జ్ఞాపకముంచుకొనినచో, ముందుగా చేయవలసిన పను లేవి, నెమ్మది మీద చేయదగినవేవి అను విషయము నిర్ణయించుటకు వీలగును. ఈసమస్యకు ఈమధ్య వచ్చిన తొందర, ఇంత ప్రాధాన్యము కల్గుటకు కారణము ప్రజాసామాన్యమునకు కావలసిన తిండి, గుడ్డ, ఇతరవస్తువులకు విపరీతముగ ఖరీదు పెరుగుట, ఉన్న వస్తువులైనను అందరికి అందుబాటులో నుండకుండ నల్లబజారు (black market) లో హెచ్చుధరలకు అమ్ముడుపోవుట. ఈ విధముగ ధరలు పెరుగుటవలననే గవర్నమెంటు ఉద్యోగస్థులకు, కార్మికులకు, ఇతర నెలజీతములను పుచ్చుకొనువారికి కరువుభత్యములు, ప్రత్యేకజీతములు మొదలగునవి ఏర్పాటుచేయవలసిన అవసరమగుచున్నది. ధరలు ఇంకను హెచ్చుచున్నవని కారణము చెప్పి కార్మికనాయకులు ఇంకను కార్మికుల వేతనముల నెక్కువచేయవలెనని పదేపదే కోరుట, అది సమకూడనప్పుడు సమ్మెలను ప్రోత్సహించుటకూడ జరుగుచున్నది. ఈవిధమైన కార్మికఅశాంతిని కారణముగ తీసికొని పరిశ్రమాధికారులు ప్రస్తుతసందర్భములో తమ బాధ్యతలను నిర్వర్తించుటకు పూనుకొనకుండ యున్నారు. ఈ సమస్యలన్నియు ఒకదాని కొకటి దగ్గరి సంబంధము కలవై యున్నట్లు పైన చెప్పినదాని వలన తేలుచున్నది; కాని వీటి కన్నింటికి మూల కారణము వస్తువుల ఖరీదు, జీవితఖర్చు పెరుగుదల.

## కర్తవ్యము

ఈ మూలకారణమును ఛేదించవలెనన్న చేయవలసినది: ఒకటి, వస్తువులను ఎక్కువగ తయారుచేయుట; రెండు, ప్రజలకు అవసరమగునట్టి వస్తువులు సరసమైన ధరలకు విరివిగా దొరకునట్లు ఏర్పాటుచేయుట. ఈ విధముగ చేయవలెనన్న ముఖ్యఅవసరములపై కంట్రోలు ఏర్పాటుచేయుట తప్పనిసరి. ప్రజలకు ముఖ్యముగ కావలసిన వస్తువులు తిండి, గుడ్డ, వాటితరువాత నిత్యజీవనమందు అవసరమగు ఇతరవస్తువులు-సోపు, నూనె,

కాగితములు, కలములు మొదలైనవి. ఇంతవరకు ఎక్కువ ఆహారధాన్యములను తయారుచేయుట కేర్పరుపబడిన పథకములు ఎక్కువ జయప్రదముగ కొనసాగుటలేదని ఇండియా ప్రభుత్వపు ఆహారమంత్రి మొదలుకొని అందరును అంగీకరించినదే. పండుచున్న ధాన్యమైనను, కట్టుదిట్టమగు సరఫరామార్గములు లేమిచే కొంత, వర్తకుల యొక్క లాభముల దురాశవలన కొంత, ప్రజాసామాన్యమునకు సరసమైన ధరలకు దొరకుట లేదు. బియ్యపు కంట్రోలు రద్దుచేసినతరువాత బియ్యములో బ్లాక్ మార్కెట్ పద్ధతి విపరీతముగ పెరిగిపోయినది. అదే విధముగ మిల్లుగుడ్డపై కంట్రోలు ఎత్తివేసినతరువాత గుడ్డలధర విపరీతముగ హెచ్చిపోవుట, దాని పర్యవసానముగ తిరిగి కంట్రోలు ఏర్పాటుచేయుట జరిగినది. కంట్రోలు ఏర్పాటుచేయుటతో ప్రభుత్వమువారి పని పూర్తియైనదని తలచుట పెద్ద పొరబాటు. దానిని ఏర్పాటుచేయుటకన్న కంట్రోల్ పద్ధతి సరిగా, ప్రజాసామాన్యమునకు లాభదాయకముగ పనిచేయునట్లు చూచుట చాల ముఖ్యమైన సంగతి. ఇట్లు కంట్రోలు చేయబడిన వస్తువులు అందరకును కష్టము లేకుండ దొరుకునట్లు చేసినప్పుడే కంట్రోలుపద్ధతిలోని లాభము ప్రజలు పొందుదురు. లేకపోయిన వాటివలన ఎక్కువ నష్టమే కాని లాభ ముండదు. ఈ విషయములో ప్రభుత్వములపై పెద్ద బాధ్యత కలదని వారు గ్రహించవలసియున్నది.

## 'రాక్షసి' సంహారము

దీనికై కావలసినది బ్లాక్ మార్కెట్ పద్ధతులను పూర్తిగ నిర్మూలించుటయే. బ్లాక్ మార్కెట్ పద్ధతి ఇతర దేశములలో కూడ లేకపోలేదు. కాని చైనా మొదలగు దేశములలో బ్లాక్ మార్కెట్ దార్లకు మరణశిక్షయో, లేక ఇతరతీవ్రదండనయో విధించుటకు నిర్ణయింపబడినది. ఇంగ్లండువంటి దేశములో ప్రజాబాహుళ్యముయొక్క అభిప్రాయము బలమైనదిగా ఉండుటచే బ్లాక్ మార్కెట్ వ్యాపారస్థులు తమ వృత్తి లాభకరము కాదని త్వరలోనే గ్రహించ గల్గెదరు. ఏమైనను మన దేశములో ఈ పెద్ద రాక్షసిని నిర్మూలించినకాని మన ఆర్థికస్థితి, ప్రజల కష్టములు గట్టెక్కవని గ్రహించుట అవసరము. దీనికై కేంద్ర రాష్ట్ర ప్రభుత్వములు కంకణము కట్టుకొనవలసిన అవసర మెంతేని కలదు.

## పరిశ్రమాధికారులకు పసిడి సూచన

అటుపై, వస్తూత్పత్తిని హెచ్చుచేయు పద్ధతులను వెంటనే ఆచరణలో పెట్టవలసి యున్నది. మన పారిశ్రామికాధికారులు నిజముగా దేశక్షేమమును కోరువారే యైన, వారు వెంటనే ఇతరసాకులు చెప్పక తమతమ పెట్టుబడులను ముఖ్యములగు పరిశ్రమలను ఏర్పాటుచేయుటకై పెట్టుబడి పెట్టుటకు సంసిద్ధము కావలెను. మన దేశములో అనేకరకములు పరిశ్రమలకు తగు సావకాశము లున్నవని వేరుగ చెప్పనక్కరలేదుగదా? వారు డబ్బు పెట్టుబడివలన తగు లాభములు వచ్చుటలేదు, లాభములు వచ్చినను వాటిని కార్మికులకు కరువుభత్యముల క్రింద, ఎక్కువ వేతనములిచ్చుటలో పంచిపెట్టవలసి వచ్చినచో సంపాదించి ఏమి లాభము? ఇట్టి వాదనలు పరిశ్రమాధికారులు మాని, తమ స్వంతలాభములు కొంత వరకు తగ్గించుకొనుట కంగీకరించియైన ముఖ్య పరిశ్రమలలో పెట్టుబడి పెట్టుటకు సిద్ధపడవలెను. వారంతట వారట్లు సంసిద్ధులై యుండనియెడల, ప్రభుత్వము వారిని నిర్బంధించియైన పెట్టుబడి పెట్టించవలసి యుండును. వారట్లు చేయకపోవుట పరిశ్రమలను ప్రభుత్వాధీనము చేసుకొనవలెనను వాదనకు చేతులార ప్రోత్సాహము చేసినవారగుదురు. ఒక వంక ప్రభుత్వము తన స్వంతయాజమాన్యముక్రిందకు పరిశ్రమలను తీసుకొనువిధానము అపుచేయవలెనని వాదించుచు వేరొక వంక వస్తూత్పత్తికి తోడ్పడు క్రొత్తపరిశ్రమలలో పెట్టుబడి పెట్టక కూర్చొనుటవలన పరిశ్రమాధికారులు ఎవరికిని లాభముచేయుట లేదు. వెంటనే వస్తువుల కొరతను తొలగించుటకై విదేశములనుండి ప్రజాసామాన్యము ఎక్కువగ కోరునట్టి వస్తువులు దిగుమతియగుటకు ప్రభుత్వము శ్రద్ధవహించవలసియున్నది. ద్రవ్యోల్బణము కొంతవరకైన తగ్గించవలెననిన, బజారులలో ప్రజలకు అవసరమగు వస్తువులు విరివిగా నుండునట్లు చేయుట ఒక ముఖ్యమార్గము. మన దేశ పరిశ్రమల ద్వారా ఈ వస్తువులు తయారగుటకు కాలయాపన

స్వలాభపరులును, అధికారోన్మత్తులును, పాకిస్థాన్ తత్వాభిమానులును అగు లైకతాలీమంత్రివర్గమువారి యొక్కయు, రజాకార్ల నాయకుడగు కాశింరజ్వీ యొక్కయు మాటలకు లొంగిపోయి నైజాం ఈ కోరికలను నిరాకరించెను. అందుచేత సైనికచర్య తప్పదయ్యెను. దానిమూలమున ఈ రెండు ఉద్దేశములు నెరవేరగలిగెను. భారతీయసైన్యములు సికందరాబాదులో యథాపూర్వకముగ స్థావరముల నేర్పరచుకొనినవి. రజాకార్ల సంస్థ అక్రమసంస్థ యని ప్రకటింపబడెను.

## హైదరాబాదుభవిష్యత్తు

కాని ఈ రెండును తాత్కాలికోద్దేశములు. మొదటినుండి ఇండియాకును, నైజామునకును విషయాంతరములనుగురించి కదా వివాదములు సంభవించియుండినవి. తక్కిన సంస్థానములవలె హైదరాబాదుకూడ ఇండియాలో చేరి, దేశరక్షణ, విదేశవ్యవహారములు, రాకపోకలకు కావలసిన సదుపాయములు అను మూడు విషయములలో ఇండియాప్రభుత్వమువారికి లోబడవలెననియు, ప్రజాస్వామ్యసిద్ధాంతముల ననుసరించి సంస్థానములో బాధ్యతాయుతప్రభుత్వమును స్థాపింపవలె ననియు ఇండియాప్రభుత్వమువారు నైజామును కోరియుండిరి. కాని అతడు ఇందులో దేనిని చేయుటకును అంగీకరించక సర్వస్వతంత్రుడై ఉండుటకు నిశ్చయించుకొనెను. ఈ సర్వస్వాతంత్ర్యము తనకు సాధ్యము కాదన్న మాటను అతడు గ్రహించినవాడు కాడు. భరతఖండపు మధ్యభాగమున మరియొక పాకిస్థానము ఏర్పడుట భారతీయుల స్వాతంత్ర్యమునకు అత్యంతప్రమాదకర మనియు, అట్టిది ఇండియాప్రభుత్వమువారు ఎన్నటికిని జరుగనీయరనియు అతడు తెలిసికొనజాలడయ్యెను. వారవలంబించుచుండిన సామమార్గమునకు వారి పిరికితనమును, చేతకానితనమును కారణము లని అతడు దురభిప్రాయపడెను. ఇదిగాక కొంత కాలయాపన జరిగినయెడల పాకిస్థానము తనకు బహిరంగముగ సహాయము చేయగల దనియు, ఇంగ్లీషువారు బహిరంగముగ కాకపోయినను రహస్యముగ సహాయము చేయుదు రనియు అతడు విశ్వసించియుండెను. అందుచేత ఇండియాకును, నైజామునకును ఏర్పడిన వివాదము పరిష్కారము కాజాలదయ్యెను. దుర్యోధనునికి శకునివలె నుండిన లైకతాలీ, కాశింరజ్వీ మొదలైనవారు పదభ్రష్టు లగుటచేతను, ఇండియాసైన్యముల బలము తన సంస్థానములో సుస్థిరముగ నాటుకొనుటచేతను నైజాం ప్రస్తుతము ఇండియాప్రభుత్వమువారి సూచన లన్నిటిని అంగీకరించకతప్పదు. తక్కిన సంస్థానములవలె హైదరాబాదుకూడ ఇండియాలో చేరుటయు, ప్రజాస్వామ్యసిద్ధాంతముల ననుసరించి బాధ్యతాయుతప్రభుత్వము అచ్చట స్థాపనమగుటయు తప్పవు. ఈ రెండు పనులు పూర్తియగువరకు సంస్థానపరిపాలన నైజాంచేతులలోగాక ఇండియాప్రభుత్వమువారి చేతులలోనే ఉండవలెను.

## హైదరాబాదు ఇండియాలో చేరుట

హైదరాబాదుకు ఇండియాలో చేరుటతప్ప గత్యంతరము లే దన్నమాట నిర్వివాదాంశము. హైదరాబాదు ఇండియాలో చేరినగాని ఇండియాకు శాంతిభద్రతలు చేకూరజాల వన్నమాటకూడ నిర్వివాదాంశమే. ఇట్లు జరుగుటయే ధర్మము, న్యాయము. కాని ప్రజాభిప్రాయము కనుగొనినపిమ్మటగాని హైదరాబాదు ఇండియాలో చేరు విషయము నిర్ణయము కావలసిన అవసరము లేదని నెహ్రూప్రభుత్వమువారు పదే పదే చెప్పుచుండిరి. ఇప్పుడుకూడ అట్లే చెప్పుచున్నారు. కాని ఈ విషయములో ప్రజాభిప్రాయము ప్రత్యేకముగ ఓట్లద్వారా కనుగొనుట అవసరమా ? అన్న విషయమునుగురించి కొంత ఆలోచించవలసియున్నది. భరతఖండములోని ఇతరసంస్థానము లన్నియు ఇండియాలో చేరు విషయమున ప్రజాభిప్రాయమును కనుగొనవలె నను సూత్రమును మన ప్రభుత్వమువారు అనుసరించలేదు. పరిపాలకుల అనుమతిమీదనే ఇట్టిది జరిగెను. హైదరాబాదువిషయములోకూడ పరిపాలకుడగు నైజాంఅనుమతిమీదనే ఇది జరుపుటలో ధర్మవిరుద్ధము ఎట్టిది ఉండదు. కనుక ప్రజాభిప్రాయమునకై వేచియుండక వెంటనే నైజాం

అనుమతిమీద హైదరాబాదును ఇండియాలో చేర్చు కొనుటయే ఉత్తమమార్గము. అట్టి ఒడంబడికను అంగీకరించుటకు నైజాం ఇప్పుడు సర్వసిద్ధుడై ఉన్నాడు.

## ప్రజాభిప్రాయము

ఇందువిషయమై హైదరాబాదుసంస్థానములోని ప్రజల అభిప్రాయమును కనుగొనదలచుటలో అనేక కష్టము లున్నవి. ఈ ప్రజలు ఎంతో వెనుకబడి యున్నారు. మొగలాయీల పరిపాలనకాలమందు—అనగా ౨౦౦ సంవత్సరములకు పూర్వము—ఎట్టి స్థితి యందుండిరో అట్టి స్థితియందే వారిప్పుడున్నారు. ఇది గాక సంస్థానమందు ప్రస్తుతము శాంతిభద్రతలు పూర్తిగ స్థాపితములు కాలేదు. ఇవి స్థాపితములగుటకు ఒక సంవత్సరమైనను పట్టును. రజాకార్లు పల్లెటూళ్లలో ఇంకను ఉన్నారు. వీరిని పట్టుకొనుటకు ఎంతో ప్రయత్నము కావలసియున్నది. వీరు గాక, ప్రజలను భీతావహుల జేసినట్టి దొంగలున్నూ ఉన్నారు. వీరితోపాటు కొన్ని జిల్లాలయందు—ముఖ్యముగా తూర్పుభాగములోని ఆంధ్రజిల్లాలలో—కమ్యూనిస్టుల ప్రాబల్యము హెచ్చుగా ఉన్నది. వారి చర్యలుకూడ శాంతిభద్రతలకు విరుద్ధములుగ నున్నవి. గతసంవత్సరము మధ్య సంస్థానములో అరాచకము ప్రబలిన కారణముచేత దొంగలు, దారిదోపిడిగాండ్రు పెరిగిపోయిఉన్నారు. వీరందరిని అణచి క్రమపరిపాలనము స్థాపించినతర్వాత గాని ప్రజాభిప్రాయము కనుగొనుటకు సాధ్యముకాదు. కనుక ఇందుకై వేచియుండక, నైజాంఅనుమతిమీద తక్కిన సంస్థానములవలె హైదరాబాదుసంస్థానమును కూడ ఇండియాలో వెంటనే చేర్చుకొనుటయు, చేరినట్లు ప్రకటించుటయు అత్యావశ్యము. కాలయాపన చేయుటలో అర్థములేదు; ప్రమాదముకూడ సంభవించవచ్చును. ఇట్టి ఒడంబడికకు నైజాము అనుమతించనియెడల ప్రజాభిప్రాయమును కనుగొనుటకు ప్రయత్నించవలసినదేగాని ప్రస్తుతము అట్టి మార్గము ననుసరించుట అనవసరము.

## కమ్యూనిస్టుల వైఖరి

ఈ సందర్భములో కమ్యూనిస్టుల వైఖరిగూడ గుర్తింపదగియున్నది. నైజాంలోని ఆంధ్రజిల్లాలలో మూటియందు వీరు తమ ప్రాబల్యమును స్థిరపరచుకొని నట్లును, సుమారు వేయిగ్రామములు వీరి వశమం దున్నట్లును తెలియుచున్నది. హైదరాబాదు ఇండియాలో చేరువిషయమున ప్రస్తుతము కమ్యూనిస్టులు ఒక వింతవాదమును ప్రతిపాదించుచున్నారు. నెహ్రూప్రభుత్వము, కాంగ్రెసు సంస్థయు సాహుకార్లయందు దక్షిమానము కల వనియు, సామాన్యప్రజల యోగక్షేమములను అభిలషింపనివనియు, ఇట్టి సందర్భములో హైదరాబాదు ఇండియాలో చేరుటవలనను సంస్థానములో దారిద్ర్యబాధను అనుభవించుచుండు కర్షకులు, కూలివాండ్రు సాహుకార్లకు దాసులగుటయే అనియు, ఆ కారణముచేత హైదరాబాదు ఇండియాలో చేరక సర్వస్వాతంత్ర్యము ననుభవించు రాజ్యముగ నుండవలెననియు వారి ప్రచారము. సుమారు ఒక సంవత్సరముగా వారిట్టి ప్రచారమును చేయుటయేగాక, ఈ ౧,౦౦౦ గ్రామములలో వారు విప్లవమార్గము ననుసరించి భూస్వాములను భూములనుండి తొలగించి తమ అధికారమును స్థిరముగ స్థాపించుకొనియున్నారు. రజాకార్లు అనేకులు వారి ఆయుధములను కమ్యూనిస్టులకు ఇచ్చివేసిరనికూడ తెలియుచున్నది. కనుక ఈ జిల్లాలలోని కమ్యూనిస్టులను, వారి ప్రచారమును అణచివేసినగాని ప్రజల నిజమైన అభిప్రాయమును కనుగొనుట కష్టము. ఈ పని పూర్తియగుటకు చాలకాలము పట్టును. ఈ కారణముచేతగూడ హైదరాబాదు భవిష్యత్తును ప్రజాభిప్రాయమును కనుగొనినతర్వాతగాని నిర్ణయించుటకు వీలులేదన్న వాదమును మన ప్రభుత్వమువారు వదలుకొనుట మంచిది.

## కమ్యూనిస్టుల ఉద్దేశము

ఒక హైదరాబాదులోనేగాక ఇతరప్రదేశములందు కూడ కమ్యూనిస్టులు ప్రస్తుతము ఇట్టి వాదమునే అనుసరించుచున్నారు. మన దేశములో బ్రిటిషు ప్రభుత్వము తొలగిపోయినతర్వాతగూడ పరాయిప్రభుత్వమునకు లోబడిన ప్రదేశములు కొన్ని ఇప్పటికిగూడ ఉన్నవి. ఫ్రెంచివారికి లోబడిన పుదుచ్చేరి మొదలైన అయిదు పట్టణములు, పోర్చుగీసువారికి లోబడిన

గోవా మొదలైన మూడు పట్టణములు ఇట్టివి. సర్వస్వాతంత్ర్యము గల హైదరాబాదు మన దేశమునకు మధ్యన ఉండుటచేత ఎంత ప్రమాదమో పరాయి ప్రభుత్వమునకు లోబడిన ప్రదేశము లిట్టివి ఉండుట వలన కూడ అంత ప్రమాదము ఉన్నది. ఇవన్నియు ఇండియాలో చేరినగాని మనకు సంపూర్ణస్వాతంత్ర్యము లభించినదని అనుకొనుటకు వీలులేదు. పరాయిప్రభుత్వములతో రాయబారములు జరిపి వీటిని మన ప్రభుత్వముక్రిందికి తెచ్చుకొనుట సక్రమమైన మార్గము. ఫ్రెంచిపట్టణములనుగురించి ఇట్టి రాయబారములు ఇంతకుముందే జరిగినవి. ఈ పట్టణములలోని ప్రజల అభిప్రాయమును ఈ విషయములో కనుగొని దానినిబట్టి వీటి భవిష్యత్తును నిర్ణయించవలసినదిగా నెహ్రూప్రభుత్వమువారు అంగీకరించిరి. ప్రస్తుతము ఈ ప్రజాభిప్రాయమును కనుగొనుటకు ఏర్పాటులు జరుగుచున్నవి. ఈ సందర్భములోగూడ కమ్యూనిస్టులు నెహ్రూప్రభుత్వమునకు విరోధముగ ప్రచారముచేయుచు, ఈ పట్టణములు ఇండియాలో చేరకూడదని ప్రజలకు దుర్బోధలు చేయుచున్నారు. ఫ్రెంచిపాలనమందే ఈ ప్రదేశము లుండుట ఉత్తమమని వారి వాదము. ఇట్టి వాదమును చేయుటలో ఒక అంతర్యమున్నది. ఏదో విధముగ కమ్యూనిస్టుప్రభుత్వమును మన దేశమందు స్థాపించుట వీరి ఉద్దేశము. ప్రపంచమందంతటను కమ్యూనిస్టు ప్రభుత్వములను దౌర్జన్యమూలమున స్థాపించుటకు కంకణము కట్టుకొన్న అంతర్జాతీయకమ్యూనిస్టుసంస్థకు వీరు సంబంధించినవారు. ఇండోనీషియా, మలయా, బర్మాలలో వీ రిట్టి ప్రయత్నములను చేయుచున్నారు. ఇండియాలోకూడ ఇట్టి ప్రయత్నములు చేయుటకు వీరు పన్నాగము కొంతకాలమునుండి పన్నుచున్నారు. ప్రతిదేశములో ఏదోఒక ప్రదేశమున మొట్టమొదట తమ అధికారమును స్థాపించుటయు, క్రమక్రమముగ ఆ కేంద్రమునుండి తక్కిన ప్రదేశములకు తమ అధికారమును వ్యాపింపజేసికొనుటయు వారి వ్యూహములకు ప్రధానలక్షణము. హైదరాబాదులోని తెలింగాణా జిల్లాలలోను, పరాయి ప్రభుత్వమందుండు ఫ్రెంచిపట్టణములందును వా రిట్టి కేంద్రములను స్థాపించుకొనజూచుచున్నారు. ప్రపంచమందంతట కమ్యూనిస్టులకును, కమ్యూనిస్టేతరులకును ప్రచండసమరము జరుగనున్న ఈకాలములో హైదరాబాదునందును, ఫ్రెంచిప్రదేశములందును కమ్యూనిస్టులు సంపాదించినట్టియు, సంపాదింపవలచినట్టియు ప్రాబల్యము ఎట్టి ప్రమాదమునకు కారణమగునో ఊహింపవలసియున్నది. బర్మాలోని కమ్యూనిస్టు లనేకములు ఇప్పుడిప్పుడే మణిపూరుసంస్థానములోనికి, పశ్చిమ బెంగాలులోనికి ప్రవేశించుచున్నట్లు తెలియుచున్నది. ప్రజలను దోచుకొనుట, గ్రామములను కాల్చివేయుట మొదలైన క్రూరకృత్యములను చేయుటలో రజాకార్లకును, కమ్యూనిస్టులకును విస్తారభేదము లేదు. రజాకార్లమూలమున ఎట్టి ప్రమాదము సంభవించనుండెనో అట్టి ప్రమాదమే కమ్యూనిస్టులమూలమున సంభవింపనున్నది.

## శాంతిభద్రతలు

రజాకార్లను, దండార్లను, కమ్యూనిస్టులను, విదేశములనుండి వచ్చి సైన్యములో చేరియుండు అరబ్బీలు, పఠానులు మొదలగువారిని, సాయుధులగు ఇతరప్రజలను నిరాయుధుల జేయుట అత్యవసరము. ఇది జరిగినగాని హైదరాబాదులో శాంతిభద్రతలు ఏర్పడవు. బ్రిటిష్‌పరిపాలనకాలమందు ప్రజలను వారు నిరాయుధుల చేసిరని మనము నిందించిన మాట వాస్తవమే. కాని జాతీయపరిపాలన ఏర్పడిన తరువాత ప్రజలు సాయుధులై ప్రభుత్వమువారిపై తిరుగబడుటకు అవకాశము కలవారు కావలెనని అనుటలో అర్థమేమియు లేదు. ఆధునికకాలపు ఆయుధములు ప్రజల హస్తగతము లగుట ఎంతో ప్రమాదము. ఆయుధముల నుపయోగించు అధికారము ప్రభుత్వమువారి కొలువులో నుండు సైనికులకును, పోలీసులకునుదప్ప మరెవ్వరికి ఉండరాదు. బలప్రయోగము చేయు హక్కు, దౌర్జన్యము నుపయోగింపగల అవకాశము ఒక ప్రభుత్వమునకే ఉండవలెను. రాజ్యాంగనీతికిని, రాజధర్మమునకును ఇది ప్రధానలక్షణము. దీనికి విరుద్ధముగ ప్రజలలో ఎవరుగాని సాయుధులైనయెడల బందిపోటులు, దోపిడీలు, అంతర్యుద్ధములు మామూలగును. ఆధునిక ఆయుధ

లను సంపాదించు విషయములో కమ్యూనిష్టులు విపరీతమైన ప్రయత్నము చేయుచున్నారు. వారిని ఎదుర్కొనుటకు ప్రభుత్వమువారు ప్రయత్నించుటకు బదులు సామాన్యజనులను సాయుధుల జేయుట ఉత్తమమని వాదించువారు లేకపోలేదు. మన సరిహద్దుజిల్లాలలోని ప్రజలను దోచుకొనుచుండిన రజాకార్లను ఎదుర్కొనుటకుకూడ ఇదే మార్గమని అనేకు లిదివరకు వాదించుచుండిరి. కాని ఈ వాదములన్నియు దూరదృష్టితో గూడినట్టివి కావు. ఎన్నటికిగాని ఆయుధములు ప్రభుత్వమువారివద్దతప్ప ఇతరులకడ్డ ఉండరాదు.

## హైదరాబాదుసమస్య పరిష్కారమగుట

హైదరాబాదుసమస్య పరిష్కారమగుటకు కొంతకాలము పట్టునని దీనినిబట్టి మనము ఊహింపవలెను. సికందరాబాదులో మన సేనలు ప్రవేశించుట ఇందులో మొదటి మెట్టు. రజాకార్లను అణచుట రెండవ మెట్టు. అరబ్బీలను, పఠానులను ఇతర విదేశీయులను వారివారి దేశములకు పంపివేయుట మూడవ మెట్టు. కమ్యూనిష్టులను అణచివేయుట నాల్గవ మెట్టు. ఈ పని అంతయు ఇప్పుడు ఏర్పడిన సైనికగవర్నరు పూర్తిచేయవలెను. ఇది పూర్తిఅగువరకు సైనికప్రభుత్వమును రద్దుచేసి ప్రజాప్రభుత్వమును స్థాపించుటకు వీలులేదు. అటుతర్వాత ప్రజల విశ్వాసమునకు పాత్రులైన స్టేట్‌కాంగ్రెసువారుగాని, ఇతరులుగాని అధికారములోనికి రావచ్చును. ప్రస్తుతము స్టేట్ కాంగ్రెసుకు ప్రజలలో ఎంత పలుకుబడి కలదో తెలియదు. వీరుగాక సోషలిస్టుపార్టీవారుకూడ సంస్థానములో పనిచేయుచున్నారు. కాని బ్రిటిష్‌వారు మన దేశమందుండి తొలగిపోవునాటికి మన జాతీయ కాంగ్రెసుకు ఉన్నంత పలుకుబడిగాని, ప్రాబల్యముగాని శ్రీ రామానందతీర్థగారి స్టేట్‌కాంగ్రెసుకును, సోషలిస్టులకును ప్రస్తుతము హైదరాబాదులో లేదు. బ్రిటిష్‌వారి స్థానమున జాతీయకాంగ్రెసునాయకులు అధికారమునకు వచ్చినట్లు లైకతాలీస్థానమున స్టేట్ కాంగ్రెసునాయకులు వెంటనే అధికారములోనికి వచ్చుట ప్రమాదము. వారు సంస్థానమం దంతట పర్యటనము చేసి, ప్రజలలో పలుకుబడి సంపాదించుకొనవలసిన అగత్యమున్నది. అప్పటివరకు ఇండియా ప్రభుత్వమువారు నియమించిన అధికారులే హైదరాబాదును పాలించుచుండవలెను. నైజాము సింహాసనమం దుండవలెనా, భాషాప్రయుక్తరాష్ట్ర విధానము ననుసరించి తెలంగాణా జిల్లాలు ఆంధ్రరాష్ట్రమందును, కర్ణాటకజిల్లాలు కర్ణాటకమందును, మహారాష్ట్రజిల్లాలు మహారాష్ట్రమందును చేరిపోవలెనా— అను విషయములను పరిష్కరించుటకు ఇది సమయము కాదు.

## ఇతర విషయములు

సెప్టెంబరు నెలలో మన ప్రభుత్వమువారు ఎదుర్కొనవలసిన సమస్యలన్నిటిలో హైదరాబాదుసమస్య ఒక్కటే మిక్కిలి ప్రధానమైనది. బట్టలపైననేగాక ఆహారపదార్థములపైనకూడ క్రమక్రమముగ కంట్రోలును స్థాపించుట అవసరమని వారు ఈ నెలలో నిర్ణయించిరి. విపరీతముగ పెరిగిపోవుచున్న ధరలను తగ్గించుటకు ఇదియే ఉత్తమమార్గమని వారిప్పుడు అభిప్రాయపడుచున్నారు. ఇదిగాక ఈ నెలలో భాషాప్రయుక్తరాష్ట్రసంఘమువారు మన రాష్ట్రములో పర్యటనముగావించి ప్రముఖులనేకుల అభిప్రాయములను తెలిసికొనిరి. భాషాప్రయుక్తరాష్ట్రములు కూడదని ప్రముఖు లెవ్వరును చెప్పియుండలేదు. అందరు ఈ సూత్రమును ఒప్పుకొన్నవారే. కాని రాయలసీమకు సంబంధించిన శాసనసభ్యులు, మరికొందరుమాత్రము ఆంధ్రరాష్ట్రనిర్మాణమును వాయిదావేయవలెనని కోరిరి. ఇట్టి నిర్మాణము వెంటనే జరుగవలెనని శాసనసభలో గావింపబడిన తీర్మానమునకు వీరిలో అనేకులు ముఖ్యులుగ నుండినవారు. అయినప్పటికిని వారిప్పుడు అభిప్రాయమును ఏల మార్చుకొనిరో తెలియుటలేదు. హైదరాబాదుసమస్య పరిష్కారమైనగాని ఆంధ్రరాష్ట్రనిర్మాణము జరుగరాదని కొందరు వాదించిరి. కాని ఈ సమస్య ఇప్పుడు పరిష్కారమైనట్లే మనము భావించవచ్చును. కనుక ఈ వాదమునకు ప్రస్తుతము ఎట్టిబలము లేదు. మద్రాసునగరవిషయమై మనవారిలో అనేకులు విభజనను ఆమోదించినట్లు కనబడుచున్నది. కూవంనదికి ఉత్తరమున నుండు భాగము ఆంధ్రరాష్ట్రములోను, దక్షిణమునం దుండు భాగము అరవరాష్ట్రములోను చేరుట మంచిదని వారు సూచించిరి. ఇదియే అనుసరించదగిన మార్గము. ఇట్లు చేసినయెడల ఆంధ్రరాష్ట్రమునకు ఏది ప్రధానపట్టణముగ నుండవలెనను సమస్య పరిష్కారమగుటయే కాక, క్రొత్త ప్రధానపట్టణమును నిర్మించుటకై ఖర్చుపెట్టవలసిన కోట్లకొలది ద్రవ్యము మిగులును. కనుక రాజ్యాంగపరిషత్తువారు ఆంధ్రరాష్ట్ర నిర్మాణము నంగీకరించి, రాజ్యాంగప్రణాళికలో ఉదాహరిం

బడు రాష్ట్రములలో ఆంధ్రరాష్ట్రమునుగూడ చేర్చవలయునని ఆశించుచున్నాము.

## ప్రపంచమం దంతట అశాంతి

ఇది యొక విప్లవయుగము. ఒక ధర్మము మారి మరియొక ధర్మము నిర్మాణమగుటకు కావలసిన సంధికాలము. ఇదివరకు నుండిన ధర్మము చాలవరకు శిథిలమై పోయినది. కాని దాని స్థానమున నిర్మింపదగిన ధర్మము ఎట్టిదిగ నుండవలెనో, దానిని శాంతిమార్గమున స్థాపించుటకుగా, లేక రక్తపాతము గావించి నిర్మించుటకా అన్న విషయములనుగురించి తీవ్రములగు అభిప్రాయభేదములు ఏర్పడియున్నవి. అందుచేతనే ఏ దేశమందు చూచినను అశాంతియే కనుపించుచున్నది. ధర్మవ్యవస్థలు మారవలసివచ్చినప్పుడు రక్తపాతము ద్వారా గాక శాంతిమార్గమున మార్చుటకు అవకాశములు కల్పించు ఉద్దేశముతో రెండవ ప్రపంచ యుద్ధము ముగిసినతర్వాత నానాదేశపు రాజకీయ వేత్తలు ఆలోచించి 'ఐక్యరాజ్యసమితి' నొకదానిని స్థాపించిరి. ఈ సమితికి రెండు ప్రధానాంగములు. ఒకటి మహాసభ; రెండవది భద్రతాసంఘము. సమితిలో సభ్యత్వము వహించిన ౫౮ రాజ్యముల ప్రతినిధులందరు మహాసభలో సంవత్సరమున కథమము ఒక పర్యాయమైనను సమావేశమగుచుందురు. భద్రతా సంఘమునందు అన్నిరాజ్యములకు ప్రాతినిధ్యము లేదు. అగ్రరాజ్యములని ప్రఖ్యాతిగాంచిన బ్రిటన్, అమెరికా, రషియా, ఫ్రాన్సు, చైనాలకు శాశ్వత ప్రాతినిధ్యమున్నది. ఈ అయిదుగురు సభ్యులు కాక, మహాసభవారెన్నుకొనిన మరి ఆరుగురు సభ్యులు— మొత్తముమీద పదకొండుసభ్యులు అందులో ఉన్నారు. ఈ భద్రతాసంఘము ఎప్పుడో ఒకప్పుడు కాక ఎల్లప్పుడు సమావేశమగుచుండును. మహాసభ కంటె ఇదియే ఎక్కువ ప్రాధాన్యము వహించియున్నది.

## ఐక్యరాజ్యసమితి మహాసభ

ఈ మహాసభయొక్క మూడవ సమావేశము సెప్టెంబరు ౨౧ తేదీన ఫ్రాన్సుకు ప్రధానపట్టణమగు పారిస్ నగరములో ప్రారంభమయ్యెను. పరిశీలించవలసిన విషయము లెన్నియో ఉండుటచేత సుమారు మూడుమాసములు ఈ సమావేశము జరుగనున్నది. కాని దీనినిగురించి ఒక అంశమును మరువకూడదు. ఈసభ ఒక ఉపన్యాసవేదిక. పరిశీలింపబడవలసిన విషయములనుగురించియు, ప్రపంచమందు శాంతి వృద్ధియగుటకును, అశాంతి అడుగంటుటకును కావలసిన సాధనములనుగురించియు ఇందు వాదోపవాదములు జరుగును. అనేకతీర్మానములు గావింపబడును. కాని ఈ తీర్మానములను అమలులో నుంచుటకు కావలసిన అధికారము గాని, వసతులు గాని ఈ మహాసభకు లేవు. మూడింట రెండువంతుల సభ్యులు ఆమోదించినగాని ముఖ్యవిషయములనుగురించిన తీర్మానములు చేయుటకు వీలులేదు. ఈ కారణముచేత మహాసభసమావేశములు గంభీరోపన్యాసములకును, వాక్చాతుర్యప్రదర్శనమునకు, పరస్పరప్రశంసకు, విమర్శకును అవకాశము కల్పించుచున్నదేగాని, కార్యరంగమున ప్రాధాన్యము వహించుట లేదు. తీర్మానములు క్రియారూపమును ధరించనంతవరకు ఈ సమావేశములలోని ప్రసంగములకు అంతవిలువ ఉండజాలదు. కాని సభ్యులుమాత్రము అతి ఉత్సాహముతోను, అతిశ్రద్ధతోను ఉపన్యాసములు గావించుచుందురు. ప్రపంచములోని అశాంతికి, యుద్ధసన్నాహములకు, భయమునకు రషియా కారణమని బ్రిటన్ అమెరికాలు, వీరి సామ్రాజ్యకాంక్షయు సాహుకారివిధానమే కారణములని రషియావారు పరస్పరము నిందించుకొనుచున్నారు. ఈ పదిరోజుల సమావేశములలోని ఉపన్యాసముల కిదియే ప్రధాన లక్షణము.

## భద్రతాసంఘము

భద్రతాసంఘము ప్రతిరోజు సమావేశమగుచుండు సంఘము. ఈమధ్య ఇందు చర్చింపబడిన విషయములలో హైదరాబాదుసమస్య ఒకటి. స్వతంత్రరాజ్యములమధ్య సంభవించు వివాదములనుమాత్రమే విమర్శించుటకు ఈ సంఘమున కధికారము కలదు. హైదరాబాదు స్వతంత్రరాజ్యము కాకపోయినను దానికిని, ఇండియాకును మధ్య ఏర్పడిన వివాదమును చర్చించుటకు ఈ సంఘమువారు సిద్ధపడిరి. కోట్లకొలది ద్రవ్యమును ఖర్చుపెట్టి నైజాముయొక్క మంత్రులు విదేశములలో చేయుచుండిన ప్రచారమే దీనికి ముఖ్యకారణము. భద్రతాసంఘమందుండు బ్రిటిష్‌ప్రతినిధుల పక్షపాతముకూడ దీనికి మరియొక కారణము. ఏవిషయమునుగాని పక్షపాతములేక న్యాయముగ విమర్శించవలెనను ఉద్దేశము ఈ సంఘమునకు లేదు. కాశ్మీరు, ఇండొనీషియా మొదలగు సమస్యలను వీ రిదివరకు పక్షపాతబుద్ధితోనే విమర్శించిరి. హైదరాబాదువిషయములో వీరి

నైఖరి ఇట్టిదే. మొట్టమొదట ఫిర్యాదుచేసిన నైజాం తన ఫిర్యాదును వదలుకొనినట్లు తెలియపరచి నను, ఆ విషయమునుగురించిన విచారణను వదలుకొను టకు వీరు అంగీకరించనైరి. నైజాంయొక్క పాత ఏజంట్లు ఖర్చుపెట్టుచుండిన ద్రవ్యమునయొక్కయు, దానిమూలమున జరుగు ప్రచారమునయొక్కయు ఫలి తమే ఇది.

## బర్లిన్ సమస్య

ఈ భద్రతాసంఘము ఇప్పుడు ఒక క్లిష్టతమ మైన సమస్యను పరిష్కరించవలసిన పరిస్థితులు ఏర్ప డినవి. మూడుమాసములక్రిందట బర్లిన్ నగరమును గురించి రషియాకును, బ్రిటన్, ఫ్రాన్సు, అమెరికాల కును మధ్య ఏర్పడిన వివాదమే ఈ సమస్య. గెండవ ప్రపంచయుద్ధము ముగిసినతర్వాత జర్మనీని నాలుగు నాలుగుభాగములు చేసి ఒక్కొకభాగమును వీరిలో ఒక్కొకరు వారి వశమున ఉంచుకొనిరి. తూర్పు భాగము రషియావంతుకు వచ్చెను. ఈ భాగములో జర్మనీకంతకు ప్రధానపట్టణమగు బర్లిన్ ఉన్నది. కాని పంపకములో దీనినిగూడ నాలుగుభాగములుగ జేసి, ఒక్కొకరు ఒక్కొక భాగమును తీసికొనిరి. ఇదంతయు తాత్కాలికవిభాగము. జర్మనీ భవి ష్యత్తును నిర్ణయించు శాశ్వతఒడంబడిక ఈ నాలుగు దేశములవారు చేసికొనుసంతవరకే ఈ విభజనలు అమ లులో ఉండవలసినట్లుగా వారనుకొనిరి. ఇదంతయు మూడు సంవత్సరములక్రిందట జరిగెను. ఈ మూడు సంవత్సరములమధ్య నాలుగు దేశముల మంత్రులు అనేక పర్యాయములు సమావేశమైనను జర్మనీభవిష్యత్తును గురించి వారెట్టి నిర్ణయమునకును రాలేకపోయిరి. ఇంతేగాక ఈ మధ్యకాలములో రషియాకును, తక్కిన మూడు రాజ్యములకును విపరీతములగు అభిప్రాయ భేదములు కలిగి, ఒకరిపై ఒకరు యుద్ధముచేయుటకు కావలసిన సన్నాహములలో నిమగ్నులైరి. దానికి ఫలితముగా తమ పాలనములో నున్న పశ్చిమజర్మనీ నంతను ఒక ప్రత్యేకరాజ్యముగ నేర్పరచి, అందులో పరిశ్రమాగారములను వృద్ధిచేసి యుద్ధపరికరములు తయారుచేయుటకు మూడు రాజ్యములవారు తీర్మా నించుకొనిరి. పశ్చిమజర్మనీలో తమ కెట్టి స్థావరము లేనినాడు తూర్పు జర్మనీలో ఉండు బర్లిన్‌లో వీరికి స్థావరమెందు కుండవలెనని రషియావారు వారిని బర్లిన్‌నుండి తరిమివేయుటకు సంకల్పించి పశ్చిమ జర్మనీనుండి బర్లిన్‌కు వచ్చు రోడ్లను, కాలువలను, రైళ్లను బంధించిరి. కాని వీరు ఆకాశవిమానముల ద్వారా బర్లినుకు సరకులను తీసికొనిపోసాగిరి. ఈ విషయమై వీరి మధ్య అనేకసంప్రతింపులు జరిగెను. కాని రషియావారు దిగ్బంధనమును రద్దుచేయక పోవు టయేకాక ఆకాశవిమానముల రాకనుగూడ అడ్డుపెట్టు చున్నారు. ఈఒత్తిడినిగాలాగున నిసికి పశ్చిమరాజ్యముల వారు మగ్గరు బర్లినును ఖాళీచేయుదు రని రషియావారి అభిప్రాయము. కాని ఎన్నికోట్ల ద్రవ్యమైనను ఖర్చు పెట్టి ఆకాశవిమానములద్వారా బర్లినులో తమ ప్రాబ ల్యమును నిలుపుకొనుటకు వీరు నిశ్చయించుకొని ఇంకనైన యుద్ధము మొదలుపెట్టుటకు సిద్ధముగ నున్నారు. కాని యుద్ధము ప్రారంభించుటకు ఐక్య రాజ్యసమితిరాజ్యాంగవిధానము ననుసరించి తమ వివా దమును పరిష్కరించవలసిన దని వీరు భద్రతాసంఘ మును కోరియున్నారు. దీనినిగురించి అక్టోబరు న జేరిన చర్చ ప్రారంభమాయెను.

## చర్చలో విశేషములు

ఇట్టి సమస్యల నేకములను ఇదివరలో భద్రతా సంఘము చర్చించెనుగాని వాటిలో ఒక అగ్రరాజ్యము మరియొకఅగ్రరాజ్యముపై ఫిర్యాదు చేసియుండలేదు. ఇదియే అట్టి ఫిర్యాదులలో మొదటిది. జర్మనీ, జపానుల ను ఓడించుటలో కలిసి పనిచేసిన అగ్రరాజ్యముల వారు యుద్ధము ముగిసినతర్వాత ప్రపంచవ్యవహారము లన్నిటియందును ఐకమత్యముతో పనిచేయుదు రన్న అభిప్రాయముతో ఐక్యరాజ్యముల సమితి ఏర్పాటు గావింపబడెను. అగ్రరాజ్యములవారు ఏకగ్రీవముగ అంగీకరించినగాని ఎట్టి విషయము భద్రతాసంఘము తీర్మానింపరాదను నిబంధన ఆ ఏర్పాటులో ఉన్నది. కాని అనేకవిషయములలో ఇట్టి ఐకకంఠ్యము కుదురుట లేదు. బర్లిన్ సమస్యలో వీరి మధ్యనే అభిప్రాయభేద ములు ఏర్పడినవి గదా! భద్రతాసంఘమువా రీ విషయమై చేయు చర్చలలో ఒకరి నొకరు తప్పుబట్టుట తప్ప మరెట్టి ఫలితము కలుగ జాలదు. బ్రిటన్ ఫ్రాన్సు అమెరికాలవారు చేయ దలచుకొన్న తీర్మానమును రషియా తీవ్రముగ ప్రతిఘ టించును. వీరిమధ్య ఏర్పడిన విభేదములలోని గుణాగుణ ములు ప్రపంచమున కంతకు చాటించుటతప్ప ఈ సంఘములోని చర్చలు మరెందుకు పనికిరావు. స్వయముగ ముఖాముఖిని జరుగుచున్న సంప్రతింపుల మూలమున పరిష్కారము కావలెనని బర్లిన్ సమస్య భద్రతాసంఘపు తీర్మానములమూలమున పరిష్కారమగు నని అనుకొనుట హాస్యాస్పదము.

## యుద్ధమే శరణ్యము

కనుక ఈ గడ్డుసమస్య పరిష్కారమగుటకు యుద్ధముతప్ప మార్గాంతరముగ నున్నట్లు కనిపించుటలేదు. రెండుపక్షములవారు యుద్ధసన్నాహములను చేయుచున్నారు. రష్యాప్రధానియగు స్టాలిన్ ఈమధ్య తన అనుచరరాజ్యములను పోలెండు, హంగెరి, బల్గేరియా, జెకోస్లావేకియా మొదలగువానికి రాజ్యప్రధానులతో సంప్రదించి తూర్పు రాజ్యముల ప్రత్యేకసమితి నొకదానిని నిర్మించి, అందులో తూర్పు జర్మనీకి సభ్యత్వము కల్పించజూచుచున్నట్లు తెలియుచున్నది. ఐక్యరాజ్యసమితిలోని సభ్యత్వమును రష్యా, రష్యాఅనుచరరాజ్యములును వదలుకొనునా అన్న ప్రశ్న అనేకులను ప్రస్తుతము కలవరపెట్టుచున్నది. వదలుకొనుట [illegible] కాని కొన్ని నెలల క్రిందట అమెరికా విదేశాంగమంత్రి జార్జి మార్షలు అట్లే ప్రోయనపడియుండెను. కొద్దిరోజుల క్రిందట బ్రిటిష్ విదేశాంగమంత్రి బెవిన్ ఐక్యరాజ్యసమితిమహాసభలో గావించిన ప్రసంగమందు రష్యా వెళ్లిపోవుటవలన నష్టమేమియు లేదను అర్థము వచ్చునట్టి మాటలను మాట్లాడెను. కాని రష్యామాత్రము సమితిని వదలి వెళ్లదని తోచుచున్నది. అందులో నుండుటవలన ఇతరరాజ్యములను నిరోధించుటకు అందరి ఎదుట ఖండించుటకు అవకాశము ఏర్పడియున్నది. తన్నుగురించి ఇతరులు చేయు ఖండనలకు జవాబు చెప్పుటకు కూడ అవకాశమున్నది. సమితిసభ్యత్వము వదలుకొన్నయెడల ఈ అవకాశములు రెండును అదృశ్యములగును.

## పశ్చిమరాజ్యములవారి యుద్ధసన్నాహము

యుద్ధ మారంభమైనయెడల ప్రప్రథమమున రష్యాకే జయము కలుగుటకు ఎక్కువ అవకాశములున్నవి. యూరపుఖండములోని మూడింట రెండు భాగములు దాని వశమందున్నవి. తక్కిన భాగములోని రాజ్యములలో నొక్కొకదానియందును రష్యావిజయమును కాంక్షించు కమ్యూనిస్టులున్నారు. వీరు పంచమదళముగ ప్రవర్తించి రష్యాకు సహాయము చేయ సిద్ధపడియున్నారు. అందుచేత పశ్చిమజర్మనీ, హాలెండు, బెల్జియం, లక్సెంబర్గు, ఫ్రాన్సు దేశములపై దండెత్తుట రష్యాకు చాల సులభము. ఆకాశవిమానములద్వారా ఇంగ్లండుపై పడుటకూడ కష్టముకాదు. ఇందుచేతనే పశ్చిమరాజ్యముల వారు తీవ్రముగ యుద్ధసన్నాహములు చేయుచున్నారు. హాలెండు, బెల్జియం, లక్సెంబర్గు, ఫ్రాన్సు, ఇంగ్లండు దేశములు ఐదును కలిసి ఒక రక్షణవిధానమును ఏర్పరచుకొనిరి. వీరికి సహాయము చేయుటకు అమెరికా, కనడాదేశములవారు సిద్ధపడిరి. కనుక అట్లాంటిక్ మహాసముద్రమునకు రెండువైపుల నుండు దేశములన్నియు ఒక సమాఖ్యగ ఏర్పడి, కలిసి యుద్ధము చేయనున్నవి. సైనికదళములను తగ్గించుటకు ఇదివరలో ఇంగ్లీషుప్రభుత్వమువారు చేసిన ఏర్పాటులన్నియు ఇప్పుడు రద్దుచేసిరి. సైనికుల సంఖ్యను వృద్ధిచేయుటకు కావలసిన ఏర్పాటులను గావించుచున్నారు. మొత్తముమీద రెండు మూడు నెలలలో యుద్ధము ప్రారంభమగుటకు ఎట్టి సన్నాహములు కావలెనో అట్టి సన్నాహములన్నియు జరుగుచున్నవి.

## ఫ్రాన్సుయొక్క అస్థిరత్వము

ఈ సన్నాహములలో పశ్చిమరాజ్యముల వారి విధానమున ఒక గొప్ప లోప మున్నది. ఫ్రాన్సు దేశములో ప్రస్తుతము ఏర్పడిన అస్థిరపరిస్థితులే ఈ లోపము. ఒకప్పుడు యూరపుఖండమందంతట నాయకత్వము వహించిన ఫ్రాన్సుదేశము గత రెండు ప్రపంచయుద్ధముల ఫలితముగ మిక్కిలి దుర్బలత్వము గాంచియున్నది. యుద్ధము చేయుటయందు ప్రజలకు ఉత్సాహము లేదు. యుద్ధములో జయము లభించునను విశ్వాసముకూడ వారిలో సన్నగిల్లియున్నది. దీనికితోడు ఆర్థికపరిస్థితులు అతిక్లిష్టరూపమును ధరించియున్నవి. ధరలు విపరీతముగా పెరుగుచున్నవి. కార్మికులు ఎక్కువ కూలీలను కోరుచున్నారు. సమ్మెలు మామూలైనవి. దీనికితోడు శాసనసభలో అనేకపార్టీలు ఏర్పడుటచేత ఏ మంత్రివర్గము స్థిరముగ కొన్ని నెలలపాటైనను అధికారమందుండుటలేదు. నిమిష నిమిషమునకు మంత్రులు మారిపోవుచున్నారు. కమ్యూనిస్టులకును, ఇతరపక్షములవారికిని తీవ్ర సంఘటనలు జరుగుచున్నవి. డీగాల్ అను నాయకుడు సాధ్యమైనయెడల నియంతృత్వప్రభుత్వమును స్థాపించ జూచుచున్నాడు. ఈసంఘటనలన్నియు నిలచిపోయినగాని ఫ్రాన్సుదేశము యుద్ధములో పాల్గొనజాలి యుండదు. (1-10-'48)

# మలయానిలుడు

## శ్రీ వావిలాల సోమయాజులు

"ఆకృతకామోదకురవకావికలవకుల
ముకులసకలవనాంతప్రమోదచలిత
కలితకలకంఠకులకంఠకాకలీ వి
భాసురములు వొల్చు మధుమాసవాసరంబు"

ఋతుచక్రభ్రమణంలో శబలితకాంతు లీనుతూ గమిస్తున్న దానిని ఆంధ్రప్రబంధవనీ వీథికి ఒక సంగీతకళా రహస్యనిధి ముగ్ధమోహనమధుషట్పదగీతికతో ఆహ్వానించాడు. విచ్చేసి సమస్తజగత్తునూ సమ్మోహనశక్తితో కిమ్మీరితంచేస్తూ స్తుతిపాత్ర మౌతున్నది ఏతన్మాస లక్ష్మి.

'కాలః కరోతు కార్యాణి' అన్న ప్రాచీన సూక్తిని మనస్ఫూర్తిగ నమ్మి, కాలప్రభావాన్ని అనుభవపూర్వకంగా గుర్తించి, క్రాంతదర్శి వసంతుడు 'చిలుకల తేరు నెక్కి' కొంతదూరమూ, మలయానిల రథమధిరోహించి కొంతదూరమూ ప్రణయ చైత్రయాత్ర సాగిస్తున్నాడు. అతడు వనవీథుల్లో సేనాసమేతంగా పయనిస్తున్నపుడు 'ప్రత్యగ్ర సాలాగ్రహర్మ్యవిటంకంబులు ప్రాకి వల్లీవనజాస్యల్ పల్లీరుత్ఫుల్లపల్లవహస్తంబుల భావిభావుకఫలోల్లాసంబుతో గ్రొవ్విరుల్.' అపనోదితోత్కంఠ కలకంఠంతో వనలక్ష్మి 'నందనవనసుందరి నిను అందగాని రానిచ్చెనే?' అని సాకూతంగా ప్రశ్నించింది. 'శోభానవతరుణిమ నూత్నజీవనముల కిక— ఋతునేతా, వసంతా!' అని ఆనందోన్మత్తగానం చేసింది.

'...మన సఖుడు గురుడు దైవము' ఈ మాధవస్వామి అని నమ్మి 'మనోవాక్కాయకర్మలా' అతని ఆజ్ఞలను పాలించే మలయమారుతుడు వసంతుని 'అభ్యుదయపరంపరాభివృద్ధికి' ఆనందాబ్ధిలో ఓలలాడుతూ నానారూపాలు ధరించినట్లుగా పొంపిల్లిపోతున్నాడు. ఆ వనప్రియుని ఆగమనవార్తావహుడైనాడు. విరహార్త వనదేవత ముఖసమీరాన్ని ఇతనికి గౌరవపురస్సరంగా ఎదురుపంపించినప్పుడు 'నిలువెల్లా పొంగిపోయి ఒడలెల్ల కాళ్లుగ వడిబారు'నది ఐపోయినాడు; నర్తించాడు. ఇది గమనించిన ప్రబంధపరమేశ్వరుడు అన్నాడు:

"ఇదె చనుదెంచె చైత్రమని
ఎల్లవనంబులకున్ ప్రమోదముల్
పొదలగ మేలివార్త గొని
బోరన వచ్చిన దాడికాఁ డనన్
మృదువనదేవతాముఖస
మీర మెదుర్కొన నుల్లసిల్లె నిం
పొదవగ దక్షిణానిలము
నూనమనోహరఖేలనంబునన్".

వసంతుని నెచ్చెలికాడు కనుకనే, వచ్చేటప్పుడు ఈర్ష్యారహితుడై అతనికి ఎత్తని కీర్తిధ్వజమై సుగంధ సేకరణం చేశాడు. అది ఒక లోకంలోది కాదు; ఒక నాటిదీ కాదు. అందుకనే ఓ ప్రబంధకవి అన్నాడు:

"కేళీసరోవీథి నాళీకవాటీ మ
ధూళీఝరీరాజి తేలితేలి,
చోళీమహాభోగచూళీనవప్రసూ
నాళీసుగంధంబు లానియాని,
లోలీభవత్పుష్పధూళీచరద్భృంగ
పాళీనిరోధాప్తి తాళితాళి,
తాళీవనీనారికేళీరసాల కం
కేళీహితచ్ఛాయ కరలికరలి,
మెలగు నామని మణిదరావలయనిలయ
కనకనందనచందనాకలితలలిత
వలితలవలీనికుంజాబ్జవదన మదన
కదనఘర్మాపహంబైన గంధవహము".

విభ్రమవిలాసాలతో సమస్తప్రపంచాన్నీ ఆకర్షించాడు గంధవహుడు. 'ఒనర హిమావకుంఠనము లూడ్చి తెమల్చిన పత్రభంగముల్ పస నసియాడుచున్ మొగుడి చెక్కులు పల్లవపాణి గప్పు నూతనలతికాలతాంగుల నుదారగతిన్' చలివాపినాడు; సెయ్యపుం బెనకువ నేర్పినాడు. 'అలరంజేసె నితాంతనూతనలతాంగాశ్లేషముల్ నిశ్చలలీలన్ మధుపాంగనాసమితికిన్; సంధించు శ్యామాక్షియా కలకంఠిని నేర్పు మెరయ' పలికించినాడు. లోకంఅతగాణ్ణి 'భుజంగగ్రామధామైక సంకలనాభ్యాసవిలాసపాటవుణ్ణిగా' కీర్తించింది. అంతేకాదు, అతడూ రసికుడు, పల్లవుడు—పండుటాకు లనే మిషతో కొమ్మల డాసి నిచోళావకుంఠనాన్ని అపాస్తంచేసిన బిలిపితనం అతనిలో లేకపోలేదు.

ఏ రీతిని? ఎక్కడివాడు? ఎందుకు వచ్చాడు?—అన్న ప్రశ్నలు ఉదయించినవి. అత డేమీ పుట్టుపూర్వోత్తరాలూ, మట్టుమర్యాదలూ లేనివాడు కాడు అన్నారు భావకులు. వారిలో ఒకని సమాధానం వింటే మలయానిలుని చరిత్ర సమస్తమూ చక్షుర్గోచర మౌతుంది.

"దక్షిణాశావధూతనయుండై వనలక్ష్మి
పెంపున పొదరిల్ల పెరిగి పెరిగి,
తేటిజోటుల జోలపాటల పాటల్లి
తీగె యుయ్యాలల తూగితూగి,
కమలాకరంబుల కమ్రపూదేనెల
నానుచు జల్లు పోరాడి యాడి,
కమలధూళీపాళికాకేళికల పొల్చి
మందమందవిహార మొందియొంది,
యౌగమస్థితి దొరిగి బాల్యంబు తరిని
మల్లుల జెనంగి పొంగుల మర్మ మెరిగి,
సాముచేయుచు మాధవస్వామియాజ్ఞ
కంతుజోడై మెలంగు లేగాడ్పుకుర్ర"

అన్న ఇతని సమాధానంవల్ల అతని రాచపుట్టుక విద్యావివేచనాదులు అభివ్యక్తా లౌతున్నవి.

సృష్టిస్థితిలయాకారకులైన త్రిమూర్తులనూ కేవలం 'గృహకుంభదాసులనుగా' చేసికూర్చోపెట్టిన కుసుమధన్వికి ఆప్తమిత్రుడ నగే 'అహంభావం' అతనికున్నది.

విచ్చలవిడిగా విర్రవీగి సంచరిస్తూ, 'మల్లికాసుమగళన్మరందహేరాళధారాజలంబుల తడిసితడిసి, సరసిజకైరవసంతానసంక్రాంతవీచికావళులమీద విడిసి విడిసి, ప్రత్యగ్రప్రసవసంపూరితచూతమంజరులపై సుడిసి సుడిసి, తతవియోగక్రాంతతరుణీజనస్వాంతజనితఖేదములలో జడిసిజడిసి, బహుళకోరకకుసుమసంభరితమంజుపటలవిహరణముదితబంభరవితానమధురతరగీతసంస్తూయమానుడై' ఖ్యాతిగన్నాడు ఇతను.

ఓనాడు మన భట్టుమూర్తి వనంలో 'మధుమత్తగంధవహం' విహరిస్తుంటే 'మహిళామండలమంజుల భ్రమరకామర్దంబు, శ్యామాముహుర్ముహురున్మీలిత పత్రభేదనిపుణంబున్, పద్మినీకంకణగ్రహణాపాదియునై సగంధవిటప్రాప్తితో విజృంభించి కనిపించాడు. 'అహో! రసికతే' అని ఆయన ఆశ్చర్యపడ్డాడు.

వసంతవేళ మ్రానుపట్టుతూఉన్నది; తలిరులు పుట్టుతూఉన్నవి. ఈ వైరుధ్యానికి కారణం గోచరించింది కాదు ఎవరికీని. 'రవి గాననిచో కవి గాంచునే కదా' అని ఊరికే అన్నారా పెద్దలు. కవిరాజు కారణం కనిపెట్టి అన్నాడు:

"చెలువసుధారసాగరల
చెల్వపు పుక్కిట తావి తీయనై,
వలపులయందు తత్ప్రియుల
వక్త్రవిషజ్వలనోష్మ సెగ్రనై,
వలువడి తద్గుణద్వితయ
వేధసుమీయన మ్రానుపట్టుటల్,
తలిరులు పుట్టుటల్ కనగ
తార్కొనె చందనశైలవాతముల్"

అని. మిహికాజలధులలో లోకం మునిగిపోతున్నదని 'ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే' అని పురుషోత్తముడు అన్నాడు గనుక మాట చెల్లించటానికి మాటిమాటికీ ప్రతివత్సరమూ మలయానిలుడుగా అవతరిస్తుంటాడు ఆయన. అంతలోనే

మటుమాయమైపోతుంటవి మిహికాజలధులు. ఏమైపోతున్నట్లు? ఓ వసంతోత్సవసమయంలో రాయలవారి భువనవిజయంలో ఈ విషయమే చర్చకు వచ్చింది. సావధానులై అష్టదిగ్గజాలూ ఆలోచించారుగాని సక్రమమైన సమాధానం రాలేదు. అప్పుడు అన్యత్రకుశీరంనుంచి ఆ రాజకవి అన్నాడు :

"మలయకటకోటజస్థిత, కలశీసుతసేక నిగ్గు కసెనో తదాశా, నిలు డనగ నలసవృత్తిన, మెలుచు నాపోశనించె మిహికాజలధిన్" అని. అప్పుడు పరిషత్తులో హర్ష సూచకకరతాళధ్వనులు చెలరేగినవి.

అప్పుడప్పుడు మలయపవనుడు 'బొండుమల్లెల పరాగము లేచి నిబిడంబుసేయు వెన్నెల రసంబు'. ఇంతకంటే బాల్యాంకవిచేష్టలు ఎన్నెన్నో చేశాడు. 'తుమ్మెదలకు ఓగిరమ్ముగా నలరుల కమ్మదేనియలెల్ల కుమ్మరించె; కీరవారంబుల కొరికేరంబుగా ఫలజాలముల నేలపాలు జేసె; దొరల నంటున జారు తరుల నంటి పెనంగు నల లతికూనల తొలగద్రోసె; వని దవుయిచ్చు వర్తిల్లు ఖగముల కన్నులపై పరాగములు సల్లె'.—అయితే అందరూ ఇవి బాల్యచేష్టలక్రింద అంగీకరించక జాడ్యలక్షణా లన్నారు. ఇది మందు లేని రోగ మన్నారు కొందరు. లోకంలో వైద్యులు లేకనా? అంతదూరం ఆలోచించవలసిన అగత్యమేముంది, వసంతభిషగ్వరు డున్నాడుగదా అనుకున్నారు. మరికొందరు పెద్దమనుష్యులు.—

"లేగిన మనోభవున్ తిరుగ
దెచ్చి కుజంబులకెల్ల ప్రాయమున్
మసుడగ నిచ్చి అన్యభృత
మంజలి మూగతనమ్ము వుచ్చి ము
జ్జగముల వార్తకెక్కిన వ
సంతభిషగ్వరు డాప్త వయస్యునున్,
ఉడుగతి మాన్ప లేడ మరి
దక్షిణమారుతునందు జాడ్యమున్"

అని నిశ్చయించారు. ఇది కేవలమూ జాడ్యమవటానికి వీలేదు. ఈ చేష్టలన్నీ మారపరిచర్యలో మలయానిలుడు ధరిస్తూవున్న ఉన్మత్తవేషాలు. అతని వృత్తికి లక్షణాలు. 'భూతాయ భవ్యమ్.' ఈదోషాలన్నీ అతగాణ్ణి చుట్టుకోవా అనే అనుమానం కలిగితే 'కారయితుః కర్తృత్వమ్' అని సమాధానం. చేయించినవాడు మన్మథుడు; ఇతడు కేవలము అతని ఆజ్ఞాపాలకుడు మాత్రమే.

మదనమహారాజుసేవలో మలయమారుతుడు నానారూపాలు ధరించి వర్తిస్తుంటే లోకం తెలుసుకోలేక ఇతణ్ణి ఒక ప్రత్యేకజాతివాణ్ణిగా లెక్కగట్టి ఆ జాతిలో అనేకవ్యక్తుల లక్షణాలను పలుకుతూ—

"అంగజకృత్తాంతరంగజాయాకాంత
ఘోరవాయువ్యకింశారుతములు,
జరదురంగమపరిస్ఫురదుపహ్వరగిరి
స్వైరసంభారనిర్భరుతములు,
స్మరసమీకస్విన్న నరసమూహోత్పన్న
భూరిఘర్మాంభశ్శ్రరారుతములు,
పథికమర్దనమహారథికమన్మథసహా
యోరుతరవిహారచారుతములు,
హరిగతి సంచరించె కావేరికాప్ర
తీరసారసకమల కహ్లారకుముద
సారసౌరభ్యసంభారభారవహన
ఘోరపరిచారమంజులమారుతములు"

అని బహువచనంలో చెప్పుకున్నారు. కొందరు అయినా 'ఏకం సత్ విప్రా బహుధా వదంతి' అని అనుకున్నారు.

'పథికవియోగాగ్నిపాణింధమ' 'మనే నామం అతనికి లోకంలో రూఢమైపోయింది విరహిణులు చేసిన దుష్ప్రచారంమూలంగా. ఆ అలుసు చూచుకొని ఓఅమ్మ 'అక్కట గంధవాహ, తగవా హరిణాంకుని గూడి పాంథులన్ పొక్కగజేయ' అన మొరపెట్టినట్లు మొదట కనుపించినా తరువాత 'పావకుని పొందొనరించి జగమ్ము లేచు నీ అక్కొరగామి' యిన వని దెప్పిపొడిచింది. అంతకంటే తెలివిగల మరో మహాతల్లి అతని లోకయాత్రకే భంగం కలిగించే ఆలోచన చేసి—

"అది గాదే చలి, నీకు [illegible]
[illegible] [illegible]

మదిరోన్మత్తపుళింద నాయకులతో
మాటాడి చంపింపకే,
కదనుల్ ద్రొక్కుచు వాని వాహనములై
కాల్దివ్వ నేణీమదో
న్మదసంఘంబుల చూత మింక నెటు దు
ర్మార్గుండు రానేర్చునో !"

అని నిశ్చయించింది. కాని, పర్యాలోచనచేసి "ఈయవి వెర్రి ఊహాలు కదే !—అటు లేల యొనర్తురే సఖీ......శబర పల్లవులన్ స్మర కేళి లో లురన్ జేయుచు మేలుసేయుచున్ చెల్వుడుగా మెలగున్ గదా" అని దైన్యం వహించింది. ఈ స్త్రీజనం అతణ్ణి సుమార్గు డన్నా, దుర్మార్గుడన్నా అతడు పట్టించు కోటం లేదు. నేటికీ—'చైత్రభూమీకళత్రచామరచలనంవల్లనూ, పటుఘర్మజలకణపశ్యతోహరవృత్తివల్లనూ ఇతడు వలపూ, మెలపూ ప్రసాదిస్తూ విహరిస్తూనే ఉన్నాడు.

'కామీ స్వతాం పశ్యతి'—తాము దుష్టులు. మలయానిలుని మంచి ఎరుగక అతనిమీద ఎన్నెన్నో నేరారోపణలు జరిపారు. పరోపకార బుద్ధిరహితుడని నిందించారు. వెన్నెలరాత్రివేళ శుక్తిమతీనదీతీరాన దాగిలిమూత లాడుతూ ఉన్న రాచకుమార్తెల నడిగితే అతని మంచి చెపుతారు, వారి శరీరపరిమళాన్ని గ్రహించి ప్రత్యుపకారం తలపెట్టి చెలికత్తెలు కంట పడకుండా దాగిలిమూతవేళ కప్పూరపు దుమారం చల్లి మేలు చేశాడు గనుక.

స్త్రైణపరిమళాలంటే అతనికి అమితానందము. ఒక్కొకమాటు కంఠదఘ్నంగా ఆఘ్రాణించి ఉన్మత్తుడై—

"అమరాంగనాతుంగ
సంగతోన్నత వక్షః
ఘనసార కాశ్మీర
చర్చానిలమ్ములకు సోలసీ—

వెర్రినై నాను నేనూ, ఇక
విశ్వచాలన చేయలేనూ—

ఖేచరీముఖసక
ర్పూరతాంబూలాది
వాసనానిశ్వాస
పవనచాలనలకున్ భ్రమసీ—

వెర్రినైనాను నేనూ ఇక
విశ్వచాలన చేయలేనూ—"

అని ముల్లోకాలలో నాట్యంచేస్తూ నమస్తమూ మరిచి పోతుంటాడు. అటువంటిసమయంలో చూచిన వారు ఇతనికి వినయవిధేయతలు లే వంటారు. ఇది పొరబాటు. కవికులగురువు కాళిదాసు నడగండి—చెపుతాడు. అంతకంటే సాక్ష్య మేమి కావాలి ? వసిష్ఠాశ్రమానికి వెళ్లుతూ ఉన్న సుదక్షిణాదిలీపులను మలయానిలం సేవించే రీతిని చూచి ఆయన అన్నాడు:

"సేవ్యమానా సుఖస్పర్శైః సాలనిర్యాసగంధిభిః
పుష్పరేణూత్కిరై ర్వాతైః ఆధూతవనరాజిభిః".



ఖండాంతరఖ్యాతిగడించిన

ఆంధ్ర వైద్యశాస్త్రజ్ఞుడు

# కీ. శే. యెల్లాప్రగడ సుబ్బారావుగారు

దేవత లనగా మరి యెక్కడో లేరు. ఈ లోకంలోనే ఉన్నారు. తమలో అంతర్లీనమైఉన్న దైవాంశాన్ని ఉద్దీప్తపరుచుకొంటూ స్వార్థరాహిత్యంతో లోకకల్యాణానికై పాటుపడే మహనీయులంతా దేవతలేనని ఒకప్పుడు గాంధీ మహాత్ముడు చెప్పాడు. నిజంగా అంతేకదా! వారే జరామరణాలు లేని దేశోద్ధారకులు.

ఈవిధంగా తమ జీవితసర్వస్వాన్ని దేశసేవకై, శాస్త్రపరిశోధనకై వినియోగించి లోకకల్యాణకారకులై, కీర్తిశేషులయిన మహనీయు లెందరో ఉన్నారు. అట్టివారిలో శ్రీ యెల్లాప్రెగడ సుబ్బారావుగారు ఒకరు. వీరి జీవితగాథ మాత్రం ఒక విశిష్టమైన ఉత్తమపథంలో నడిచింది.

వీరు ఆంధ్రపుత్రులు. తూర్పుగోదావరిజిల్లావాస్తవ్యులు. ౧౯౨౩ సం.లో అమెరికాదేశానికి వెళ్ళారు. ఆ నాటికి వీరి వయస్సు ౨౭ సంవత్సరాలు. అప్పటికే అష్టకష్టాలు పడి యేలాగో జీవనోపాధికి అవసరమైన విద్యను గడించి మదరాసుమెడికల్ కాలేజీలో పట్టభద్రుడైనాడు. ఎక్కడో వైద్యవృత్తి నవలంబించి పొట్టపోసుకొంటూ అస్మదాదులవలె కాలక్షేపం చేయక, దారిద్ర్యదేవత తనను అంటిఉన్నప్పటికీ, ఒక మహోద్దేశాన్ని మనసులో పెట్టుకొని తత్సాధనకై రాత్రింబవళ్లు తంటాలుపడి, కట్టుబట్టలతో... కుదకు అమెరికాఖండం ప్రయాణం సాగించాడు.

స్వదేశాన్ని, సంసారాన్ని, బంధుమిత్రుల్ని పరిత్యజించి కేవలం విజ్ఞానకాంక్షతోను, లోకోపకారనిరతితోను ముందునంగతికూడా విచారించకుండా, ఎప్పటికప్పుడు భగవంతుడే తోడ్పడగల డనే విశ్వాసంతో ఖండాంతరయాత్ర తలపెట్టాడు. చివరకు అమెరికాకు చేరగలిగాడు.

అమెరికాకు చేరినతరువాత కొన్నాళ్ళపాటు తనకు దినభత్యము గడవటమే కష్టంగా ఉంటే ఆస్పత్రిలో రోగుల మలమూత్రాదులను యెత్తి పరిచర్యచేసి, పొలాలలో బంగాళాదుంపలను త్రవ్వి కూలిపనిచేసి, దినభత్యమును సంపాదించుకొంటూ, ఒక వంక తన వైద్యశాస్త్రపరిశోధనలు సాగించుకొంటూ, కానిదేశంలో కడగండ్లు పడుతూ బహుశకిటమైన నిత్యజీవితం గడిపాడు.

పాటికేండ్ల పరిశ్రమఫలితంగా, వైద్యశాస్త్రపరిశోధనలలో తన మనోరథసిద్ధిని బడయగలుగుతున్నానని, తాను అమితోత్సాహంతో కృషిచేస్తూ, కాస్త కడుపునిండా



అన్నంతినే రోజుల్లోను, ఆయనపరిశోధనఫలితాలు జగద్విఖ్యాతిని పొంది, విదేశీయశాస్త్రజ్ఞులంతా ఆయననుగూర్చి ప్రశంసించే సమయంలో—ఇట్టి ఖండాంతరఖ్యాతి ఈయనకు—అందులో ఒక ఆంధ్రునకు—ఎందుకు కలగాలని గాబోలు—ఆ మృత్యుదేవత ఈ మహనీయుణ్ణి చూసి

యార్కు నగరంలో మొన్న ఆగస్టు ౯-వ తేదీన అమాంతంగా తన పొట్టను బెట్టుకుంది.

— "పాతికేండ్లక్రిందటి మాట. శ్రీ సుబ్బారావుగారు అమెరికాకు వెళ్ళకముందు ఒకసారి అతిసారవ్యాధితో ప్రమాదమైన జబ్బుచేయగా, ఇతరవైద్యాలవల్ల కుదరక పోతే, మిత్రుల సలహావల్ల చివరకు శ్రీ డాక్టరు అచంట లక్ష్మీపతిగారి ఆయుర్వేదచికిత్సను పొంది ఆరోగ్యవంతులైనారు. అప్పటినుండీ ఆయుర్వేదమునం దభిమాన మేర్పడి, శ్రీ లక్ష్మీపతిగారి పరిచయంవల్ల ఆయనగారికి పట్టిన పిచ్చి ఈయనకుకూడా పట్టి ఆయుర్వేదం చదవడం మొదలుపెట్టాడు. మేధావిగనుక "అష్టాంగకముళాఘులానగిల్ల వైద్య మెనిమిదినెలలు సర్వమును నేర్పె" నన్నట్లుగా శీఘ్రకాలంలోనే దేశీయవైద్యశాస్త్రంకూడా క్షుణ్ణంగా చదివి, ఉభయవైద్యశాస్త్రనిష్ణాతు డైనాడు. ౧౯-౨౧-౨౩ దాకా మదరాసు ఆయుర్వేదకళాశాలలోనే వైస్ ప్రిన్సిపాలుగా ఉండి, అమెరికాప్రయాణానికై ఉద్యోగం మానుకొన్నాడు.

వైద్యంలో అసాధ్యరోగాలుగా వరిగణింపబడే 'కాన్సర్', 'ఫైలేరియాసిస్' మొదలైన కఠినవ్యాధులకన్నిటికి అమోఘంగా పనిచేయగల మందులు ఏవైనా కనిపెట్టాలని తన ఆశయంగా అపుడు చెబుతూ ఉండేవాడు. అప్పటికే ఈ వ్యాధుల్నిగూర్చి ఉభయవైద్యాల్లోను కొంత పరిశోధన చేసి కొన్ని వ్యాసాలు వ్రాశాడు.

ఒక భిషగ్వరుడు వైద్యరీతిని రోగాలకు చికిత్స చేసి మామూలుసేవ చేయాలంటే, ఓపినకొలది శారీరకంగా ఎంతమందికో మందు లిచ్చి, సేవజేసి, తృప్తిపరచగలుగుతాం గనక [illegible]దానితో నాకు తృప్తిలేదు. అలా కాకుండా, సర్వసామాన్యంగా ఆతురులయిన మానవసామాన్యానికంతా ఉపయోగపడేటట్లు, అట్టివారిని బాధనుండి తొలగించేటట్లు, ఏదైనా కఠినవ్యాధికి నివారణోపాయం కనిపెట్టి, మానవకోటిసేవ చేయుటమే భగవత్సేవ కాగలదని, అట్టి పరిశోధనలోను, సేవలోను తాను నిమగ్నుడైయుండడమే తన ఆశయమని, అట్టి అవకాశాలు ఆనాటికి (౧౯-౨౩ నాటికి) మన దేశంలో దుర్లభంగనుక, అమెరికాకుండా వెళ్ళేతం, అక్కడ ఇట్టి పరిశోధనసాగించడం తన యిష్టమని పదేపదే చెబుతూ ఉండడం నే నెరుగుదును.

ఈయనకు గల విజ్ఞానతృష్ణ ఇంతింత అని చెప్పడానికి వీలులేదు, ఎప్పుడూ ఏదో చదవడం, నోట్సు వ్రాస్తూ ఉండడం, మిత్రులతో చర్చిస్తూఉండడం, ఏదో తెలుసుకొందామని, తా నింకా ఏదో చెయ్యాల్సిఉందని తహతహపడుతూ ఉండడం—ఇదే ఆయనపని. ఐహువిరాడంబ రుడు. అందరితోను కలిసిమెలసి తిరుగుతూ వినమ్రుడై ఉండేవాడు.

ఈయన భారతదేశమును విడిచిన తరువాత లండన్ విశ్వవిద్యాలయమునందు 'Doctor of Tropical Medicine' అనే డిగ్రీని, హార్వర్డు విశ్వ విద్యాలయములో బయోకెమిస్ట్రీలో (Biochemistry) డిగ్రీని పొందిరి. పిదప హార్వర్డువిశ్వవిద్యాలయములో 'టీచింగ్ అండ్ ఫెలోషిప్' పదవిని కొన్నాళ్ళు నిర్వహించిరి. అటుపిమ్మట ఆ విశ్వవిద్యాలయములోనే అసోసియేట్ప్రొఫెసరుగా పని చేయుచు పి.హెచ్. డి. డిగ్రీని సంపాదించిరి. ఆ రోజులలోనే 'ఫిజియాలజీ' లో స్వతంత్రముగా మెన్నదిగిన ఒక నూతనసిద్ధాంతమును కనిపెట్టగలిగిరి. "Muscular Contractions" (కండరముల సంకోచము)ను గూర్చి వీరు కనిపెట్టిన ఈ సిద్ధాంతముతో పాతసిద్ధాంతము లన్నియు తారుమా రయ్యెను. ౧౯౪౦ సం.లో న్యూయార్కు నగరంలో పెరల్రివర్వద్దనున్న లేదర్లీ లేబరేటరీస్కు 'రీసర్చిడైరెక్టరుగా' నియమితులై, రు ౧౪,౦౦౦ వరకు వేతనమును బడయగలిగిరి. అమెరికాకు వెళ్లకముందు తాము తలచినవిధముగా 'ఫైలేరియాసిస్' (బోదవ్యాధి), 'కాన్సరు', 'లివరు' వ్యాధినివారణనిమిత్తమై తమ పరిశోధనలవల్ల చికిత్సను కనిపెట్టినటుల వారి సహచరులవల్ల తెలియుచున్నది.

వీరు కనిపెట్టిన ఔషధములనుగూర్చి, వీరి పరిశోధనాపాటవమునుగూర్చి మన కింకా విపులముగా తెలియరాలేదు. ఎప్పటికప్పుడు వాటినన్నిటిని తెలుసుకొనుచు, అమెరికాదేశపు వైద్యపత్రికలతో సుపరిచయముగల ఆంధ్రులు, శ్రీ సుబ్బారావుగారికి పరిచితులు అయిన మదరాసు మెడికల్ కాలేజీలో ఫిజియాలజీ ప్రొఫెసర్ శ్రీ డి. వి. సుబ్బారెడ్డిగారు తెలుగులోను, ఇంగ్లీషులోను ఈ మహనీయుని పరిశోధనముగూర్చియు, వీరి వైద్యశాస్త్రపాండిత్యము గూర్చియు ఒక గ్రంథమును వ్రాయదగుదురు. శ్రీ సుబ్బారెడ్డిగా రిందుకు పూనుకొనెదరుగాక యని ప్రార్థించుచున్నాను. ఇట్టిది శ్రీ సుబ్బారావుగారి స్మరణచిహ్నముగా గూడ నుండగలదు.

జగత్ప్రసిద్ధినొందిన 'పెన్సిలిన్', 'స్ట్రెప్టోమైసిన్' అనే ఔషధములు కనిపెట్టుటలో వీరు ప్రముఖపాత్రను నిర్వహించిరని అమెరికావిలేఖరులే వ్రాయుచున్నారు.

లేడర్లీలాబొరేటరీలో కొందరు శాస్త్రవేత్తలతో కలిసి వీరు 'అరియోమిసిన్' అనే ఒక ఔషధాన్ని కనిపెట్టారట. 'పెన్సిలిన్' ఔషధప్రయోగానికి గాని, 'స్ట్రెప్టోమిసిన్' ఔషధప్రయోగానికిగాని లొంగని జాడ్యాలను ఇది కుదర్చగలదట.

వీరు జన్మదేశమును, సంసారమును వీడి పాతికేండ్లయినను, విదేశములలో పవిత్రజీవితమును గడుపుచు, ఒక రసాయనశాస్త్రవేత్తగా ప్రపంచఖ్యాతిని గడించుట, నూతనసిద్ధాంతములను క్రొత్తఔషధములను కనిపెట్టుట జూడగా, ఏనాడో ఆంధ్రదేశమున ఇట్టి రసాయనాచార్యుడుగా వెలుగొందిన సిద్ధనాగార్జునాచార్యుడు తలంపుకు వచ్చుచున్నాడు.

'జగత్పూజ్యప్రతాపోదయశ్రీలం జెందు' టకు 'విఘ్నకారణము' లైన 'ఆలస్యంబును కామినీజనరతాత్యాసక్తియుఁ జన్మభూలోలత్వంబును రోగిపుం భయము దుర్లోభంబు సంతోషము'— ఈ ఆరు వీరివద్ద లేవనుట అతిశయోక్తి కాదు.

ఏమైన నేమి? ఏభై రెండేండ్లకే శతాయుష్కునివలె మరణించాడు. డాక్టర్ సుబ్బారావుగారి మరణంవల్ల వైద్యశాస్త్రనభోమండలంలో వెలుగొందే ఒక నక్షత్రం రాలిపోయింది. వీరి ప్రతిభ నిరుపమానమైనది. ఇట్టి ప్రతిభాసంపన్నుడు అస్తమించడంవల్ల అధునాతనభారతీయ శాస్త్రజ్ఞులలో అగ్రగణ్యుడు ఒకడు లోపించినాడు. వీరు పుట్టుకతో ఆంధ్రు లైనప్పటికీ పాండిత్యప్రతిభచేత ఈ వ్యక్తి ప్రపంచానికంతటికీ చెందుతాడు. తరాలు గడిచినా వీరి పేరు శాశ్వతంగా వెలుగొందుతూ ఉంటుంది.

ఆనాడు అమెరికాకు పంపునప్పుడు సెంట్రల్ స్టేషనులో సాగనంపుతూ, గంపెడాశతో పూలమాల వేసిన చేతితోనే — మిత్రుడు ఈమాట వ్రాస్తూ కన్నీళ్ళు విడుస్తున్నాడు.

"వైద్యశాస్త్రి"



# కలగూరగంప

## భారతీయ సంస్కృతిపై రష్యా అభిరుచి

భారతీయసాహిత్యము నాలుగు వేల సంవత్సరములనుండి వచ్చుచున్నది. సారస్వతగుణము లోను, భావగాంభీర్యమున, విషయబాహుళ్యమున, సాహిత్యరూపములలోను ఉత్తమోత్తమములగు ననేక సాహిత్యగ్రంథముల నీనాల్గువేలయేండ్లలో భారతీయులు సృష్టించినారు. దీనితో ఆసియాఖండములోని ఇతరప్రాచ్యదేశములపై సహితము వీరి సాహిత్యప్రభావము బయలుదేరి అభివృద్ధినందినది".

అని తులసీదాసరామాయణమును రష్యకాలోనికి అనువదించిన ప్రొఫెసర్ అలెక్సిబర్రానికోఫ్ టాస్‌లో నొక వ్యాసమును వ్రాయుచు పలికినాడు. తన శక్తి నంతను అనేకసంవత్సరములు ధారపోసి ఈ భారతీయ గ్రంథానువాదములకు కడంగి యుద్ధకాలమున సహితము ఈ పనిని పరిత్యజించక, తాను చేసిన కృషిని వివరించుచు వ్రాసిన వ్యాస మిది.

గతశతాబ్దమున ఐరోపాలో భారతీయవిజ్ఞానమునుగూర్చి కృషిసలుపబడినది. ఈ కృషిలో జర్మన్ దేశీయులు మొదట శ్రమించినారు. ఈ కాలమున జారుప్రభుత్వమున రష్యాలోని విజ్ఞులు నిఘంటుకార్యమున నిమగ్నులైనారు. వీరిలో ఓట్లెన్‌బెర్గ్, అలెవస్కీలు సంస్కృతాభ్యాసమునకు దారితీసినవారు. సంస్కృతవాఙ్మయమున, వైదికబౌద్ధవాఙ్మయమున వీరికి అభిరుచి మెండు. వీరి కృషి క్రమేణ అనేకుల నాకర్షించినది. దీనితో ననేకభారతీయగ్రంథములు అనువదింపబడినవి.

భారతీయసంస్కృతిలో నిష్ణాతుడగు ప్రొఫెసర్ మినాజెఫ్ గతశతాబ్దపు ద్వితీయభాగమున మన దేశమునకు మూడుపర్యాయములు వచ్చినాడు. సంస్కృతమునుమాత్రమేగాక, పాలీప్రాకృతములనుకూడ నీతడు నేర్చి పండితుడైనాడు. పాలీప్రాకృతములను అనేకులకు నేర్పుచు, చాలమంది పండితులను రష్యాలో నీతడు తయారుచేసినాడు. ప్రస్తుతము లెనిన్‌గ్రాడనబడుచున్న పీటర్స్‌బర్గ్ ఆరోజులలో ప్రధానమగు విజ్ఞానకేంద్రము. ఇచటనే రోత్, బొయిట్లింక్ కలసి సంస్కృతనిఘంటువును తీసికొనివచ్చినారు. ఇదే ప్రపంచవిఖ్యాతినందిన **St. Petersberg Woerterbuch.**

ఈ శతాబ్దారంభమున రష్యాలో మన సారస్వతములపై అభిరుచి యెక్కువైనది. వీరిలో ప్రొఫెసర్ బర్రానికోఫ్ ముఖ్యుడు. ఇతనితో కలసి పనిచేసిన వారిలో ఇతని శిష్యులగు ప్రొఫెసర్ క్రాస్నొడెంబొస్కీ, జారిన్‌లు ముఖ్యులు. హిందీ, ఉర్దూ, మరాఠీలలో అసమానపాండిత్యము నందినవాడు బర్రానికోఫ్. క్రాస్నొడెంబొస్కీ మరాఠీభాషను, జారిన్ వంగభాషను పట్టినారు. వీరిర్వురు లెనిన్‌గ్రాడుముట్టడి సందర్భమున అకాలమృత్యువుపాలైనారు. నికొలాయ్ టిఖోనోఫ వంగభాషావిద్వాంసుడు. గీతాంజలి, గోరా మొదలగు ననేక రవీంద్రుని కృతులను రష్యాభాషలోని కీతడనువదించినాడు.

ప్రథమ ప్రపంచసంగ్రామమున ప్రొఫెసర్ షెచర్‌బాట్స్కీ సంస్కృతవేదాంతనిఘంటువును ప్రచురించినాడు. క్రమేణ ఇతడు బౌద్ధవేదాంతమున మిక్కిలి కృషిసలిపినాడు. యుద్ధకాలముననే ఈయన మరణించినాడు. సోవియట్ ప్రభుత్వము వచ్చినతర్వాత

భారతీయవిద్యావ్యాసంగము ఎక్కువైనది. రష్యాలోని 'ఎకాడెమీ ఆఫ్ సైన్స్' యొక్క ప్రాచ్య శాఖవారు రష్యన్-హిందీ నిఘంటువును తయారు చేసినారు. కాశీలోని నాగరీప్రచారిణీసభవారు అచ్చువేసిన హిందీశబ్దసాగర మీ గ్రంథమునకు మూలము. ఈ 'ఎకాడమీ' వారు అన్యభారతీయ భాషలకు, రష్యనకు ప్రత్యేకప్రత్యేకనిఘంటువులను ప్రస్తుతము తయారుచేయుచున్నారు. సోవియెట్ ప్రభుత్వముకూడ భారతీయభాషలను నేర్చుకొను వారికి ఎక్కువ ప్రోత్సాహ మిచ్చుచున్నది. లెనిన్‌గ్రాడ్, మాస్కో, టష్కెంట్, టిప్లిస్ మొదలగు పెద్ద పట్టణములలోనేగాక కీవ్, ఖార్కోవ్ మొదలగు వానిలోసహితము హిందీ, ఉర్దూ, బెంగాలీ మొదలగు భారతీయభాషలు నేర్పబడుచున్నవి. రష్యన్ 'ఎకాడమీ' యొక్క ప్రాచ్యశాఖాసభ్యుడగు జార్జి అఖ్లెడియాని గతసంవత్సరము ఢిల్లీలో జరిగిన ఆసియా జాతీయసంస్థకు వచ్చిన సోవియెట్ ప్రతినిధులలో ముఖ్యుడు. టిబ్లిసిలోని స్టాలిన్‌యూనివర్సిటీలో నీతడు సంస్కృతాధ్యాపకుడు.

హిందీ, ఉర్దూలలోనుంచి యిప్పటి కనేక గ్రంథములు రష్యన్‌లోనికి అనువదించబడినవి. ముల్క్‌రాజ్ ఆనంద్ యొక్క 'కూలీ', 'అస్పృశ్యుడు' అనునవి రష్యాలో చాలా ప్రసిద్ధినందినవి. ఎకాడెమీ యొక్క ప్రాచ్యశాఖవారు ఈమధ్య వారి వార్షిక సభలో నారుమాట్లు చర్చించి భారతీయుల రాజకీయ, సాంఘిక, ఆర్థిక, వైజ్ఞానికవిషయావగాహనకు నూతనప్రణాళికను తయారుచేసినారు. ఈ సభలో బెస్కోవ్స్కీ అనునాతడు ప్రేమచంద్ పై వ్యాసమును చదివినాడు. ప్రేమచంద్ యొక్క కథలను, నవలలను, వ్యాసములను అనువదింప నీతడు బూనుకొనినాడు.

మహాభారతము సమగ్రముగా ఐరోపాభాషలలోని కింతవరకు అనువదింపబడలేదు. రష్యావారీభారత దీర్పనెంచినారు. త్వరలో భారతానువాదము రాబోవుచున్నది.

ఈ కొద్ది విషయములను వివేచించినచో అభ్యుదయమునకై ప్రాకులాడుచు, అభ్యుదయమును అనుభవించుచున్న దేశము లేవో తెలియగలదు. మన అభ్యుదయరచయితలవలె నేటి రష్యావారు ప్రాచీన భారతీయవిజ్ఞానము, సంస్కృతి, సంప్రదాయము, సాహిత్యము నిరర్థకము లని భావించుట లేదు. సాహిత్యమును కేవలము భౌతికవిషయములకు, ఆర్థిక విషయములకు మాత్రమే వారు వినియోగించుట లేదు. ఇది మన మందరము గమనింపదగిన విషయము.

**పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి.**

---

## మీసాలు

మగవానికి మీసం, మగువకు సిగ్గు పెట్టని నగలనంటివి. కాని కాలం తారుమారయ్యేకొద్దీ ఆచారవ్యవహారాలలో అనేకతకలు ప్రబలిపోవడంచేత మగవారు మీసాన్ని, మగువలు సిగ్గును పాటించక పోవడం పరిపాటియైనది. ఫలితం—స్త్రీలకు నూత్నయవ్వనంతోబాటు నూనూగుమీసాలు రావడం, పురుషులు యవ్వనపు తొలిరోజుల్లో తొంగిచూచే మొలకమీసాలను మొదలంట గొరిగించుకోవడం మామూలుగా పరిణమించింది. పూర్వం యే వైదిక నిష్ఠాధురంధరులగు బ్రాహ్మణోత్తములో తప్ప, తక్కిన వారంతా తప్పనిసరిగా మీసాలు పెంచేవారు. అది ఆనాటిసంఘమర్యాద. అందులోనూ రాజులవిషయంలో ప్రత్యేకంగా చెప్పనక్కరలేదు. "ముంజేతికి మీసమున్నది రంగారాయుడికి" అన్న బొబ్బిలికథలోని వాక్యం మీసాలప్రతిభను చాటి చెప్పుచున్నది. అదే కథలో మరొకచోట "మూతికి మీసం లేదా నీకూ విజయరామరాజా?" అని రంగారాయుడు విజయరాముని తూలనాడుతాడు. ఇదంతా చూస్తే మహారాజుల ప్రతాపాలకు మీసాలు మానదండాలుగా ఉండేవని తోస్తుంది. కాలప్రభావంచేత యీ రోజుల ప్రతిభావిశేషాలు క్షీణించి క్రమేణ సామ్రాజ్యాలు చిన్న సంస్థానాలై, సంస్థానాలు సర్కారులో కలిసిపోవుచున్నట్లు, మీసకట్ల కుండిన విశిష్టతకూడా నానాటికి తీసికట్టయి తుదకు హిట్లరుకట్టుదాకా రావడం కాకుండా, అవికూడా అంతరించిపోయ్యే సూచనలు కనబడుచున్నవి.

మన పెద్దలు కట్టు, జుట్టు, బొట్టు విషయంలో చూపిన శ్రద్ధ ఒకయెత్తు; మీసకట్ల విషయంలో చూపిన శ్రద్ధ ఒకయెత్తు! ఆ రోజుల్లో వాసననూనెలు పూసి దువ్వి మీసాలకు మెరుగుపెట్టేవారు. అందుకే "మింగ మెతుకులేదు, మీసాలకు సంపంగినూనె"అన్న సామెత పుట్టింది. "క్రిందపడ్డా, మీసాలకు మట్టి కాలే"దన్న వాక్యం పట్టి చూస్తే పరువుమర్యాదలు దక్కించుకొనేందుకు మీసం చిహ్నసాధనమని తెలియుచున్నది. అజాగ్రత్తతో యేపని చేసినా ఆపద తప్పదు అన్న నీతిని "చుట్టకాల్చడంలో తెలివితక్కువైతే మీసాలు కాలు"నన్న వ్యంగ్యవాక్యంలో యిమిడ్చి అందరికీ అర్థమయేటట్లు చేసినారు అనుభవజ్ఞులు. అందుబట్టి యోచించిన ఆకాలంలో చుట్టలతోపాటు మీసాలు యెంత ప్రాశస్త్యం కలిగి యుండినవో బోధపడును. అదీకాక, ఆ సామెత మీసాల సంరక్షణార్థం అగ్నిప్రమాదహెచ్చరికలా పనిచేసేది. ఇంకా పరిశీలిస్తే అసలు పెద్దమనిషి తరహాకే లక్షణంగా మీసాలు వుండేవని తోస్తుంది. ఇచ్చే దాతలు యిస్తే, ఆ యీవిని తప్పించేవారికి మీసాల అర్హత లేదని "రొయ్యకు లేదా మీసము" అని యొక కవి దూషించినాడు.

ఇతదేకాక యింకా కొందరు తమ రచనలలో మీసాలు మెలిపెంచి, వారికీ, వారి కవిత్వానికీ వన్నె తెచ్చినారు. "చెప్పకు మిట్టి తుచ్ఛసుఖముల్ మీసాలపై తేనియల్"అన్నాడు పెద్దన. "నూనూగు మీసాల నూత్నయౌవనమున శాలివాహనసప్తశతి నొడివితి"అని శ్రీనాథుడు తన నూనూగుమీసాలకే చిరంజీవిత్వం కల్పించినాడు. ఆధునికుల్లో చూస్తేకూడా మీసాల ప్రస్తావన దొరుకుతుంది. "కోడెవయస్సు నిన్నలమి గోటికి మీసము చిక్కనాడు"అని మీసాలు మెలిపెంచి, "కుంచెటికిగూడ పౌరుషము నిండిన గాథలు చెప్పి మీసముల్ దీటిన తెల్గువీరులకు"అన్న చోట దువ్వి చూపినాడు మన జాతీయకవి జాషువ. చెల్లపిళ్లవారిని చూచి 'వైదీకికి మీసా లెందు'కని యొకరో అడిగితే "ఒకటి ఆంధ్రం, మరొకటి సంస్కృతం"అని దువ్వి చూపి జవా బిచ్చినారట.

ఇవన్నీ చూడబోతే మన ఆంధ్రకవిత్వం నాడూ, నేడూ మీసాలు దువ్వుకొంటూ తన దర్జాను నిలుపుకొనుచున్నదని గుర్తించకతప్పదు.

మనలో వాదప్రతివాదాలు బలిసి, పాకం ముదిరి పండెండాకా వచ్చేసరికి పణంగా ఒడ్డే పవిత్ర వస్తువు మీసమే. "ఓడిపోతే యిది మీసంకాదు. మాట తప్పితే మీసం గొరిగించుకుంటాను" అంటారు మానధనులు. "పైసా నాస్తి, ప్రబలం జాస్తి; దమ్మిడీ నాస్తి, దసబుసలు జాస్తి"అని లోటారరం, పై బటారంగా గడిపేవారి మాట వస్తే "మీసానికి ఆశ, అంబటికి ఆశ" అంటాము. ఏతత్సందర్భంలో ఒకానొక బుక్కాఫకీరై పోయిన జమీందా రొకడు యింట్లో అంబలి తాగి అన్నంమెతుకు మీసానికి అంటించుకొని వచ్చి అందరియెదుటా దులుపుకోవడం జరుగుచుండగా ఒకనాడు ఆయనగారి పిల్లవాడు వచ్చి "నాన్నా మీసాలమెతుకు పిల్లి తినేసిం"దనగా అందరూనవ్వడం, సదరు జమీందారు "మీసాలపిల్లి మెతుకు తినిం"దని సర్దడం, జ్ఞాపకపరచడం అసంగతం కాదనుకొంటాను. కొందరు ఎన్నడూలేని గొప్పతనం ప్రదర్శిస్తారు. ఎన్నడూ లేని భక్తి కనబరుస్తారు. ఎప్పుడూ వినని వేదాంతం యేకరువుపెడతారు. ఈ పగటివేషాలంతా తమ లోటుపాట్లను కప్పడానికే అయినా, అందులోనే పప్పులో కాలువేసి పట్టుబడిపోతారు. ఉదాహరణం: కొందరు తమపాండిత్యం ప్రదర్శించడం కోసం, "బియ్యం యెంత వ్రెల? బృహస్పతి, వుపవాసం, పాయసం" అంటూవుంటారు. ఇటువంటి నేతిబీరకాయలకుగానే "అలవాటు లేని ఔపాసనం పడితే మీసాలు తెగకాలిందట" అన్న సామెత వచ్చింది.

పైవిషయాలనుబట్టి పరామర్శచేస్తే ఆంధ్రులకూ, మీసాలకూ అవినాభావసంబంధం కద్దని తోచుచున్నది. మన జీవితంలో వీనికి యింత పేరుప్రతిష్ఠలు, మనభాషలో విశిష్టస్థానం, కవితాప్రశంస కలగడమే యిందుకు ప్రబలనిదర్శనం. నిమ్మకాయను నిలిపేటంతటి మీసాల పటిమ ఆంధ్రునికే కద్దు. ఆంధ్రభోజునికి మీసా లుండినవి. ఆంధ్రకవులకు నాడూ, నేడూకూడా అందము చేకూర్చేది మీసమే. ఆంధ్ర

జనాన్ని అయ్యరుహోటల్లో అరవసోదరులు ఆనవాలు పట్టడం మీసాలవల్లనే. ఈనాడు ఆంధ్రుని వ్యక్తిత్వము వీసమైనా నిలిచివుందంటే అది మీసంవల్లనే. ఆంధ్రుని వేసమునకు మీసము అందమునిచ్చును. మీసము పెంచి, వేసమునకు, వ్యక్తిత్వమునకు దోసము వాటిల్లనీక రాష్ట్రము సంపాదించి మీసము గువ్వేది యెన్నటికో యీ ఆంధ్రుడు?

చె. శ్రీ. వెంకటరామయ్య.



## తాతపూడి వెంకటసుబ్బారావుగారు

కాశీ విశ్వవిద్యాలయంలో యం. యస్‌సి. పరీక్ష ప్యాసై, ఆంధ్రవిశ్వవిద్యాలయంలో 'డాక్టర్ ఆఫ్ సైన్స్' కొరకు 3 సం.లు పరిశోధనలు సాగించి, తదుపరి 3 సం.లు హైదరాబాదు ఉస్మానియా విశ్వవిద్యాలయంలో కేంద్రప్రభుత్వంవారి 'బోర్డ్ ఆఫ్ సైంటిఫిక్ అండ్ ఇండస్ట్రియల్ రీసర్చ్' తరఫున ఆముదం నుండి వార్నీషులు, పెయింట్లు, చేయుటనుగురించి పరిశోధనలు జరిపి, కొన్ని పేటెంట్లుకూడ తీసికొని, తరువాత గత ౪ సం.లుగా తాతా ఆయిల్ మిల్సుకంపెనీలో ప్లాస్టిక్ మీద పరిశోధనలు చేయుచుఉండి, అందులో ఇంకా అనుభవము సంపాదించుకొనుటకు బ్రూక్లిన్ పాలీ టెక్నిక్‌లో ప్రపంచవిఖ్యాతి పొందిన ప్రొఫెసర్ మార్కుగారిదగ్గరకు మొన్న సెప్టెంబరు ౭-వ తేదీన విమానంమీద న్యూయార్కు వెళ్లినారు.



# విమర్శనము



## నవభారతము

రచయిత: సీతంరాజు సుబ్రహ్మణ్యశర్మగారు, బి. కాం. (ఆనర్స్). ప్రకాశకులు: సుదర్శన పబ్లిషర్స్, ౧౦/౩ తంబుచెట్టివీథి, మద్రాసు ౧. వెల రూపాయిన్నర.

భారతదేశము తెల్లదొరల పెత్తనమునుండి తప్పుకొని స్వేచ్ఛావాయువులు పీల్చ నారంభించి మొన్నటి ఆగష్టు ౧౫ కు సంవత్సరము పూర్తియైనది. ఈ తొలి యేట ఈ నవభారతములో మంచివి-చెడ్డవి ఎన్నెన్నో రాజకీయ సంఘటనలు జరిగినవి. వాటి నెదుర్కొనుటలో మన ప్రభుత్వమువారు ఎంతెంతో పాటుపడినారు. అలవిమాలిన ఎన్నో ఆటుపాటులకు పాలైనారు; అన్నిటిని నేర్పుతో తప్పించుకొన్నారు. ఆ సంఘటనలు, ఆ కృషి, ఆ ఆటుపాటులు, ఆ పరిష్కారము అన్నియు ఈ పుస్తకమునందు ౧౯ ప్రకరణములలో విశదముగా నిరూపింపబడినవి. వ్యష్టిగా ఇందలి విషయములు చర్వితచర్వణమేయైనను అన్నియు ఒక్కచో కూర్పబడిన ఈ సమగ్రసమీక్ష సమష్టిగా ఒక క్రొత్తదనమును ప్రత్యేకించి స్థాపించుకొన్నదనవచ్చును. రాజకీయసింహావలోకనము చేయగోరువారికి ఇది మిక్కిలి ఉపయుక్తమై యుండగలదనుట కాక్షేపణలేదు.

## కాంగ్రెసు కథలు

మొదటిభాగము. రచయిత: దండిపల్లి వెంకటసుబ్బాశాస్త్రిగారు, ప్రకాశకులు: నవభారత్ పబ్లిషర్స్ లిమిటెడ్, కర్నూలు. వెల ౧ రూ.

ఇది ఒక క్రొత్త పద్ధతిని సంతరింపబడిన కథాసంపుటి. కాంగ్రెసు నిర్వహించిన స్వాతంత్ర్యసమరములో ఎంతో శ్రద్ధాభక్తులతో పాల్గొని, అవక్ర విక్రమత్యాగసాహసములు చూపియు కాలకర్మవశాత్తు తెరమరుగుననే ఉండిపోయిన కొందరు అజ్ఞాతవీరుల యథార్థకథలివి. ఎక్కడెక్కడనుండియో వీనిని పోగుచేసి, చక్కని శైలిలో కమ్మని తీరున రచించి శాస్త్రిగారు నిజముగా మంచిపని చేసినారు. వీనిని చూడగా ఇంకను ఎందరు వీరులు ఇట్లు అజ్ఞాతముగా ఉండిపోయినారో కదా అని జిజ్ఞాస రేకెత్తకమానదు. వారి కథలుకూడ త్రవ్వితీసి శాస్త్రిగారు త్వరలోనే పాఠకలోకమున కందిప్పవలయుదురు.

(స్వీకారము)

## ముసలమ్మ మరణము ఇత్యాదులు

పద్యరచనల సంపుటి. రచయిత డా. కట్టమంచి రామలింగారెడ్డిగారు, ఆంధ్రవిశ్వకళాపరిషత్తు ఉపాధ్యక్షులు. ప్రకాశకులు: గ్రంథాలయపుస్తకశాల, పటమటపోస్టు (కృష్ణా). వెల రూపాయిన్నర.

## నేతాజీ బోసు వీరగాథ

బుర్రకథ తెగకు చేరిన పదము. రచయిత: ప్రయాగ నరసింహశాస్త్రిగారు, బి. ఏ. ౪, మునియపిళ్లెవీథి, సోమశేఖరపేట, మద్రాసు ౨.

## మహాత్మా గాంధీ స్మృతిసంచిక

ప్రకాశకులు: స్త్రీహితైషిణీమండలి, బాపట్ల. వెల ౪ అ.

## మల్లికార్జున పండిత విజయము

గ్రంథకర్త: ముదిగొండ వీరభద్రమూర్తిగారు, మాదల. వెల రూ. ౧-౮-౦.

## కాళహస్తీశ్వర శతకము

మహాకవి ధూర్జటి రచించినది. ప్రకాశకులు: సాధన గ్రంథమండలి, తెనాలి. వెల ౮ అ.

Printed and Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press.
No. 7. Thambu Chetty St., G. T., Madras. Editor—S. Sambhu Prasad.

